# శ్రీ

# రామకృష్ణపరమహంస

జీవితము; ఉపదేశములు.

[తెలుగు]



కింభంపాటి విశ్వనాథముచే

రచియింపబడినది.



ప్రథమముద్రణము 1000 ప్రతులు.



డి. కే. పంత్ చే

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.



 1910. వెల 0-8-0 లు.

# పీఠిక.

సుధీమణులారా!

ఈగ్రంథమాదియందు వంగదేశభాషయందును దరువాత నాంగ్లేయ భాషయందును వ్రాయబడియున్నది. హూణవిద్యాభ్యాసకులకు నీగ్రంథము యొక్క ముఖ్యతనుగూర్చిగాని యవసరమును గూర్చిగాని యిప్పుడిచట క్రొత్తగా వ్రాయనవసరమగుపడదు. ఇక 'శ్రీరామకృష్ణ పరమహంస' గారెవరో యెఱుఁగని సామాన్యులకు నించుకనుడువ వలయునని తోచి యిట్లు చేయుచున్నాను. 'శ్రీరామకృష్ణ పరమహంస' జీవన్ముక్తుడు. కాని యాయన సామాన్య జీవన్ముక్తులవలెగాక భూలోకమునందుండు తన సోదరులతోఁగలసిమెలసి తిరుగుచు వారికి జ్ఞానోపదేశమును జేసి వారి మనోపద్మము భగవత్ప్రభాకరునివైపునకుదిరిగి వికసించునట్లు పాటుబడెను. ఇట్లు చేయుటలో నాయన ప్రయత్నము జయమునుబొందినాడనుట నిస్సంశయము. అక్షరమెట్టిదో యెఱుగనివారికిగూడ దన మృదుమధురభాషణములమూలమున వేదాంతమునందు రుచికలుగునట్లుచేసెను. క్షీరములకు శర్కరతోడగునట్లు శ్రీరామకృష్ణుని సులభశైలికి నాయనయుపయోగించిన సామాన్యోపమానములు తోడ్పడుచుండ దనుపదేశములు వినువారి హృదయకోశములయందుజొచ్చి పనిజేయుచున్నవి. అవి సామాన్య మాటలతోఁ జెప్పబడినను గొప్పవేదాంతరహస్యములను బోధించుచున్నవి. ఇంతయునేల మనగ్రంథనాయకునిగూర్చి యెఱిగినవారిలో నాయనను వేనోళ్లఁబొగడనివారెవ్వరు? ఆర్యులారా! 'శ్రీరామకృష్ణ పరమహంస' యొద్ద మఱియొక విశేషముకలదు, ఆయన యనుభవశాలి. సామాన్యులవలె డాంబికముగా నొరులకు నుపదేశములు చేయువాఁడు కాఁడు. చిన్ననాటినుండియు లోకమును బరిత్యజించి సమస్తవేదాంతరహస్యములను ననుభవమూలమునఁ దెలిసికొని పరులకు బోధించెను. అట్టి యీమహాత్ముని చరిత్రఁజదివినను జాలును. గ్రంథమాసాంతము జదివినవారిలో విశేషముమందికి భగవంతునియందు బుద్ధితిరుగక మానదు.

ప్రారంభకుఁడను ఇంతయత్యల్ప సామర్థ్యముగల్గి పుస్తకములు వ్రాయుటయెంత వెట్టిసాహసముకేయుటయగును? అందులో నిట్టి వేదాంతగ్రంథమును రచియింపదలచుట యెట్లుండునో మీరేయూహింపుఁడు. ఇంతకును నన్నీ పుస్తకము వ్రాయఁ బ్రోత్సాహపఱచినది హూణభాషయందుగల శ్రీపరమహంసగారి చరిత్రఁ జదువుటవలన గలిగిన యానందమే కాని మఱివేఱు కాదు. ఇకనీపుస్తకమును వ్రాయుటయందు శైలియందేమి వ్యాకరణమునందేమి శబ్దప్రయోగమునందేమి మఱియితర విషయమునందేమి యనేకతప్పులను లోపములను జేసియుందుననుట నిస్సంశయము. గ్రంథవిషయమునందేమైనఁ దప్పులున్న యెడల నవి నాతప్పులేగాని మఱియెవ్వరివి కానేరవు కనుక పెద్దలైనవారు నేనొనగించిన సకల విధదోషములను దయార్ద్రచిత్తులై మన్నింప ప్రార్థించుచున్నాడను.

ముద్రణమునందనివార్యమైన దోషములుకొన్ని కలిగినఁగలుగవచ్చును. నాకీపర్యాయముతగిన యుత్సాహముకలిగి యీగ్రంథమునకు బునర్ముద్రణము పడవలసినగీతయే యున్నయెడల నప్పుడు సాధ్యమైనంతవఱకు సవరించుకొనెదను. జ్ఞానవిషయమున వృద్ధులైనవారెవ్వరైనను నేను ఘటించినదోషములను లోపములను గనుబఱచి మార్పుల జేసికొనవలసినదని సకారణంబుగ దెలియబఱచినవారి సలహాలను వందనపూర్వకముగ గ్రహించుటకు సిద్ధముగనున్నవాఁడను.

ఇప్పుస్తకమును వ్రాయునప్పుడు నాకు విశేషముపకారమొనర్చి తమ స్వార్థత్యాగమహాగుణమును వెల్లడిపఱచినట్టియు నాప్రాణస్నేహితులునైన గుంటుపల్లి సుబ్రహ్మణ్యమునకు, గుంటుపల్లి శివానందమునకు వేనవేలు వందనములర్పించుచున్నాడను. బెజవాడ హైస్కూలులో నాంధ్రోపాధ్యాయులగు మ॥రా॥రా॥శ్రీ గొల్లపూడి లక్ష్మణశాస్త్రిగారుగూడ నావందనములకుఁ బాత్రులైయున్నారు.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

కంభంపాటి విశ్వనాథం.

శ్రీమరకతేశ్వరాయైనమః.

—* అవిఘ్నమస్తు. *—

## శ్రీ రామకృష్ణ పరమహంస.

### —* తప్పొప్పుల పట్టీ. *—

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 13 | 1883 | 1833 |
| 2 | 28 | సెఱుఁగ | నెఱుఁగ |
| 3 | 12 | ధృష్టాంతరము | దృష్టాంతరము |
| 4 | 9 | ప్రశాశానుభవము | ప్రకాశానుభవము |
| 4 | 13 | మనోకలశము | మనఃకలశము |
| 5 | 7 | పనఁల | వలనఁ |
| 5 | 21 | యల్ప | యనల్ప |
| 6 | 3 | వృథాకోరికలు | రిక్తకోరికలు |
| 6 | 7 | వ్రస్తుత | ప్రస్తుత |
| 6 | 13 | విముక్తుఁడ | విముక్తుని |
| 6 | 14 | నామెభర్తః | నామెభర్త |
| 7 | 7 | వినవేర్చిన | వినియున్న |
| 7 | 12 | సంయోగము | సంఘటన |
| 8 | 9 | యింకొక | నింకొక |
| 8 | 1[illegible] | ప్రంచము | ప్రపంచము |
| 8 | 17 | యన్భృమయిన | యద్భుతమయిన |
| 8 | 18 | మాత్రమే | ను |
| 10 | 10 | యుండియుండి | యుండియుండు |
| 10 | 18 | లమితయాసక్తి | లమితాసక్తి |
| 11 | 9 | చెప్పలేరు | చెప్పలేరు? |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 11 | 24 | కాకున్న | కానున్న |
| 11 | 25 | యీశ్వర | నీశ్వర |
| 11 | 26 | ముందుయాసక్తి | ముందునాసక్తి |
| 11 | 27 | యుపదేశ | నుపదేశ |
| 12 | 1 | పుస్తుక | పుస్తక |
| 12 | 13 | కలసి | గలసి |
| 12 | 22 | మొదలగువవి | మొదలగునవి |
| 12 | 25 | సత్పదార్దము | సత్పదార్థము |
| 13 | 2 | బానిసత్వము | బానిసతనము |
| 13 | 4 | మనోస్వేచ్ఛ | మనస్స్వేచ్ఛ |
| 13 | 8 | విషయమువ | విషయమున |
| 13 | 12 | పైఁబెట్టు | బైఁబెట్టు |
| 13 | 21 | దగులుయారు | దగులారు |
| 13 | 26 | కనుగొననేర్చనంత | కనుగొనలేనంత |
| 14 | 10 | యదార్ధ | యథార్థ |
| 14 | 23 | తాటి | త్రాటి |
| 14 | 25 | మతమునుయొక | మతమునొక |
| 15 | 3 | పరమాత్మనుయేల | పరమాత్మనేల |
| 15 | 12 | జెప్పఁబడు యీశ్వరు | జెప్పఁబడునీశ్వరు |
| 15 | 27 | గురువుయొద్ద | గురువునొద్ద |
| 16 | 2 | వాఁడి | వాని |
| 17 | 10 | యీరెండు | ఈరెండు |
| 18 | 2 | యాశ | నాశ |
| 18 | 12 | యథార్ధ | యథార్థ |
| 18 | 22 | సంప్రాప్తి | సంప్రాప్త |
| 19 | 10 | వెళ్ళిరి | వెల్లిరి |
| 19 | 12 | కాయలున్నది | కాయలున్నవి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 19 | 28 | దీసుకొని | దీసికొని |
| 20 | 3 | యీమూఁడవ | నీమూఁడవ |
| 20 | 25 | వదలిబోవును | వదలిపోవును |
| 21 | 12 | మూడతలచును | మూఁడఁదలఁచును |
| 21 | 21 | దానిని | వానిని |
| 21 | 28 | బ్రాహ్మణ | బ్రాహ్మ |
| 22 | 4 | యదార్థము | యథార్థము |
| 22 | 17 | దీసుకొని | దీసికొని |
| 22 | 24 | అట్ల | అట్లే |
| 23 | 8 | యెక్కడనే | యెక్కడనో |
| 23 | 19 | గురుపువు | గురువవు |
| 23 | 27 | భగవంతునికి | భగవంతునకు |
| 23 | 28 | బ్రాధన | బ్రార్థన |
| 24 | 8 | గ[illegible] | గద్ద |
| 25 | 6 | జంధ్యము | జందెము |
| 41 | 13 | మఱపోతివి | మఱచిపోతివి |
| 42 | 15 | జేసినదెవరని | జేసినదెవ్వరని |
| 45 | 13 | భక్తులై వారి | భక్తులైనవారి |
| 45 | 17 | మనస్సుయందు | మనస్సునందు |
| 53 | 15 | సర్బము | సర్పము |





శ్రీ మరకతేశ్వరాయనమః.

అవిఘ్నమస్తు.

# “శ్రీరామకృష్ణపరమహంస”

శ్రీ రామకృష్ణపరమహంసగారియొద్దఁ గల యనేక సుగుణములను జూచి మానవకోటి సకలకాలములయం దాయనను బ్రేమించి పూజించుచుండును. ఆయనకుఁ గల గుణజాలమంతటను మన మొకదానిని ముఖ్యముగ 'నాయనగొప్పతనమునకు విశేష ముపకారముఁజేసిన దిది' యని యిచటఁ బేర్కొనవచ్చును. దీనిఁ బ్రత్యేకముగ నుడువ నవసరములేదు. ఏలయన రామకృష్ణునిచేఁ జెప్పఁబడిన యొక సుందరమయిన కథగలదు. దానిని వక్కాణించినఁ జాలును. అతిసుందరమయిన తోటగలదని విని ముగ్గురు మనుష్యులు దానిని వెదకుటకుఁ బ్రయాణమైరి. కాళ్లకు నొప్పులు దేహమున కాయాసముఁ గలుగునట్లుగ వా రట్లు చాలదూరము నడచివెళ్ళిరి. తుదకు వారి యదృష్టవశమున వారి కాతోట యగుపడినదిగాని దానిలోపలికిఁబోవుటకు నొక పెద్దగోడను దాటవలసివచ్చెను. కష్టించి వా రాగోడపై కెక్కి కన్నులపండువగునటుల నాతోటలోఁగల వృక్షజాలమును మఱియితర సుందరావహములను బొడఁగాంచిరి. వాని నన్నిటినిఁ జూచుటవలనఁ గలిగిన యానందసాగరమందు మునిఁగినవారయి వారిలో నిద్దరు తటాలున నాతోటలోని భాగమునకు దుమికిరి. కాని మూఁడవమానవుఁడు దుమికినవారితో సమానముగ సంతోషమునుబొందియు వీరివలెఁ దోటలోపలికిఁ దుమికినవాఁడుకాఁడు. ఈయనకు నట్లుచేయుటకు నిచ్చగలదు. దుముకఁబోయెనుగాని యాసమయమునం దజ్ఞానములో మునిఁగియున్న తన సహోదరులసంగతి జ్ఞాపకమునకువచ్చెను. అప్పుడు తక్షణమే వీరి యందఱికి నా శృంగారవనాతిశయమును, దానికిఁబోవుమార్గమును దెలుప నిచ్ఛఁగలవాఁడయి వెనుకకుమఱలి తిన్నగాఁ గోడనుదిగివచ్చినవాఁడాయెను. ఆహా! ఈ మానవుని యుదారబుద్ధి నేమనిచెప్పవచ్చును! ముక్తినిఁగోరి సదా భగవన్నామస్మరణఁ జేయుచుండియు

పాపకార్యములసలుపుటయం దాసక్తిఁగల మానవకోటి యజ్ఞానమంతయు రూపుమాపి జ్ఞానోపదేశమువలన వారిని సన్మార్గమునకుఁ దీసికొనిరావలయునని వారిమధ్య బ్రతికి యుండు మహాపురుషులందఱు పైఁజెప్పఁబడినకథలోని మూఁడవపురుషునివంటివారని శ్రీ రామకృష్ణుఁడు చెప్పుచుండెడివాఁడు. ఈ మహాత్ములు కష్టములఁబొందుచుండు మానవకోటి సౌఖ్యమునకుఁ బాటుపడక నిత్యసమాధియందుండువారికంటెఁ దక్కువ జ్ఞానవంతులుకారు. వారికిని సమాధియందుండుటకు నిష్టముండునుగాని జ్ఞానభానోదయములేకచో నజ్ఞానమునందు నిద్రించుచున్న తన సహోదరులందు వారికిఁగల దయ వారి నట్లుచేయుటకుఁ బ్రేరేపించుచున్నది లోకోద్ధారణమే వారి ముఖ్యపనియై యున్నది. శ్రీ రామకృష్ణపరమహంస యిటువంటిమహాపురుషులలో నొకరు. పుట్టినప్పటినుండియు నాయన సంసారబంధనముచేతఁ గట్టుఁబడియుండలేదు. ఆయన జీవన్ముక్తుఁడు. అయిన ను తన జీవితమును లోకమునకు ధారవోసెను.

## పుట్టుక; చిన్నతనము.

శ్రీ రామకృష్ణుఁడు కుదిరాంచటర్జీగారి కుమారుఁడు. కుదిరాం వంగదేశమం దొకగ్రామమందునివసించు వైదికబ్రాహ్మణుఁడు. రామకృష్ణుఁడు హూణశకము 1833 వ సంవత్సరమున ఫిబ్రవరి యిరువదియవదినమున 'కుమార్ పుకర్' యను గ్రామమునందు జన్మించెను. ఈయనతండ్రికిఁబుట్టిన ముగ్గురిలో మూఁడవవాఁడు. చిన్నతనమునం దీయ నను గదాధరుఁడని పిల్చుచుండిరి. పసితనమం దీమహాపురుషునకుఁగల యప్రతిమానగ్ర హణశక్తినిఁ దెలుపుటకు నొకచిత్రమయిన కథగలదు. 'నీవు దుర్గ్గదశనుగలిగియున్నయె డల రక్తముఁగ్రక్కుద' వని యొకపర్యాయము రామకృష్ణుని పెద్దన్నగారీయనతోఁ జెప్పెను. రామకృష్ణున కిది యంతయు మనస్సునకుఁ దగిలినది గావున నాయన నిజముగ నెత్తురుఁగ్రక్కెను. ఈయనతలిదండ్రులు తమ మూఁడవకుమారుని యుక్తకాలమునం దు బాఠశాలకుఁబంపిరిగాని యీతనికి విద్యలందుమనస్సులేకపోయెను. అంతటఁ గాళికా దేవి యర్చకత్వమునకుఁ గలకత్తానగరముయొద్దనున్న దక్షిణేశ్వరమునకు వెళ్ళి యచటనుం డెను. అప్పటినుండియు సాక్షాదీశ్వరసందర్శనముఁ జేయవలయునని కుతూహలమా యన మనమునఁ గాఢముగఁ దగులుకొనెను. 'ఇది నా కప్పుడుసంప్రాప్తమౌనా' యని యహర్నిశములు చింతించుచుండెడివాఁడు. ఒక్కొకదినమున దేవిఁ బూజచేయుటఁ గూడ మాని "ఓతల్లీ! యొకదినము వ్యర్థముగాఁ గడచిపోయినది. ఇంకను నీవు వచ్చి నాకుఁ బొడసూపవైతివి. నాకుఁగల యల్పాయువులో నప్పుడే యొకదినము గడచినది. కాని సత్పదార్థము సెలుఁగఁజాలనైతిని" యని యీవిధముగ భూమిపైఁబడి చింతిం చుచుండెడివాఁడు. ఈసందర్భమున వివేకానందస్వామి యిట్లు వ్రాయుచున్నాడు.

"బాల్యావస్థయందుఁ దాను సూర్యుఁ డెప్పు డుదయించినది యెప్పుడ స్తమించినది చెప్పలే కుంటిననియు కొన్ని సమయములయందు వారములవఱకు మఱియేవిచారణయు లేక చెక్కులపై నేత్రాంబువులు ప్రవహించుచుండగాఁ 'ఓ జగన్మాతా! నాలోనున్న పరమాత్మను నాకుఁ గనపఱచుము నాకు నీయందుఁదప్ప మఱియితరులయందుఁ గోరిక లేదని యెఱుంగుము' యీ ప్రార్థనమాత్రము నా నోటనుండి వచ్చుచుండెననియు నాతో రామకృష్ణుఁడు పలుమాఱులు చెప్పియున్నారు." 'భామ, బంగారము' ఈరెంటియొక్క పరిత్యాగమే నిజముగ నాధ్యాత్మికమయినజీవనమునకు మొదటఁ గావలసినదని యీ కథానాయకుఁడు చక్కఁగా గుర్తెఱిఁగినాఁడు. తన స్వంతమగు స్వల్పాస్తి సర్వస్వమును విసర్జించి 'యిక నెన్నఁడు ధనము ముట్ట' నని యొక దీక్షవహించెను. తరువాతఁ గొంతకాలమునకు సమాధియందున్నపుడు నాణెమొకదాని నీ మహానుభావుని తనువున కంటించినమాత్రమున నొడలుయొక్క యాభాగము ముడుచుకొనిపోవుచుండెను. ఆయనకు ధనమునందుఁగల పరమానురాగమును దెల్పుటకు నింతకంటెఁ బ్రబలదృష్టాంతరము కావలయునా? మఱియు శ్రీ రామకృష్ణుని తలిదండ్రులు తమ తృతీయతనయునకుఁ బసితనమందే శారదాదేవినిచ్చి వివాహమొనర్చిరి. గుణవతియగు శ్రీ శారదాదేవి కడకువెళ్ళి శ్రీ రామకృష్ణుఁడు "జగన్మాతయగు నాతల్లిఁ బూజించుటకు నాకే కాంతము కావలయును. వివాహమను త్రాటిచేఁ గట్టఁబడిన నాకే కాంతము లభించుట దుర్లభము. కావున నీవు కరుణార్ద్రచిత్తవై నీకును నాకును గల వివాహసంబంధమును దెగఁగోసి నన్ను విడుదలఁజేయుము"ని ప్రార్థించెను. పతికోరికఁ గొనసాగించుటకుఁ దలఁచి శారదాదేవి తన మృదుమధురభాషణములచే భర్తను దేవీపూజకై మఱింత ప్రోత్సాహపఱచెను. తరువాత శిష్యురాలై యాయనను సేవించినది. తోతాపురియను మహాత్ముఁడును, మఱియొక సన్యాసినియును శ్రీ రామకృష్ణునకు యోగమును నేర్పి పెక్కు వేదాంతరహస్యములను బోధించెను. నిర్వాతి నీతఁ డీశ్వరావలోకనేచ్ఛుఁడై యమితంబగు కృషిఁజేసెను. ఇట్లు చేయుటలోఁ దనదేహమునుగూర్చి యేమాత్రమును జాగ్రత్తపుచ్చుకొనినవాఁడుకాఁడు. ఆకాలమందు శ్రీ రామకృష్ణున కాయనస్నేహితులు సాయమొనర్పనిచో నా మహానుభావుఁ డా దెబ్బలోనే పరలోకయాత్రఁ జేయవలసినవాఁడు. కాని దేవునిదయవలన నా దెబ్బకాచుకొని బ్రతికి తనయసమానకృషికిఁ దగినఫలమునుఁ బొందినవాఁడాయెను. ఆకాశములోని యంబుదమురీతి మానవజీవాత్మకు స్వాభావికమగు సరిహద్దు రామకృష్ణునిజీవాత్మ దాఁటిపోయి పరమాత్మలోఁ జేరినది. మానవునకింతకంటెఁ బొందఁదగినదేది?

'ఇది నాదేహమను మాటయే' యాయనకుఁ దప్పిపోయినది. 'ఇది నాతల్లి నివాసస్థల'మని శ్రీ రామకృష్ణుఁడు తనతనువునుఁజూచి పలుకుచుండెడివాఁడు. ఈ సందర్భ

మున సహోదరి 'నివేదిత' యిట్లు వ్రాయుచున్నది. తన స్వభావమును గనీషము పండ్రెండు వత్సరములు విశ్రాంతియనుమాట తెలియకుండునట్లున్న యనివార్యమయిన యవసరమునుం దన్ను బ్రేరేపింపఁగ నంతరాత్మతో యుద్ధమునువిడువక పట్టుదలతోఁ జేసెను. తుదకాకలహములోజయించి తన గమ్యస్థానమునుఁ జేరినవాఁడాయెను. దేవి సాక్షాత్కారమయ్యెను. ఆ నిముసమునుండియుఁ బసిబిడ్డతీరునఁ దన తల్లిహస్తములయందుఁ దాను సురక్షితముగనుండెను.

## మధ్య కాలము.

రామకృష్ణుఁడు దేనినిఁగోరి యప్రతిమానమయినయోర్పుగలిగి విసుకను మాటలేకఁ గష్టించెనో దానిఁ బొందఁగలిగెనని యిదివరలో వ్రాసియుంటిమి. ఇంతటితో నాయన కృషి తుదకురాలేదు. విశ్వప్రకాశానుభవమును భంగపఱచనోపు ప్రతియుద్దేశమునుండియు విడుదలయగుట కాయన బహుప్రయత్నములఁజేసెను. ఒకానొకప్పుడీయన నగ్ర జాతిలో జన్మించితిమియను గర్వరహితుఁడను కావలయునను కోరికజనించినది. అది మొదలు కల్మషపూరితంబులగు ప్రతి మాలవానిగుడిసెయుఁ బరిశుభ్రతఁజెందునట్లు చేసెను. ఈపని పూర్తియగువఱకాయన మనస్సు శాంతియొందఁగదు. ఆయన మనోకలశము 'సర్వభూతదయ' యను రసముచే నింపఁబడియున్నది. శ్రీ రామకృష్ణుఁడు పరుల కష్టములఁజూచి సహింపఁజాలఁడు. మధ్యకాలమునందుఁ బరమతములయందుఁ గల సత్యాసత్యములఁ గనుఁగొనుటకీయనకు నిచ్ఛపొడమినది. ఈకాలమున కీమహాత్మునకు నొక మహమ్మదీయసన్యాసియగుపడి మహమ్మదీయమతసిద్ధాంతముల బోధఁజేసెను. ఈ మతములోఁ జెప్పఁబడిన కర్మలును ద్రొక్కఁబడినమార్గములను శ్రీరామకృష్ణుఁడు చక్కఁగఁ బరిశీలించిచూచెను. తుదకాయనకుఁ దానిదివఱలో హిందూమతమార్గమునఁ గనుఁగొనిన భగవదాలయమునకు మహమ్మదీయమతమార్గము మఱియొకటియని తెలిసినది. ఈవిధముగఁ గ్రైస్తవమతముకూడ యొకమార్గమేయని యెఱింగెను. రామకృష్ణుని యభిప్రాయములో నన్నిమతములు భగవంతునిజేరుటకు మార్గములే. కొన్నివేళల పరమహంస గోపికాస్త్రీవేషములధరించి కృష్ణునిరాకకై యెదురుచూచుచున్నట్లుగఁ గూర్చొని పూర్వమా శ్రీకృష్ణునియెడ గోపికలుచూపిన పరమానురాగము నభినయించును. మఱికొన్ని సమయములయందు రామభక్తాగ్రేసరుఁడగు హనుమంతునిరూపముఁ దాల్చి చెట్లపైనెక్కి ఫలములమెక్కుచు 'రామ, రామ' యని నోటఁ బలుమాఱుచ్చరింపుచుఁ గాలముఁజఱుపుచుండెడివాఁడు. ఈవిధంబున ననుపమానంబగు పరమేశ్వరభక్తిఁగలిగి శ్రీ రామకృష్ణపరమహంస తన జీవితకాలములో నలువదివత్సరములు వెళ్ళఁబుచ్చెను. ఈరామకృష్ణుఁడు ప్రేమించనిదియు, బూజసేయనిదియు హిందూదేశములో నొక్కవస్తు

వుకూడ లేదు. తనయొద్ద నదివఱలోలేని గుణమేమయిన మఱియేయీశ్వరార్చనానియం దగుపడినను దనకది పట్టుఁబడువఱకు వదలువాఁడుకాఁడు.

## ఉపాధ్యాయుఁడు.

తమ కీశ్వరుఁడు ప్రసాదించిన యొక యఖండమహిమాన్వితుఁడైన మహాఋషునిగ రామకృష్ణుని లోకులు కాలమతిక్రమించినకొలఁది నెమ్మదిగఁ దెలిసికొనసాగిరి. జ్ఞానాధికారముల రెంటినిఁ గలిగిన మానవులువచ్చి శ్రీ పరమహంసపాదములముందఱఁ గూర్చొనుచుండెడివారు. కేశవచంద్రసేనుని మనస్సు మన కథానాయకుని కీర్తిగాయనఁబడు నయస్కాంతముచే నాకర్షింపఁబడియె. రామకృష్ణుని బోధలవనఁ లజాలఫలితమునొందిచంద్రసేన్ నూతనమతము నొకదానినేర్పాటుచేసెను. వంగదేశస్థుఁడును, పట్టపరీక్షలో కృతార్థుఁడై నట్టివివేకానందస్వామి శ్రీరామకృష్ణపరమహంసశరణుఁజొచ్చెను. ఈయన యీయననుఁగూర్చి “భవిష్యత్కాలమున నీవు మహాపురుషుడ వగుదు”వని ముందుగఁజెప్పెను. ప్రపంచమంతటను సూర్యుఁడేవిధమున వెలుతురుఁ బ్రసరింపఁజేయునో యాతీరున రామకృష్ణుఁడు జాతిమతభేదములం బాటింపకఁ బ్రతిమానవునకునుఁ బరబ్రహ్మజ్ఞానమును బోధించుచుండువాఁడు. ఆయన జీవితకాలాంతమందు కొద్దివత్సరములు దన సోదరుల ముక్తికై యెడతెగనికృషిలోఁ గడపఁబడెను. మాట్లాడలేనంత జబ్బుస్థితిలో నుండియు శ్రీ రామకృష్ణుఁడు పరులకు జ్ఞానోపదేశముఁ జేయుచుండెడివాఁడు. హూణశకము 1886 వ సంవత్సరము అగష్టు పదునాఱవదినమున నమ్మహానుభావుని జీవాత్మ పరమాత్మలో లీనమైనది.

## రామకృష్ణుని ప్రాపంచిక సంబంధము.

శ్రీ రామకృష్ణుని స్వభావమాధుర్యమును సకలప్రాణికోటియందు నాయనకుఁగల యపారమయిన దయయును దగురీతిని వర్ణించుటకు వీలుకాదు. ఆయన దయార్ద్రహృదయము భూలోకమంతయు నందుబాటులోనున్నది. ఈశ్వరసాక్షాత్కారమునకై యమ్మహాత్ముఁడు పడిన యల్పకృషినిఁజూచినంతమాత్రమున మన మాయనకుఁ బనివిషయమునందు నిరుపమానమగు పట్టుదల కలదని యూహింపవచ్చును. ప్రతిసంగతియొక్క నిజము గనుగొనుటయందు రామకృష్ణునకుఁ జాలకోరికఁగలదు. వాక్కునందు, వాదనయందు నపరిమితమయిన చాతుర్యమునుజూపుచు “భగవంతుఁ డిటువంటివాఁడని యటువంటివాఁడ”ని వాదనసల్పు కోవిదులఁజూచిన నీయన విశేషముగా నసహ్యపడును ఈయన పనులయందు డాంబికమగుపడదు. ఈయనప్రవర్తన నటనతోఁగూడినదికాదు. క్రియయందుఁ బ్రవర్తనయందును మితిలేని కరుణఁగనఁబరచువాఁడు. ‘పరమహంస’ బుద్ధివా

డ్డది. దేనినిఁజూచినను దాని నిజానిజములను జెప్పి వర్ణించుటకు రామకృష్ణునకు నతిసూక్ష్మబుద్ధిగలదు. ఇంతయేల, ప్రతిమానవునకును నామహానుభావునియొద్దకుఁబోయి నిలచినంతనె యదివఱలోఁ దనకుఁగల వృథాకోరికలు, ఫలమొసంగని ప్రపంచవిషయములందలిరుచి రూపుమాసిపోయి యీశ్వరుని నిత్యము ధ్యానించుటయందుఁగోరికయుదయించును. శ్రీ రామకృష్ణునిపైఁ గొంతమందిఘనులుపల్కు వృథాలాపములను వివేకానందస్వామి తన మహావాగ్విభవమును వెల్లడిచేయుపల్కులచే నిరాకరించును. అప్పుడప్పుడు ప్రస్తుతకథానాయకుండు మోటువారివలెమాట్లాడునని కొందఱందురు. నిజముగ నాలోచనజేసిచూచిన నీయన యింద్రియములఁ బూర్ణముగా జయించినవాఁడుకాని సామాన్యుఁడుకాఁడు. పసులుబ్బునట్లుమాట్లాడుట రామకృష్ణునిచేతఁగాకపోవుటవలనను ప్రతివిషయముయొక్క సత్యముఁగనుఁగొనఁగల సామర్థ్యమీయనయందుఁ గలదేయను యసూయవలన, నొరులు పైఁజెప్పఁబడిన నింద నీయనయందుమోపిరి శ్రీ రామకృష్ణుఁడు భార్యనువదలినాఁడని మఱికొందఱందురు. గుణవతియు, భార్యయు నగు శారదాదేవి కడకేగి యీమహాఋషి "నీవు దయయుంచి నన్ను వివాహబంధమునుండి విముక్తుఁడఁజేయుమా" యని ప్రార్థింపఁగ నామె భర్త యట్లేచేయుట కొప్పుకొనినదనుమాట నీవృథానిందవేయువారు మఱచిరికాబోలు? అవును పరనిందారోపణాభిలాషులకు సారాసారవిచక్షణయుండకుండుట సహజముగదా! "మీరు మీభార్యతోనుండి యేలకాపురముఁజేయరు?" అని యొక లోకజ్ఞుఁడు శ్రీ రామకృష్ణునిఁ బ్రశ్నించిరి. ఈప్రశ్నకు వీరు "శారదాదేవి నాకు తల్లివంటిదిగాని భార్యకాదు. లోకమునందుగల కాంతలందఱు నాభావమునకుఁ దల్లులవంటివారని యుత్తరమిచ్చిరి. 'ఏమతమునయినఁజూచి పరిశీలించి యూరకుండుటయేగాని దానిలోపములను, దురాచారములఁగనుఁగొని యసహ్యపడఁడ'ని శ్రీ రామకృష్ణునియందు మఱియొకతప్పెంచిరి. వేశ్యలనుఁ ద్రాగుబోతులనుఁజూచి యేల దూషింపవనిరి. కాని యీవిషయమునందిట్లుచేసినఁ దీయనయొక్కఁడే కాదు. క్రీస్తుజీవచారిత్రముఁదీసి మనమాయనచేసిన పనులఁజదివిన నాయనయు రామకృష్ణునివలె వర్తించెనని తెలియవచ్చును. చాటునఁ దాము కూడనికార్యములన్నియుఁజేయుచు బయటికిఁ బాపకార్యవర్తనులయందు సజ్జనులయందు దోషములు వెదకుటకు నభిలషించునట్టి స్వభావముగల్గినట్టియు. తమకుఁగలుగఁజేసిన మంచికంతకును భగవంతునిఁబొగడుచు క్షుత్పీడితాది దుఃఖితులకు సహాయముఁజేయుటకు నిచ్ఛగింపనట్టియు ఫిలిస్టైన్ వేదాంతులు మన శ్రీ రామకృష్ణునిఁ బొగడకపోదురుగాక! గొప్పయాత్మజ్ఞానులకు ఫిలిస్టైన్లు వైరికోటిలోఁజేరినవారనుట క్రొత్తసంగతికాదుకదా! లోకమంతయు శ్రీ రామకృష్ణుని సత్కార్యములను, సదుపదేశములఁ దెలిసికొని యొప్పుకొనినటులను, జగత్తులోనివారందఱికి జ్ఞానబోధఁజేసి ముక్తికిపాటుపడునట్లుగాను ప్రతిసంగతియొక్క

నిజముఁ దెలిసికొనువిధము నేర్పుటకుఁ బుట్టినవాఁడీయన యనిలోకము తెలిసికొనినదనుటకు సందేహ మణుమాత్రము లేదు.

## శ్రీ రామకృష్ణుని బుద్ధికుశలతయొక్క కొన్ని చిహ్నములు.

శ్రీ రామకృష్ణపరమహంసపాఠశాలలోఁ జదివి నేర్చుకొనినది కొద్దియైనను నాయన బుద్ధి పలువిధముల వికసించినది. ఆయనకు సంగీతమునందుఁ జాలరుచిగలదు. రసజ్ఞానసంబంధమయిన రుచి రామకృష్ణునకు విశేషముగఁ గలదు. అతిసుందరముగాఁ జిత్రములను వ్రాయఁగలఁడు. ఇదియొక యాశ్చర్యమా? ఏమానవుఁడును జూడ నేరని యనుపమానసౌందర్యమునుఁ జూచి యెవ్వరును విననేరని మధురమయినసంగీతమును విన నేర్చినవాఁడుఁ కనియు, చిత్రకారుఁడు కాకుండుటకు వీలున్నదా? ఈ సందర్భమున 'యమర్సన్' యిట్లు వ్రాయుచున్నాఁడు. అణకువ, ప్రేమ, న్యాయము, కోరిక వీనినిఁ గల్గినవాఁ డిదివఱలోనే కళలను, శాస్త్రములను, బద్యకావ్యములందును, ఉపన్యాసములిచ్చుటయందును మొదలగువానియందు జ్ఞానమును సంపాదించియుండును.

ఆలోచనఁ జేసి సంయోగముఁ జేయు నేర్పు 'పరమహంస'యొద్ద నత్యధికముగఁ గలదు. యథార్థముయొక్క వివిధరూపములఁ గనుఁగొనుటకు నీయన కమితాసక్తి కలదు. ఈ మహానుభావునిమనస్సు సర్వజనసమ్మతముగనుండుట యత్యద్భుతావహము. హిందూమతసిద్ధాంతములకనుకూలముగనడచుకొని గొప్పగొప్పసిద్ధాంతములనిజముననుభవసిద్ధముగ రామకృష్ణుఁడు కనుఁగొనెను. ఈయనసామాన్యముగఁ బండితులుచేయు వివాదమార్గమున కసూయఁ జూపి దానిని విడిచిపెట్టి చక్కని యుపమానముల నుపయోగించి మతమును బోధించెను. ఆయన యుపదేశవాక్యములు సరళముగనుండి సాధారణముగనుండును. నోటవచ్చుమాట సాధారణమేకాని బోధించు తత్త్వార్థము సామాన్యమయినది కాదు. వానిని జదివికాని లేక వినికాని "ఇంతసరళముగ నింతసాధారణముగ నంతంత గొప్పసిద్ధాంతముల బోధించినవా రిదివఱలో నుండిరా?" యని యెవరు ప్రశ్న వేయరు?

## హిందూదేశమందు మతాభివృద్ధి: రామకృష్ణుని కృషి.

మనహిందూదేశమునందుఁ గల్గిన మతాభివృద్ధినిగూర్చి యొకపెద్దచరిత్రవ్రాయవచ్చును. ఇప్పుడదియంతయు వ్రాయుటకు వీలులేదు గనుక నాయభివృద్ధికి రామకృష్ణుఁ డెంతవఱకు కారణుఁడయ్యెనో యంతవఱకు నిచట వ్రాయఁబడును. ఆర్యావర్తములోఁ బ్రాచీనమహోన్నత మతముకర్మలే ప్రధానముగాఁగల మతముగామారనున్న సమయమునబుద్ధుఁ డవతరించెను. ఈ మహాపురుషుడు నీతిశాస్త్ర వేదాంత శాస్త్రములననుసరించియుండున

ట్లొక నూతనమతమును స్థాపింపఁ బ్రయత్నించె- పూర్వమెన్నఁడు నమ్మచుండనటువంటి దుర్విషయములఁ గూడ జనులిప్పుడు నమ్మసాగిరి- ఈ సమయమున దేశ ముద్ధరింపఁ బుట్టినది శంకరాచార్యులు- ఈయన జన్మించిచేసిన పనియేమి? సులభముగనుండి గొప్ప విషయముల బోధించు వేదాంత మతవృక్షమునకుఁ దిరిగి యీ శంకరాచార్యులు జీవముపోసెను. ఈయన మొదలిడిన పనిని వీరితరువాత వారగు శ్రీరామానుజాచార్యులు మధ్వాచార్యులు పూర్తిజేసిరి- హిందూదేశమునకు మహమ్మదీయులు వచ్చిన తరువాత రామానంద, కబీరు, నానక్, చైతన్య, దాదు వీరు పెక్కుమతవిషయిక మార్పులఁజేసిరి. వీరుమతమునందుఁ బ్రతిమానవునకు పెక్కుడు స్వాతంత్ర్యమిచ్చిరి- భక్తియోగమునకు పెక్కుడు ప్రాముఖ్యత యివ్వఁబడినది- అప్పటినుండియు యింకొక క్రొత్తమార్పు హిందూసంఘమునందుఁ బనిచేయుచుండె- ఆంగ్లేయులీ దేశమునకు వచ్చినపుడు ప్రాచీననాగరికతయొక్క రూపు మారిపోయినది- వీరువచ్చి మనకు యవనదేశ యాచారము, ఆపద్ధతుల మఱి సర్వస్వమును మనకు నేర్పిరి- బాహ్య ప్రపంచముయొక్క సౌందర్యమును తప్పకఁ జూడవలయుననియు నట్లుచేయుటవలన ప్రతిమనుజుఁడును రాజకీయ వ్యవహారములలో సౌఖ్యముఁ గలుగఁజేసికొనవలయుననియు కూడ నొక్కినొక్కి చెప్పిరి- మానవసౌఖ్యమే నీతిశాస్త్రముయొక్క పరమరహస్యమని చెప్పునట్టి శాస్త్రపద్ధతులుఁ గలిగిన హూణుల యభిప్రాయములు హిందూదేశమందుఁ జదువుకొనినవారి మనములందుగూడ సొచ్చి యద్భుతమయిన పనిఁజేయుచున్నవి. కాని వివేకానంద స్వామిచేఁ బలుమారు చెప్పఁబడినరీతిగా హిందువులకు మతవిషయములందుమాత్రమే యెక్కుడు తెలివి తేటలు కలవుగాన మతమునుగోడను దిరిగికట్టుటకు నూతనపద్ధతులు ప్రయత్నింపఁ బడుచున్నవి. రాజారామమోహన్‌రాయిగారు నూతన వేదాంతమును గనిపెట్టుటకుఁ గోరిరి- దయానంద సరస్వతిస్వామి వేదమతమునే స్థాపింపుట కుద్దేశించెను- ఈ మహాత్ముఁడు స్థాపించిన మతము పేరార్య సమాజము. దయానందుఁడు వేదములకుఁ జిత్రవిచిత్రములుగ నర్థములు గల్పించి సంఘమిప్పుడు పూర్ణమయిన సంస్కరణము గోరుచున్నదని చెప్పి యీ సమాజము నేర్పఱచెను- కాని యీ సమాజ ముద్యమునకుఁ దగినపునాదిలేదు- అందువలన నిది క్షీణించుటకుఁ బ్రారంభించినది- కర్మకూడదని బ్రాహ్మమతము బయలుదేరినది- ఇది యందఱినిఁ గలుపుకొనుటకు మాత్రము తలఁచినదికాదు- ఈ కారణములవలన నీమతము పదికాలములపాటు స్థిరముగ నుండలేకపోయెను- ఈ విధముగ మతములంతలోఁ బుట్టుచు నంతలోక్షీణించుచు దేశమునంతయు నల్లకల్లోల పఱచుచుండ నీ గ్రంథవాయుకుఁ డుద్భవించెను- ఈయన యిదివఱలో మతము లేవిధమున నున్నవో యా విధమున నేయుంచి తనపద్ధతి ప్రకారము వాని నన్నిఁటినిఁగలిపి వానికి నూతన వికాసమును, జీవమునుబోసెను- మనజన్మభూమియగు యీ పవిత్రభూమియందు దశాదినుండి వేదీ

ప్యమానముతో వెలుంగు జ్ఞానదీపము నారిపోకుండ నిల్పుటకుఁ బుట్టిన మహామహులలో శ్రీ రామ కృష్ణుఁడు చివరఁబుట్టినవాఁడు.

## హిందూదేశమునకు రామకృష్ణుఁడంపిన వార్త.

రామకృష్ణుఁడు హిందూదేశమునకంపిన వార్తలలో ముఖ్యమయినదియేది? అనాదినుండియు జెప్పఁబడుచున్న 'మతమనుభవమేకాని పేరుకాద'ను తత్త్వార్థము నీయన తిరిగి లోకమునకు నొక్కి నొక్కి బోధించియున్నాఁడు. కర్మలపైఁ గాంతుకాదనియు విషయముల నిజానిజములను గనుఁగొనుటకుఁ గాంతుకూడుననియుఁ దెలిపెను. మతము సంఘవినోదమునకు విషయమగుటకు సిద్ధమై, పశ్చిమదేశములలోమాదిరి హిందూదేశమునందును ప్రార్థనాలయము పుట్టుటకుఁ బ్రారంభమగుచున్నపుడు శ్రీ రామకృష్ణుఁడు లేచినిలువఁబడెను. ప్రాచీనులవలె నీయనయు మతవిషయములలో నెవరికి వారేయని పోరాడుచుండెను. ఈ మహాత్ముఁడు హిందువులకు నేర్పినది మఱియొకటిగలదు. 'పరమతములలోఁగల మంచివిషయములను మెచ్చుకొనవలసినదనియు, అన్నిమతము లొండొరులతో సంబంధముఁ గలిగి యున్నియు, నీశ్వరసన్నిధానమునకుఁ జేర్చుననియు, కావున మీరు వాని నన్నిఁటినిఁ బరిశీలించుచుండవలయు'ననియు వ్రాక్రుచ్చెను.

## పశ్చిమదేశములకు రామకృష్ణుఁడంపిన వార్త.

శ్రీరామకృష్ణుఁడు పాశ్చాత్యులకు నేర్పినది చాలగలదు. ప్రార్థనాలయములందు వేతనములఁ బుచ్చుకొనుచుఁ బనిచేయువారు నిజమయిన మతగురువులు కాఁజాలరనియు, ఆత్మజ్ఞానాభివృద్ధి స్వయంకృషి వలననే కలుగనేర్చుననియు నీ పరమజ్ఞాని పశ్చిమదేశీయులకు నేర్పెను. బాహ్యప్రపంచమునందెద్దానినిఁ గోరవద్దనెను. "బలవంతులయిన పాశ్చాత్యులు వారికంటెఁ దక్కువ బలముగలిగిన మానవకోటిని జూచునపుడు బహుచున్యాయ పద్ధతుల నవలంబింతురు. బంగారమునందు భూమియందు వీరికిఁగల యభిలాషయే వీరిట్లుజేయుటకు గారణము. కావున పాశ్చాత్యుల కదికూడదని శ్రీరామకృష్ణ పరమహంసబహురీతులనొక్కి వక్కాణించెను. మతైక్యత, పరమతసహిష్ణుత యీ రెంటివలనఁగల్గు లాభములకు నో పాశ్చాత్యులారా! మీకు నాజీవచరిత్రయే దృష్టాంతము.

## ఉపాధ్యాయపద్ధతి.

శ్రీ రామకృష్ణపరమహంస యుపాధ్యాయపద్ధతికిని, పూర్వకాలమందుఁగల యుపాధ్యాయులపద్ధతులకును నంతఁగా భేదమగుపడదు. ఎవ్వానికి నెట్లు చెప్పిన నెక్కువగనుపయోగపడునో నాతనికి నవ్విధముగనే బోధించును. భగవంతునిగూర్చి చెప్పుటకు

ను, జనులకు నీశ్వరభక్తిఁగలుగఁబ్రయత్నించునపుడు మనవారెన్నఁడు పాశ్చాత్యులవలెఁ బెద్దపెద్ద జనానీకములకు న్యాసములిచ్చుట యెఱుఁగరు. ఇట్లుచేయుటనిరర్థకమని మన ప్రాచీనులకుఁ జక్కఁగఁదెలియును. హిందూమహోపాధ్యాయులు తమతమ జీవితములవలననే సామాన్యజనులకందఱ కుపయోగముండునట్లు జీవించిరి. "మాకు జ్ఞానోపదేశము చేయుఁడి"యని దగ్గఱకువచ్చియడుగువారల నందఱఁబరీక్షించిచూచి వారిలోఁ దాము తగుననుకొనువారికిమాత్రమే జ్ఞానోపదేశముజేయుచుండిరి. 'అధికారుల'ను మాటయందు జాల సత్యముకలదు. నిజముగ జ్ఞానమతము శాశ్వతముగ నెట్లుండఁగలదు? తగినవారికే జ్ఞానమునుపదేశించుచు, నావిధముగ దాని నడుగంటిపోనీయకుండఁ బట్టుకొనినప్పుడు జ్ఞానమతముస్థిరపడి కలకాలమునిలువఁగలదు. మనము పాశ్చాత్యులపద్ధతి నవలంబించి యుండినయెడల మనకును పాశ్చాత్యులకుఁబలె ప్రార్థనాలయచరిత్ర యుండియుండినది కాని యాధ్యాత్మికచరిత్ర యుండునదికాదు.

శ్రీ రామకృష్ణుఁ డిట్లుచెప్పుచున్నారు. గులాబిపుష్పమువికసించి దానివాసన దిశలఁగ్రమ్ముకొనినపుడు తేనెటీగలు వానియంతటవియే యా పుష్పముయొద్దకు వచ్చును. తేనెటీగలువికసించిన గులాబిపుష్పమునకైఁ దమకుఁదామే వెదకుచుండునుగాని యెప్పుడును గులాబిపువ్వు తేనెటీగలకై వెదకులాడదు. ఇప్పుడు పరలోకనివాసియైన "ప్రొఫెసర్ మాక్సుమిల్లర్" యిట్లువ్రాయును. శ్రీ రామకృష్ణునివాక్యము (పైఁజెప్పబడిన వాక్యము) చాల యనుభవమువలనఁ జెప్పఁబడినదికానిపట్టిదికాదు. అన్నిజాతులయొక్క మానవు లమితయాసక్తిఁగలిగి జ్ఞానోపదేశముఁగాంక్షించి రామకృష్ణునిపాదముల చెంతకు నసంఖ్యాకములుగవచ్చి సేవఁజేయుటకుఁ బ్రారంభించిరి. ఇట్లువచ్చి తన్నాశ్రయించిన వారికందఱకు జ్ఞానబోధఁజేయుచుండుటచేత 'పరమహంస'కు సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువఱకును దినుటకుఁ ద్రాగుటకుఁ దీరికలేక యుండెను.

ప్రాచీన యాధ్యాత్మికగురువులను శ్రీ రామకృష్ణుఁడు సకలవిషయములఁ బోలియున్నను వారికిని యీయనకును భేదవిషయములులేకఁబోలేదు. శ్రీ రామకృష్ణుఁడు క్రమక్రమముగఁ బాఠశాలలోఁ జదివినవాఁడుకాఁడు. ఇది యీయనకుఁ జాల నుపకారము జేసినది. విశేషముగఁజదువుకొని శత్రువుల కనుగుణముగనుండు నన్నిటిఁ దర్కశాస్త్ర సంబంధముగఁ జెప్పఁబూనిన యాధ్యాత్మికపక్షమునకు రామకృష్ణుఁడంత బలముగ నుండెడివాఁడుకాఁడు. అట్లేచెప్పినట్లయిన నాయనబోధించునదంతయుఁజదువుకొనినవారికొద్ది సంఖ్యకుఁదప్ప మఱి యితరులకుఁ దెలియునదికాదుగదా. ఇఁక నీ చదువుకొనినవారన్ననో రామకృష్ణుఁడు చెప్పువిషయముల శిరసావహింపకుండుటయేగాక వానిలోఁ దప్పులు నెతకి వాదములారంభించుటకు ముందంజవేయుదురు. కనుక వీరిమార్గమునువిడచి శ్రీ

రామకృష్ణుఁడు బోధనావిషయములోఁ బెడమార్గముఁద్రొక్కెను. మహా మహా యాధ్యాత్మిక సిద్ధాంతములనుగూడ సామాన్యమయిన వాడుకమాటలలోఁజెప్పినాఁడు. ఇవి యన్నియు నతిసులభపద్ధతినిఁ జెప్పఁబడుచుండుటచే వినువారిమనముల కానందముగ నుండుటయేకాక వారి హృదయాంతరాళములకు వెళ్ళినాటుచున్నవి. అనేకవేలసంవత్సరములనుండియున్న మహోపాధ్యాయులలోఁ గొందఱుపయోగించునట్లుగఁ బరమహంస కూడ యుపమాలంకారములను విశేషముగవాడినాఁడు. ఇందువలననే యీయన తన సోదరుల హృదయములనాకర్షించి వారికి నీశ్వరభక్తి కల్గునట్లు చేయనేర్చినది. ఈయనకీ మహాకార్యముఁజేయుటవలనఁగలిగిన యసమానమయినకీర్తి యాచంద్రార్కముగ నిలుచునని యెవ్వరుచెప్పలేరు.

శ్రీ రామకృష్ణునియుపదేశములలోఁ బైనిచెప్పఁబడినవి చాలముఖ్యమయినవి. ఆధ్యాత్మికవిషయములకు నతిసులభసూత్రముగను దృష్టికరముగను చెప్పఁబడినయుత్తరువులు వేనవేలుకలవు. జ్ఞానియగుటకుఁ గోరికకలవాఁడు ప్రపంచముతో నంతగ సంబంధముఁ బెట్టుకొనుట కూడదని శ్రీ రామకృష్ణునియభిప్రాయము. ఈసందర్భమున నీ మహాత్ముఁడేచెప్పియున్నాఁడు. "ఆత్మాభివృద్ధికై పాటుబడు ప్రతిప్రారంభకుఁడును ప్రపంచములోని యన్నితరగతులమనుజులతోఁ గలసిమెలసితిరుగుచున్నయెడ వానికిఁ బూర్వముండిన మనోరథసృష్టియు, (Ideal) భక్తియు, ప్రేమయు, మఱియుత్సాహము రూపుకూడ లేకుండ నశించిపోవుననుటకు సందేహములేదు". ఇంకొకచోట నిట్లుచెప్పియున్నాఁడు. "ఆత్మాభివృద్ధికై పాటుబడు ప్రతిప్రారంభకునకు నేకాంతములేనిది మొదటిమెట్టులో నేపడిపోవును. మనముకోరినపుడు వెళ్ళి యేకాంతముగనుండుటకు వీలయినస్థలము, మనస్సు, అడవి యీమూడును భగవధ్యానమునకుఁ దగినస్థలములు.

భగవంతునిఁజూడ నేర్చుటకు సాధనములివియని శ్రీ రామకృష్ణుఁడు కొన్నిటినిఁ జెప్పియున్నాఁడు. అవియేవియనిన, (1) అప్పుడప్పుడేకాంతమునుఁగోరివెళ్లుట. (2) భగవన్నామమును స్మరియించుచు నాయనగుణములను వర్ణించుచుండుట (3)తత్త్వవిచారము. (4) మహాసక్తిగలిగి యీశ్వరప్రార్థనఁ జేయుట. సూర్యోదయముకానున్నసమయమున నభ్రతలమున నరుణకాంతియగుపడును. అతీరుననే తర్వాతఁగలుగు యీశ్వరధ్యానమునకు ముందు యాసక్తిపుడమును.

అప్రతిరోధమునుబోధించు యుపదేశవిషయములో శ్రీరామకృష్ణుఁడు తనసోదరులగువారినిఁ జెఱుపుటకుఁ జెఱుపుచేయకూడదుగాని, యాత్మరక్షణము జేసికొనుటకు మాత్రము ప్రతిరోధముచేయదలఁచినట్లు కనుఁబడవలయునని చెప్పచుండెడివాఁడు.

ఇఁక పుస్తకపాండిత్యవిషయము. కేవలము పుస్తకపాండిత్యముకలుగువారిఁజూచి న శ్రీ రామకృష్ణపరమహంస కమితమయిన యసహ్యతకలదు పుస్తకములను' శ్రుతుల ను మాత్రముచదివి ముక్తిఁబొందుటకుఁ బ్రయత్నించువారిమాటవిని నపరిమితముగఁ బరిహాసముఁజేయును. ఈసందర్భమున రామకృష్ణుం డిట్లు చెప్పుచున్నాఁడు పుస్తకపాండిత్యమువలనఁ గర్వితుఁడయినమనుజుఁడు నిష్ప్రయోజనముగ సృష్టియెప్పుడయినది యెట్లయినది యిట్టి సృష్టిక్రమము నాలోచించుచుండును. ఇఁక జ్ఞానిలక్షణమట్టిదికాదు. జ్ఞాని యీశ్వరునితో సహవాసముఁజేయుచు బ్రహ్మానందమనుభవించును.

సృష్టిలోనున్న చెడుగు సర్వాధారుఁడయిన యీశ్వరునకు చెడుగుకాదు. పాము కోరలలోఁగలవిషము దానికి విషమనితోచునా. సర్వేశ్వరుఁడు మంచిచెడ్డలకంటుకొనక వెలుఁగుచున్నాఁడు.

భగవంతుఁడాకారుఁడా నిరాకారుఁడాయను వివాదమును శ్రీ రామకృష్ణుఁడతి చమత్కారముగఁ దీర్చినాఁడు. "ఈశ్వరుఁడాకారత్వమును నిరాకారత్వమును రెంటిని గలిగియున్నాఁడు. ఆకార యనాకారములురెండును కలసియున్నవి. ఒకదానినివిడచి మఱియొకదాని నూహింపలేము. ఉష్ణమెఱుఁగనియగ్ని యనిన నీకర్థమగునా. పాలరంగుతెలుపుకాదు మఱియొకటియనిన నీవుగ్రహించుకొనఁగలుగుదువా? వజ్రమునకుఁగాంతి సహజమయినరీతి, సర్వమునకువక్రగమనము సైజమయిన తెఱఁగున నిరాకారుఁడయిన ఈశ్వరున కాకారముకూడఁగలదు". మఱియొకచోటనీసందర్భముననే రామకృష్ణుఁడిట్లు చెప్పుచున్నాఁడు. "ఒక పెద్ద సముద్రమున్నది. అందులోనీరు పైభాగమందు నడుగుభాగమందు మఱియన్నిప్రక్కలఁగలదు. అతిశీతలమువలన మంచుగడ్డగ నొకవైపున మారినది. తిరిగి యది యుష్ణసంబంధమువలన నీరుగామారినది. నిరంకుశుఁడయినపరమేశ్వరుఁడు సముద్రమువంటివాఁడు భక్తులుమాత్రము చూడఁగలిగిన యీశ్వరరూపము పైఁజెప్పఁబడిన మంచుగడ్డవంటిది. భక్తులకుఁగలభక్తి, ప్రేమ, పూజ, స్వార్థత్యాగము మొదలగునవియే జగన్నాథసాగరమునకుఁదాకుచున్న శీతలము. అహంకారము లడుగంటఁజేసి సమాధియందునిలచి సదసద్విచారము సేయుటయే యుష్ణము. భక్తులకనేకరూపములుగ భగవంతు డగుపడవచ్చును. సమాధియందు సత్స్వరూపదర్శనము బూర్తిగఁ గాంచగలిగినవాఁడు తిరిగి నిరాకారుఁడగుచున్నాఁడు. ఇప్పుడు వేదాంతమార్గ భక్తిమార్గములు రెండు మైత్రిగలిగియున్నవి. అనఁగా రెండు నొకవిషయమునే బోధించుచున్నవనుట". నిరాకారుఁడయిన సచ్చిదానందరూపునిఁ జూడనేర్చుటకు ముందాకారసహితుఁడై యున్నవానినే పూజింపవలయునని శ్రీ రామకృష్ణపరమహంస యభిప్రాయము.

మానవులందఱు కేవలముపాపులని పాశ్చాత్యులునమ్ముదురు. రామకృష్ణుఁడువీరి నిందువలననే పరిహాసపాత్రులుగఁ జేయుచుండెడివాఁడు. స్వేచ్ఛ, బానిసత్వము యీ రెండుమనస్సువే. నాయాత్మకుఁబరిపూర్ణస్వేచ్ఛగలదు. ప్రజాసాంగత్యముకలిగి యూర నుండినను లేక నడవియందుండినను నా మనోస్వేచ్ఛ నొకరు తీసివేయఁజాలరు. ఎప్పుడు నేను పాపిని నేను పాపినియని పల్కువాఁడు నిజముగఁ బాపిగమారును.

ప్రాపంచకవిషయములనే మన మింక నభివృద్ధిజేయవలయునని పాశ్చాత్యులవలె మనవారును జాల యపేక్షింబడుచుండిరి. కాని మనముచేయు ప్రతిపనియు నీశ్వరునిఁజేరుట కుపయోగపడునట్లుండవలయును. పరమహంస యీవిషయమువ "మానవజన్మయందు కర్మయే సర్వస్వమనుకొనుటకంటె వేరవెఱ్ఱిలేదు. మానవజన్మయను పుస్తకమునందు కర్మయనునది మొదటియధ్యాయము. ఈశ్వరుఁడనునది కడపటియధ్యాయము. ఆచరింపవలసినకర్మయందు నతిజాగ్రతఁదీసికొనవలయును. అత్యవసరమయినపనిమాత్రము చక్కఁబఱచుకొనుము. నీవుచక్కగా నిర్వాహకముఁజేసికొనలేనిపనిని పైఁబెట్టుకొనకుము అట్లుపెట్టుకొనినయెడల నీశ్వరసన్నిధానమునకు నీవుచేరలేవు. కర్మచేయుట ప్రతివానికి గర్తవ్యమైయున్నది. అదియే వానికి మోక్షసామ్రాజ్యముసంపాదించి యివ్వనోపును.

ఈశ్వరసాన్నిధ్యమునకుఁ జాలదూరముననుండఁగనే మాకుఁ గర్మయవసరములేదని చెప్పు మహానుభావులఁ జూచి పరమహంస యసూయఁగనపఱచును. పరమహంస యీ సందర్భమున "భగవంతునిఁ జూడనేర్చినవానికే కర్మవిముక్తుండగుటకు వీలున్నది. అన్యులకులేదు". శ్రీ రామకృష్ణునిచే మఱియొకసంగతి బోధింపఁబడెను "ఈశ్వరసాన్నిధ్యమునకుఁజేర్పనోపు మూడుమార్గములలోఁ (కర్మ, జ్ఞాన, భక్తి) భక్తిమార్గము తేలికయైనది. ఈయుగమున నీ భక్తిమార్గమునే ద్రొక్కవలసియున్నది". భక్తిమార్గము నకుఁదగులు యారుద్వారములను జక్కఁగ వర్ణించియున్నాఁడు.

జాతిమతములగూర్చి యీ చరిత్రనాయకుఁ డిట్లువ్రాయుచున్నాఁడు. సర్వకాల సర్వావస్థలయం దీశ్వరధ్యానపరాయణుఁడైనవానికి మఱియొకసంగతిఁజూచుటకు వీలులేదు. కీర్తిని, గౌరవమును నభిలషించువాఁడుమాత్ర మీ తెగల నేర్పఱచుటకు నుద్దేశించును". ప్రపంచమునందుగల సర్వవస్తువులు సర్వభూతములు భగవంతుఁడేయని కనుగొననేర్చినంతవఱకును మతభేదములనుండి మానవుఁడు విముక్తుఁడుకాలేఁడు.



# శ్రీరామకృష్ణుని యుపదేశవాక్యములు.

శ్రీ రామకృష్ణుఁడు క్రొత్తఁగ బోధించిన దిదియని చెప్పుటకష్టము. ఏలనన నీయన ప్రాచీనగ్రంథములందుఁ జెప్పఁబడినవిషయములనే బోధించుచు మనోరథసృష్టికిఁ దగిన మానవునిరీతిఁ దానుజీవించెను. కొన్ని కొన్నిఁటికిమాత్ర మెక్కుడు ప్రాముఖ్యత నిచ్చినాఁడు. పైచూపులకు భేదములుగలవిగానున్నను, అరసిచూచిన యన్నిమతములును భగవత్సాన్నిధ్యముఁ జేర్పనోపునని శ్రీరామకృష్ణుఁడుబోధించెను. ఈశ్వరుఁడు తల్లివంటివాఁడని యందఱకుఁ దెలియఁ గారణుఁడయ్యె. ఆకాలములోఁ దా నొక్కఁడుమాత్రము పొందఁగలిగిన నిర్వాణము నందఱుపొందునట్లుచేసెను. ఆయనలోనన్నిభక్తులు, అన్ని మతములు మిళితములై పోయినవి. ఈసందర్భమున శ్రీరామకృష్ణుని ప్రియశిష్యుఁడిట్లువ్రాయుచున్నాఁడు. "ఆయనజీవిత మొక దీపమువంటిది. ఆదీపసహాయమువలనఁ బ్రతిమనుజుఁడును హిందూమతయదార్థమును కనుఁగొనఁగల్గును. శాస్త్రములోఁ జెప్పఁబడిన విషయములన్నిఁటికి నీయన (పరమహంస) వస్తుపాత్రమువంటివాఁడు. మహాఋషులు, అవతారపురుషులును నిజముగ నేమిబోధింపఁగోరినది తెలిసికొనుట శ్రీరామకృష్ణుని జీవచరిత్రఁ జదివినఁజాలును. పుస్తకములు మాటలనుమాత్రము చెప్పును కాని రామకృష్ణుని జీవితమంతయు ననుభవముతోఁగూడియున్నది. ఎనిమిదివేలయేండ్లలోఁ జెప్పఁబడినఁ జాతీయయాత్మవిద్యనంతయు నొక్క యేబదినాలుగుసంవత్సరములలోబోధించినాఁడు. ముందువారందఱకును మార్గదర్శియైనాఁడు. అవస్థలనుఁగూర్చి రామకృష్ణునకుఁగల యూహ వేదములను శాస్త్రములనుబద్దలుకొట్టి యర్థముచెప్పును. పరమహంసయీశ్వరారాధనా స్వేచ్ఛగావలెనని నొక్కివక్కాణించినాఁడు. ఈమహాత్ముఁ డొకపర్యాయమిట్లు చెప్పియున్నాఁడు. "జలముకలదు. దీని నేకొందఱు వారియనియు, కొందరు పానియనియు, మఱికొందఱు వాటరనియు, నింకొంద ఱక్వాయనియుఁ బిల్చుచున్నారుకదా. ఈవిధముననే యీశ్వరుని కొందఱు హరి యనియు, మఱికొంద ఱల్లాయనియు, మఱికొందఱు బ్రహ్మమని పిల్చుచున్నారు." మఱియొకపర్యాయము, "ఒకచెట్టున్నది. దానికొన కొక నిచ్చెనసహాయమువలనఁగాని ఒక వాసముసహాయమువలనఁగాని లేక నొక తాటిసహాయమువలనఁగాని యెక్కవచ్చును. ఇట్లే భగవత్సాన్నిధ్యమునకుఁబోవుట కనేక మార్గములుకలవు. ప్రతిమతమును యొకమార్గమే". శ్రీ రామకృష్ణుఁడు పరమేశ్వరునిఁ దల్లిగ జూచుకొని జీవించినాఁడు. పాశ్చాత్యులు తండ్రిగ భావించుచున్నారు. భగవంతుఁడు మన తండ్రియనినప్పటికంటె తల్లియని చెప్పిన మన మనమునకుఁ ద్వరగఁ బట్టునుగదా. ఈవిషయమునుఁగూర్చి పరమహంస "ఓ, మానవుఁడా! నీవు ప్రపంచవిషయములలో మునిఁగి జగన్మాతను మఱచియుంటివి. కావున నీవు వీనినుండి తొలఁగించుకొని యామెను

గూర్చి దీనముగ ధ్యానముఁజేయుము. తత్క్షణమువచ్చి యామె నిన్నామెచేతులలోనికిఁ దీసికొనును.'' "భక్తుఁడు పరమాత్మను యేల మాతయని పిలువవలెననినఁ బసిబిడ్డ తల్లిగొద్ద దిరిఁగినంత స్వేచ్ఛగ మఱియొకరియొద్దఁ దిరుఁగడుగదా. కావున భక్తుఁడట్లు పిల్చుచున్నాఁడు."

## శ్రీరామకృష్ణుని యుపదేశ వాక్యములు

అగణితంబయిన శ్రీరామకృష్ణుని యుపదేశవాక్యములు సారవంతములు చక్కగానుండును- వానినన్నిటిని నిచట వ్రాయుట బాగుగ నుండునని తలచి యట్లు చేయుచున్నాను.

(1) జలమును కొంతమంది వారియని కొందఱు వాటరని కొందఱు పానియని యీ విధముగా ననేకు లనేకరీతులుగఁ బిల్చుచున్నారుగదా- అట్లే సచ్చిదానంద స్వరూపుఁడైన యాపరబ్రహ్మమును కొంద ఱల్లాయని కొందఱు హరియని మఱి కొందఱు క్రీస్తనియుఁ బిల్చుచున్నారు-

(2) ప్రతిమతములో జెప్పఁబడు యీశ్వరుఁ డొక్కఁడేయయిన పక్షమున వివిధమతస్థులచేత నీవిధముగా నీశ్వరుని యాకారము నిరూపింపఁబడుటకుఁ గారణ మేమి? ఈశ్వరుఁ డొక్కఁడు గాని యాయన యాకారములు మెండు. ఇంటియజమాని తండ్రి కొకరికి సహోదరుఁ డొకరికి భర్త మఱియొకరికినయి పలుమంది చేతఁ బలురీతుల నెట్లు పిలువఁబడుచున్నాఁడో యీశ్వరుని సంగతియు నంతియే- ఏభక్తున కేరూపమున దర్శన మిచ్చునో యారూపమును వాఁడు శ్లాఘించి చెప్పుచుండును-

(3) ఒక యుపాధ్యాయుఁడు తన శిష్యుని నొకనిని జూచి "భూమిపై విలసిల్లు సర్వస్వము భగవద్రూపమే" యని చెప్పెను- శిష్యుఁ డామాటలయొక్క ముక్కస్యము కాగ్ధమును మాత్రము గ్రహించి నేర్చి యథార్థమును గనుఁగొనలేకపోయెను. తరువాత నతఁడొకనాఁడు వీధినడచుచుండగా నొక యేనుఁగ నెదుర్కొనెను- మావటివాఁడు త్రోవనుండి తొలఁగుమని యీ శిష్యునితో నఱచి చెప్పెను- కాని "నే నేల దొలఁగిపోవలయును- నేను భగవంతుఁడను. ఏనుఁగయు భగవంతుఁడే- భగవంతునకుఁ దనలోఁ దనకు భయమేలఁ కలుగును?" అని లోలోపల విశదించుకొనుచుఁ బాపమా శిష్యుఁడు తొలఁగిపోడయ్యె- అగ్గోజ్జ మఱికొన్ని నిముసములకే పరమ వేదాంతి వేదండతొండములోఁ జిక్కి దూరముగా విసరివేయఁబడినవాఁ డాయెను- చర్మమంతయుఁ బగిలిపోయినది- చాలాశ్రమమునకుఁ గారణమాయెను- అంతట నా శిష్యుఁడు గురువుయొద్దకేగి జ

రిగిన వృత్తాంతమంతయు నుడివెను. ఆశ్చర్యమగ్నుఁడై గురువు శిష్యునిఁజూచి "బాగానున్నది. నీవు భగవంతుఁడవు. ఏమనఁగ భగవంతుఁడు. అయినను మావటివాఁడి రూపమున భగవంతుఁడే త్రోవదొలఁగి జాగ్రత్త పడవలసినదని పైనుండి చెప్పుచున్నాఁడు కదా. ఆమాటల నీవేల లక్ష్యముచేయ వైతివి?" యని పలికెను.

(4) మానవుండొకఁడొక కల్పవృక్షముక్రింద గూర్చొని రాజును గావలయునను కొనెను. తక్షణము రాజయ్యెను. తరువాత నొక సుందరకాంతామణిఁ గాంక్షించె. ఆ నిముసముననే యాయన ప్రక్కనొక సౌందర్యవతి ప్రకాశించుచున్నది. మూఁడవ నిముసముననే నొక పెద్దపులిచేఁ బట్టి చంపఁబడిన నేమౌను'నను కొనెను. అనుకొనుటయే యాలస్యమాయనునట్లు తక్షణమాయన యొకపులి వాడికోళ్ళలోఁ జిక్కియుండెను. భగవంతుఁడు కల్పవృక్షము వంటివాఁడు. ఎవ్వరాయనయెదుట నేనుదిక్కుమాలినవాఁడను. బీదవాఁడ'నని తలచెదరో వారు నిజముగ నట్టివా రగుదురు. 'భగవంతుఁడే నాకుకావలసిన సర్వస్వము నిచ్చును. నాకోరికలఁదీర్చు'నని యెవ్వరు తలచి నమ్ముదురో వారికి నిశ్చయముగ సమస్తము భగవంతుఁడే యొసగును.

(5) పిల్లవాఁడు చిన్నయక్షరముల వ్రాయనేర్చుటకు బూర్వము పెద్దయక్షరముల దిద్దుకొనవలయును. ఈవిధముననే నిరాకారుఁడైన యీశ్వరుని నిశ్చలబుద్ధితో ధ్యానింప నేర్చుటకు బూర్వము భగవంతునకు నాకారములఁ గల్పించి ధ్యానించి పూజించవలయును. ఇట్లు చేసినగాని నిశ్చలబుద్ధి కలుగనేరదు.

(6) ధనుర్విద్య నేర్చుకొనువాఁడు మొట్టమొదటఁ బెద్దపెద్ద వస్తువులపైఁ దన గురిని నిలుపును. క్రమముగఁ జిన్నవస్తువులపై గురినిల్పుటకు నేర్చును. ఈ విధముగఁ బ్రతిమానవుఁడును భగవంతునకు రూపములఁ గల్పించి పూజించిన మనోనిశ్చలతఁ బొందును. కాలము గడచి తన మనోదార్ఢ్యము హెచ్చినకొలఁదిని బరమేశ్వరుని నిర్గుణ రూపమును బూజింపవచ్చును.

(7) వరద వచ్చినప్పుడు చెరువులు, గాలువలు, నదులు నేకమై భూమి యంతయు నొక్కజలప్రవాహమై కనఁబడును. కాని వాననీరు చిన్నచిన్న కాలువలవలెఁ బ్రవహించు చుండును. అట్లే భగవంతుఁ డవతరించినపుడాయన యనుగ్రహముచేత నందఱును రక్షింపఁబడుదురు. సిద్ధులమిత శ్రమఁబడి తపస్సుజేసి వారుమాత్రము రక్షింపఁబడుదురు.

(8) ఒక పెద్దదూలము ప్రవాహములోఁ గొట్టుకొనిపోవుచుండఁగా ననేకమంది దానిపై నెక్కి మునిగిపోకుండ రక్షింపఁబడవచ్చును- ఒక పూరిపుడక కొట్టుకొని పోవుచుండఁగా దానిమీద నొకకాకి యెక్కినను నది మునిగిపోవును- ఇవ్విధముననే భగవంతుఁడు భూమిపై నవతరించినప్పుడు పలువురు తదనుగ్రహమువలన ముక్తిబొందుదురు. సిద్ధులన్ననో వారికి వారే రక్షింపఁబడుదురు-

(9) రాముఁడు, సీత, కృష్ణుఁడు, రాధ, అర్జునుఁడు మొదలయినవారు కేవలము చరిత్రసంబంధమైన మానవులుకారు- వారినిగూర్చి యథార్థము వేఱుగా నున్నది శ్రుతులగర్భమందొక రహస్యార్థము దాగియున్నది- వారును నీవలె నెత్తురుకండ గల్గిన దేహములవారు- కానివారు దేవతలు గనుక వారిజీవితములను 1 చరిత్రవిషయము 2 ఆత్మికవిషయము యీరెండు విధములుగా దీసికొనవచ్చును.

(10) నీటిపక్షియొకటికలదు- అదినీటిలో మునిగినను దానిరెక్కలకు నీరంటుకొనుటలేదు- ఈవిధముననే మహాత్ములు లోకములో మానవులతో మెలఁగుచున్నను ప్రపంచవిషయముల కంటుకొనరు-

(11) 'హోమ' యను నొకపక్షి కలదు- అదియెత్తుగా నెగిరి యాకాశమండలములోనుండుటకుఁ గోరును- భూతలంబునకుబోయి వచ్చెదమనుతలపెన్నఁడును దానికి గాదమును- అదిగుడ్ల నాకాశమందే పెట్టును- ఇవి భూమియొక్క యాకర్షణశక్తివలన భూమిమీదకుఁ బడిపోవుచుండఁగా మధ్యమార్గములోనే పిల్లలుగ మారుచున్నవి. ఈపిల్లలొక్క మనము క్రిందికిఁ బడిపోవుచుంటిమని యెఱింగి తిరిగి పైకి నెగిరిపోయి తమతల్లితో నుండును- శుకదేవుఁడు, నారదుఁడు, క్రైస్టు, శంకరాచారి మొదలగువారు పైఁ జెప్పఁబడిన పక్షులవంటివారు- వారుపసితనమందే యీలోకము మనకుఁగాదని విడిచి పరమార్థమైన బ్రహ్మజ్ఞానముయొక్క యగ్రమునకుఁ జేరి సుఖముననున్నవారు- వీరినినిత్యసిద్ధులందురు-

(12) చింతామణివలన నినుపుకత్తి బంగారుకత్తిగమారుచున్నది- ఇప్పుడుపూర్వాకారమే యున్నను నాకత్తినఱకుటకు నుపయోగపడుటలేదు- ఈచందముననే యీశ్వరపాదకమల సేవానుగ్రహముపొందియున్న మానవుఁడురూపమునందు మారనప్పటికిని పాపకార్యమును జేయుటకు నిచ్చగింపఁడు-

(18) పాలు నీరు కలసిపోయినప్పుడు పాలనునీటినుండి విడదీయ నేర్తుమా? మనకట్లుచేయుటనశక్యముగాదు- ఇట్లే యాత్మాభివృద్ధి బొందఁ గాంక్షించువాఁడు లోకపు

వారందఱితో విచ్చలవిడిగఁ దిరుగకూడదు- అట్లు మెలఁగినవాని మనోలక్ష్యములు తప్పి పోవుటయేకాక పూర్వము వానికిఁగల భక్తిశ్రద్ధానురాగోత్సాహములుగూడ యాశలేకుండఁగ ఇగిపోవును- ii తిరిగి పాలనుండి వెన్నపూసనుదీసినపుడది మజ్జిగలోఁగలువక పైనఁ దేలుచుండును- ఒకపర్యాయము నిర్వాణదశను బొందనేర్చినవాఁ డెన్నివిధముల నెంత మందితో మెలఁగుచున్నను వానినివారిదుర్గుణము లేమియుఁ జేయఁజాలవు-

(14) ఓభగవంతుఁడా! ఓఅల్లా! ఓహరీయని యీవిధముగఁ బెద్దకేకలఁ బెట్టుచు భగవన్నామమును స్మరించు ప్రతిమానవుఁడు సంకభగవంతుని గనుఁగొనలేదని మనము నమ్మవచ్చును- ఏలయనిన భగవంతునిఁజూచినవాఁడు మితభాషిగనుండును-

(15) పుష్పముయొక్క మకరందముఁ ద్రాగనంతవఱకును దుమ్మెద పుష్పముచుట్టు దిరుగుచురొదఁజేయుచుండును- మకరందమును ద్రాగుచున్నపుడు రొదఁజేయుటమానును- ఇత్తెఱంగున మానవుఁడు 'భగవంతుఁడిట్టివాఁడు- తలయిట్టిది- రొమ్మిట్టువంటిది' యనివాదములు సల్పునంతవఱకు యథార్థజ్ఞానామృతమును గ్రోలలేదని మనమూహింపవచ్చును- ఈయమృతమునొకపర్యాయము చవిచూచినతరువాత వాదములాపివేసి మితభాషియై నెమ్మదిగనుండును.

(16) ఒకగదిలోఁ బిల్లలుబొమ్మలతో నాడుకొనుచుందురు- ఇంతలో నవతలనుండి వారితల్లివచ్చును- ఆమెనుజూచినతక్షణము వారాబొమ్మలఁ గ్రోసివేసి తల్లివంకకు బరుఁగెత్తియామె యొడిఁజేరుదురు- భాగ్యము, గౌరవము, కీర్తి మొదలయినటువంటిబొమ్మలతో నరులాడుకొనుచున్నారు- ఈశ్వరదర్శన మొక్కతూరియైనయెడల నీ భాగ్యమీకీర్తి మొదలగువాని వాసించక విడిచిపెట్టి యీయనయొద్దకు బరుగెత్తుదురు

(17) ఇహలోక సంబంధమయిన ఫలముఁ బొందవలయునని మనుజులెన్నియో పుణ్యకార్యములు ధర్మకార్యములు జేయుచుందురు- కాని దుష్కాలము, దుఃఖము, బీదతనమువారికి సంప్రాప్తిమైనప్పుడు వారాపుణ్యకార్యములఁ జేయుటమానుదురు- వీరందఱు 'రామ, కృష్ణ'యని పలుకుచు బిల్లిచేఁబట్టుపడగనే, 'కా,కా'యని యఱచు రామచిలుకలవంటివారు-

(18) ఈ ప్రపంచమునుండియే జనకమహారాజు ముక్తిఁగాంచెనని మనుజులెప్పుడును జెప్పుచుందురు- ఇది సర్వసామాన్యమైన సంగతికాదు- అపవాదముకాని సామాన్యసూత్రముకాదు- కోరిక, యసూయ యీ రెంటిని జయించినవాఁడే ముక్తిఁ బొందనేర్చునని సామాన్యసూత్రము 'నేనుజనకుఁడ'నని యొప్పుడుతలచకుము. జనకుని తదనంతర

ము వేలకొలది సంవత్సరములు గడచిపోయినవి. ఆయన తర్వాత నింతవఱకు నింకొకజన కుఁడు పుట్టలేదు.

(19) ఉప్పుతోఁజేయఁబడిన బొమ్మయొకటి, గుడ్డతోఁ జేయఁబడినది యొకటి రాతితోఁజేయఁబడినదియొకటి మూఁడుబొమ్మలుకలవు- ఈమూటిని నీటిలోవేయగా నుప్పుబొమ్మ కఱగిపోవును- గుడ్డబొమ్మ నీటినిబీల్చుకొని యారూపము నేకలిగియుండును- రాతిబొమ్మ నీటినిగూడ పీల్చుకొనకయుండును- తనయాత్మనుబరమాత్మలో లీనము చేయు వాఁడు పైకథలోనియుప్పుబొమ్మవంటివాఁడు- దేవునికరుణఁగల్గిపూర్తిగనీశ్వరజ్ఞానముఁ గలుగు భక్తుఁడు గుడ్డబొమ్మవంటివాఁడు- కేవలము నీలోకము నేనమ్ముకొని దేవుఁడనినఁ దలనొప్పివచ్చువాఁడు రాతిబొమ్మవంటివాఁడు-

(20) ఇద్దఱు మనుష్యులొక తోటలోనికి వెళ్ళిరి- వారిలోనొకఁడు లోకవ్యవ హారములో మంచితెలివితేటలుకలవాఁడు- కనుకనీతఁడు తోటలోఁ బ్రవేశించగనే య క్కడ యెన్ని మామిడిచెట్లున్నవి యొక్కొక్కచెట్టుకు నెన్ని కాయలున్నది తోట ఖరీ దెంతయగునది యీసంగతుల నాలోచించుచుండె- రెండవమానవుఁడు నెమ్మదిగఁదోట యధికారియొద్దకు నేగి వానియనుగ్రహమును సంపాదించి యొక్కొక్కపండు నే తినసా గెను- ఇప్పుడు వీరిద్దఱిలో నెవరు తెలివిగలవారు? మామిడిపండ్ల దిననట్లయిన నాకలితీరి కోరికయడఁగును- ఆకులెన్నియున్నవని కాయలెన్నియున్నవని వృథా లెక్కలవేయుచు న్న నేమిలాభము? పరతత్వజ్ఞానవిహీనుఁడు 'సృష్టియెట్లు కలిగెను? ఎప్పుడుకలిగెను? ఎ వరిచేఁగలిగెను?' యీవిధమయిన ప్రశ్నలలోమునిగి వృథావాదములుసల్పుచుండును- సా ధువయినవాఁడు మితభాషియై యీశ్వరుని సహవాసమునుగోరి యాయనచెంతకుజేరి శా శ్వతసుఖమును బొందును-

(21) ప్రయాణీకుఁడొకఁడుండును- ముందుపట్టణమునకు దారితెలుపకుండును- అ ప్పుడాతఁడెవరయినయొకరు చెప్పినమార్గమున వెళ్ళిన నక్కడికి సులభముగఁ జేరును- అట్లుగాక బలుమంది చెప్పుమార్గములఁబోవ నారంభించినఁ జాలాచిక్కుల ననుభవింప వలసినవాఁడగును- ఈశ్వరుని సాన్నిధ్యమునకు బోవనిచ్ఛగించువాని సంగతియు నింత యే- ఒకగురువును నమ్ముకొని యాయనమాటప్రకారము నడచుకొనిన ననాయాసముగఁ జేరును- మెడమీదఁదలఁగల ప్రతిమానవునిమాట ప్రకారమునడుచుకొనిన బ్రయాసకుగా రణమగును-

(22) ముత్యమును దీసుకొని మనము ముత్యపుచిప్పను బారవేయుదుము- అట్లే మనము మన మతగురువు చెప్పిన మంత్రమునుగ్రహించి బాగుపడవలయును- అంతియకా ని యాయనలోపములను దుర్గుణములను నెంచఁగూడదు-

(23) 'ఈశ్వరజ్ఞానము; ఈశ్వరప్రేమ' ఈరెండు నొకటియే- జ్ఞానమునకు ప్రేమకు భేదమగుపడదు- i సమస్తము నేను ii సమస్తము నీవు iii నీవు దొరవు నేను సేవకుఁడ' నను యీమూఁడవస్థలలో నేదియో యొకదానిని ననుభవించినవాఁడు నిజముగ బరిపూర్ణుఁడగును-

(24) ఈకాలములో నూతనముగ నేర్పఱుపబడ్డ మతబోధ(మతము నుపన్యాసము లిచ్చిబోధించుట) పద్ధతినిగూర్చి మీరేమి తలచెదరు? ఈమతబోధ వంటనొకఁడికి జేసి నూరుగురిని భోజనమునకుఁ బిల్చుటవంటిది-

(25) అనేక వేలతరబడి యేండ్లనుండి యొకయిల్లు వెలుతురెఱుంగదు- ఎప్పుడు నందులోఁ జీకటికాపురముండును- ఆయింటిలోపలికి నీవొకదీపమును గొనిపొమ్ము- తక్షణమాచీకటియంతయు మాయమైపోవును- ఈచందమున సత్కరుణార్ద్రదృష్టితో నీశ్వరుఁ డొకపర్యాయము దర్శనమిచ్చినఁ గోట్లజన్మములనుండి చేసిన సంచితకర్మమంతయు రూపుమాసిపోవును-

(26) రాజుతన భృత్యునియింటికిఁబోవుచు వాఁడుతనకు సరిగా మర్యాదఁజేయఁ గల్గుటకు వానియింటికి ముందుగనవసరమైన పీఠములు, భూషణావళులు, నాహారపదార్థములు మొదలగునవి పంపును- ఈవిధముననే భగవంతుఁడు దర్శనమిచ్చుటకు బూర్వము ప్రేమ, గౌరవము భక్తి మొదలగునవి భక్తునకుఁ గలుగఁజేయును-

(27) ఇతరులకు మతమును బోధించుటకుఁ బదులుతానే యాకాలమంతయు నీశ్వరారాధనయందు వ్యయపఱచినఁ బాగుండును. ఇదియేమతమునుబోధించుట- ఇహలోకవ్యవహారములనుండి తొలఁగి జితేంద్రియుఁడయినవాఁడు నిజమయిన గురువు- దిగంతములనుండియుఁ బలుమంది జ్ఞానోపదేశమును వాంఛించి పిలువనిపేరంటముగవచ్చి యిట్టి నిజగురువునకు సేవఁజేయుదురు- 'నేను వికసించితిని- నా మకరందమును గ్రోలవలసిన' దని పుష్పము వెళ్ళి తుమ్మెదలకుఁ జెప్పుచున్నదా?

(28) కాయసహజముగ ముదిరిపండినదాని రుచికిఁ జిన్నగా ముదరనికాయదెచ్చి మగ్గవేసినదానిరుచి యన్నిరెట్లు తక్కువగనుండును- ఈశ్వరసాన్నిధ్యమును బొందనేర్చినవారికి బరస్పరమతభేదములు క్రమక్రమముగనవియే వదిలిబోవును- ఇతరులకు మతభేదములఁ బాటించకుండుట తప్పు-

(29) మీరు మీ భార్యనుగలసి యేల సంసారముఁజేయరు? స్వర్గమునందు సేనానాయకుఁడయిన కార్తికేయదేవుఁడొకనాఁడు తనగోరులతో నొకపిల్లిని రక్తము న

చ్చునట్లుగీసెను- అంతట నింటికిఁబోవునప్పటికి దనతల్లిబుగ్గపై నొకగీఁటినగు ర్తగుపడె
ను- "ఓతల్లీ! నీకీగీరు కల్గుట యెట్లుతటస్థించెను?" అనికొడుకు ప్రశ్న వేయగావిని తల్లి
యయిన దుర్గాదేవి, "ఇదినీవుచేసినదియే- నీవునీగోరుతో గీరినావుగదా" యని ప్రత్యు
త్తరమిచ్చెను- అంతగార్తికేయుఁడు, "ఇదిచాల వింతగనున్నది- నిన్ను నేను గీరినట్లే
నాకు జ్ఞాపకములేదు- అట్లుపల్కుచుంటివియేల' యని యడిగెను- 'ఈయుదయము పి
ల్లిని గీచినసంగతియే మఱచిపోతివా?' యని తల్లితిరిగియడుగగావిని కుమారుడు, "నిజమే
పిల్లినిగోటితో గీరితిని- అయినను, నీబుగ్గయెట్లా గోటిగీరుగలదయ్యె'నని తిరిగి ప్రశ్నించె
ను- అంతటదుర్గాదేవి, "ఓకూర్మిపుత్రా! ఈలోకమంతయు నేనే- నేనుతప్ప మఱియే
మియులేదు- సృష్టియంతయు నేనే- నీవెవరికి నపాయముఁజేసినను నా కపాయముజేసి
నట్లేయని తలచుము"ని పలికెను- ఈమాట లత్యంతాశ్చర్యంబును గల్గఁజేయఁ గార్తికే
యుఁడికముందెన్నఁడును వివాహమాడనని ప్రతిజ్ఞఁబట్టెను- ఎవరిని నాయన వివాహమా
డితలచును? లోకమందుఁగల ప్రతిస్త్రీనితను దల్లిగానెంచుచుండె- కనుక నేను కార్తికే
యునివంటివాఁడను- నా కింటికి నగుపడు ప్రతి పద్మాక్షియు నా కాజగన్మాతగఁ
దోచును-

(30) త్రాటిచే నీటిపై గీయగీచిన గీత కలదా? లేదు- ఇట్టిదియే సాధుజనముల
కోపము-

(31) దీపముయొక్క కాంతి యెంతదూరమువఱకు వ్యాపించినను నాదీపముక్రిం
దఁ నీడయుండునుగదా! మహాపురుషుల చెంతనుండువాఁడు వారిమహాత్మ్యముఁ గనుఁగొ
నజాలఁడు- దూరముననుండువారి మహామహిమలవల్ల నాకర్షింపఁబడుదురు.

(32) హిందూ పంచాంగములలో వర్షయోగమునుగూర్చివ్రాయబడియుండును.
కాని నీవుదానిని నలిపివేసిన వానిలోనుండి యొక్కనీటిబొట్టుగూడ బయలుదేరదు. ఈ
విధముననే గ్రంథములలో మంచియుపదేశము లనేకములుకలవు- వానినన్నిటిఁ జదివినం
తమాత్రమున లాభములేదు- నీవు మోక్షసామ్రాజ్యము లభింపనేరవు- నీవువానిని స్వం
తముగ ననుభవములోఁ బెట్టుకొనవలయును-

(33) ఒకయింటికోడలెట్లు తనమామగారిని నత్తగారిని మఱియితరులను ప్రేమిం
చుచుఁ దనభర్తను విశేషముగఁ ప్రేమించునో యావిధమున భక్తుడు తన యిష్టదేవతను
విశేషముగఁ ప్రేమించినను నితరదేవతలకుఁగూడ గౌరవముఁజూపవలయును-

(34) క్రొత్తఁగబుట్టిన బ్రాహ్మణమతమునకును ప్రాచీనమయిన హిందూమతమున
కునుగల భేదము సంగీతశాస్త్రమంతకును దానిలోనొకరాగమునకుఁగల భేదమువంటిది.

(35) చిత్రవిచిత్రములఁ జేయుదమనువారియొద్దకు జేరకుము- వారు సన్మార్గము విడిచి సంచరించుచుందురు- వా రొనరించు పనులన్నియుఁ బరబ్రహ్మ సన్నిధానమున కేగదలచువారికి భ్రమఁగల్పించి తమయొద్దకు నాకర్షించుచుండును- కావుననీవు వాని యదార్థమును గుర్తెఁగి యెన్నఁడును వానినిఁ గోరకుము-

(36) 'కోరిక'యను సుడిగాలిలోబడి మనము గిరగిర బొంగరమువలెఁ దిరుగుచున్నంతవఱకును భగవంతునిఁజూడలేము- ఈశ్వరుని సందర్శింపఁగోరువాఁడు మహాశాంతిఁగల్గి భగవన్నామచింతనయందు మగ్నమైన మనస్సుఁగల్గియుండవలయును.

(37) జగన్మాతను మనమేలజూడలేము? ఆమె రాజాధిరాజుల యిండ్లలోఁబుట్టిన స్త్రీవంటిది- ఆమెయెన్నఁడునుబయటికి రాదు- తెరచాటుననుండి మాట్లాడును- ఆమె పరులనుజూడనేర్చునుగాని పరులామెనుజూడనేరు- కాని యామె పరమభక్తులు మాత్రము 'మాయ'యను తెరదాటి యావలకుఁబోయి యామెను దర్శింపనేర్తురు-

(38) "i మనిషి పురుగురానిస్థలము ii అడవులలో నేకాంతము iii మనస్సు" ఈమూఁడుస్థలములలో నెక్కడయినను భగవద్ధ్యానముఁ జేయవలయును-

(39) ఈకలియుగములో నవలంబించుటకు భక్తిమార్గము సర్వవిధముల నత్యుత్తమమైన మార్గము-

(40) మనలను జ్ఞానమొకవస్తువునకు గొనిపోవును- మూఢత్వము పలువస్తువులకుఁ దీసుకొనిపోవును-

(41) సముద్రమునకుఁ గొంచెముదూరమున నిల్చిచూచిన దానియందలినీరు నీలవర్ణముగలిగినట్లగుపడును- దగ్గరకువెళ్ళిచూచిన వర్ణహీనమై నిర్మలముగనుండును- అవ్విధముననే భగవంతుఁడయిన కృష్ణుఁడుఁగూడ దూరమునుండిచూచిన నీలవర్ణముఁ గల్గియుండును- నిజమాలోచించిన నాయనకు వర్ణములేదు. ఆయనపరిశుద్ధుఁడు. నిర్మలమైనవాఁడు.

(42) ఒకపెద్దయోడ (పొగయోడ) సముద్రములోఁ బోవుచుండినపు డెన్నియో చిన్న పడవలు,డింగీలు దానివెంటపోవుచుండును-అట్లేభగవంతుఁడవతరించినపుడు 'మాయ' యనుసముద్రముగుండ ననేకవేలమనుష్యులఁదన వెంట నాయనసురక్షితముగఁ గొనిపోవును

(43) పొగబండి యంత్రము నడచుచుఁ దానివెంట ననేకబండ్లను లాగుకొనిపోవుచున్నది- అట్లేమనయుద్ధారకులును పాపములతో నిండియున్న వారి ననేకవేలమందిని భగవత్సన్నిధానమునకుఁ దీసికొనిపోవుచుందురు-

(44) భగవత్ప్రేరేపకుఁడై పలుకు వానినాయన చుట్టములేల ప్రేమించి గౌరవింపరు? గారడివాఁడుచేయు చిత్రముఁజూచుటకు వానిచుట్టములు రారుకాని పరులువచ్చి యేమిచేయునోయని నోరుదెఱచుకొని చూచుచుందురు-

(45) వజ్రవతుల చెట్టువిత్తనములు క్రింద భూమిమీదపడవు- గాలిలోగొట్టుకొని పోయి యక్కడనే మొలచుచుండును- అట్లనే భగవత్ప్రేరేపకునిశక్తిని నాయనయింటివారు మెచ్చుకొనరు- దూరప్రదేశములందు శ్లాఘించుచుందురు-

(46) అమితభక్తితో నమితాసక్తితో నెవ్వరుమనస్సునిల్పి భగవద్ధ్యానముఁ జేయుదురో వారికి గురువుతోఁ బనిలేదు- కాని యటువంటివా రరుదు- కనుక ప్రతిమనుజునకు సామాన్యముగ గురువుకావలయును- ఉపగురువులు పెక్కుమందియుండినయుండ వచ్చును- మనమెవ్వరియొద్దనైన నేదయిన నేర్చుకొనినవారు మనకు నుపగురువులగుదురు- మనమహావధూతగారికి నిరువది నలుగురు యుపగురువులు కలరు'

(47) పెండ్లివారెవ్వరో పెద్దపెద్దధ్వనులఁజేయుచు నతిసంతోషముగ నొకమైదానమార్గమున వెళ్ళుచుండుట నవధూతగారు చూచినారు- ఈ మార్గమునకు జేరువలో నొకవేటగాఁడు పక్షినొకదానిని గురిబెట్టుచున్నాఁడు- ఒక్కపర్యాయమైన పెండ్లివారివంకఁ దిరిగిచూడఁడాయె- ఆధ్వనులు నీసంతోషము నీవేటగాని లక్ష్యమును మార్పఁజాలకఁబోయినవి- అప్పుడవధూతగారీయనను జూచి "నీవు నా యుపగురువువు- నీవాపక్షియందెట్లు మనస్సును గదలకుండ నిల్పివేసితివో యట్లే నేనును భగవంతుని ధ్యానముఁజేయుటకు గూర్చుండినపుడు నామనస్సును నాయనయందునిల్పుదును గాక" యనిపలికెను-

(48) ఒకఁడొకగుంటలోఁ జేపలఁబట్టుచున్నాఁడు- అవధూతగారతనియొద్దకుఁ జనుదెంచి 'కాశికిఁబోవుమార్గమేది'యని యడిగెను- అప్పుడే చేపయెఱను బట్టుకొనుచున్నట్లుండెను- అందువలన నతిజాగ్రత్తగానుండి యాతఁడు ప్రయాణీకునకు జవాబు నివ్వలేదు- తరువాత మత్స్యమును బయటికిలాగి 'మీరడుగు ప్రశ్నయేమి'యని యడిగెను- అవధూత యప్పుడాతనికి దండముఁబెట్టి 'నీవునాగురువువు. నేను భగవంతునికి ప్రార్థనఁజేయువేళ నేనును నీవలె మనస్సునిల్పుదును గాక- ఆపనినిబూర్తిచేయక ఱంధవపనిఁజూడకుందును గాక'యని పలికెను,

(49) ఒక హంస చేపనొకదానినిబట్టుకొనుటకు మెల్లగా నడచిపోవుచుండెను. దాని వెనుక నొక వేటగాఁడు దానినిగాల్చుటకు గురిపెట్టుచుండెను. ఈసంగతి నెఱుఁగక హంస ముందుకునడచుచునేయుండె. అప్పు డవధూతగారు దానినిజూచి "భగవత్ప్రార్థనజేయునపుడు నేను నీవలె నావెనుక నేమియున్నదిచూడక నాపనినిమాత్రమే చక్కఁబెట్టుకొందునుగాక" యని పలికెను

(50) ఒకగద్ద యొకమత్స్యమును నోటిలోఁబెట్టుకొనిపోవుచుండెను. దానివెనుక నాచేపను లాగుకొనదలచి కొన్నికాకులు గద్దలు వెంటఁబడి దానిని దరుముకొనిపోవుచున్నవి. అదిపోయినచోటికెల్ల నవిగూడ నఱచుచు నరుగుచున్నవి. అప్పుడాగద్దకు విసుకుజనించి మత్స్యమునువిడిచివేసినది. క్రిందఁబడినదాని నింకొకగద్ద నోటఁగఱచుకొని ఎగిరిపోవుచుండఁ దక్కినగద్దలు కాకులు దానివెంటఁబడినవి. మొట్టమొదటిగద్ద 'నా కష్టమంతయు నిప్పుడు తుదకువచ్చిన'దనితలచి యొక చెట్టుకొమ్మనై గూర్చుండెను. అప్పుడు దానికి నవధూత నమస్కరించి, ఓగద్దా! నీవు నాకు గురువువు. మనుజుఁ డెంతవరకు ప్రాపంచక కామమును బాధలనువిడిచిపెట్టడో యంతవఱకు నాయనమనస్సునకు శాంతియు హాయియుఁ గలుగదు" యని వచించెను

(51) శిష్యుఁడు గురువుమాటలతిరస్కరింపక శిరసావహింపవలయును. "నా గురువు కల్లుదుకాణమునకు వెళ్ళినను నాయన సర్వకాలములయందు 'రాయనిత్యానంద'యై యున్నాఁడు. 'పాపులు, దురాత్మగులు' వీరిమధ్యనున్నను నాగురువు నాబుద్ధికి నిర్దోషి, పరిశుద్ధుడగుచున్నాఁ"డని యర్థమిచ్చు పద్యమొకటి వంగదేశభాషలోఁగలదు.

(52) మానవగురువు పవిత్రవాక్యములను కర్ణములోఁజెప్పును ఇక దైవగురువు యాత్మలోఁజెప్పును.

(53) నలుగురుగ్రుడ్డివారు గజముయొక్క యాకారముఁగనుఁగొనుటకు మొదలుపెట్టిరి ఒకడు కాలునుబట్టుకొని 'ఏనుగు స్తంభమువంటిది'యనియు రెండవవాఁడు తొండమునుబట్టిచూచి 'ఏనుగ పెద్దదుండుకఱ్ఱవంటిది'యనియును. మూడవవాఁడు కడుపును బట్టిచూచి 'ఏనుగ పెద్ద తట్టవంటిది'యనియు నాల్గవవాఁడుచూచి 'ఏనుగతొట్టివంటిది'యనియుఁ బల్కెను. కనుక వీరిట్లు భేదాభిప్రాయులై పోట్లాడుకొనజొచ్చిరి. ఇంతలో నొకరు దారినడచుచు వీరున్నచోటికివచ్చి 'మీరేలబోట్లాడెద'రని యడిగెను. సంగతి నంతయువిని వాఁడప్పుడు "మీలో నొకరును గజముఁజూచియుండలేదు. ఏనుగుకాళ్లు స్తంభములవలెనున్నవి. కడుపు తట్టవలెనున్నది. తొండముకఱ్ఱవలెనున్నది. ఇవియన్నియు గలసి యేనుగయయినది" యనిపలికెను. భగవంతునిరూపములలో నొక్కదానినిమాత్ర

మే చూచినవారికథలోని గ్రుడ్డివారివంటివారు. కనుక వీరివలె వారును బోట్లాడుచుందురు.

(54) బ్రహ్మజ్ఞానియైనతర్వాతఁగూడ యజ్ఞోపవీతముల ధరింపవలయునా? బ్రహ్మజ్ఞానముఁ బొందినవానికి నేబంధ మంటుకొనియుండదు. అప్పుడు బ్రాహ్మణునకు శూద్రునకు భేదముండదు. జాతిభేదము నశించును. కనుక యజ్ఞోపవీతముండవలసిన యవసరము లేదు. 'ఈశ్వరుఁడు వేఱు. తాను వేఱు' అనితలచునంతవఱకు జంధ్యముండకఁదప్పదు.

(55) దేహము పనికిమాలినది యశాశ్వతమయినదియైనయెడల భక్తులేల దానిని గూర్చి జాగ్రతఁదీసికొనెదరు? ఉత్తపెట్టెనుగూర్చి యెవ్వరు జాగ్రత్తదీసికొనరు- కాని బంగారము ధనము దాచినపెట్టెనుగూర్చి యమితశ్రద్ధగానుందురు- మనదేహములో భగవంతుఁడుండునుగనుక భక్తులాదేహము నతిజాగ్రత్తతోఁగాపాడుదురు-

(56) నువ్వులమూటపగిలి క్రిందరాలిపోవును- అప్పుడు వానినన్నిటినిఁ బోగుచేయుట కష్టముగదా? అట్లే మనుష్యుఁడు ప్రాపంచకవిషయములందు మునిగియుండును- వానినివిడిచి మనస్సు భగవంతునిపైనిల్పుట దుర్లభము-

(57) భగవద్భక్తుఁడేల ప్రపంచమునువిడువవలయును? దోమకు వెలుతురగుపడిన జీకటిలోనికిరాదు- చీమకు పంచదారకుప్పయగుపడిన దానినివిడిచిరానేరదు- ఆచందముననే భగవంతునిఁ గనుఁగొనినవాఁడెప్పు డాయనసాన్నిధ్యముననే యుండగోరును-

(58) భగవద్భక్తుఁడేల నేకాంతముగనుండఁగోరును? పొగచుట్టగాల్చువాఁ డెప్పుడు నేకాంతముగనుండికాల్చుటకుఁగోరును- భగవద్భక్తునివిషయము నట్టిదియే-

(59) యోగులు, సన్యాసులు పాములవంటివారు- పామెప్పుడును దనబొక్కను దాను జేసికొనదు- ఎలికబొక్కలోనుండును- ఒకబొక్క నివాసయోగ్యముగాకపోయిన నింకొకదానిలోపలికిఁబోవును- ఇట్లే యోగులకు సన్యాసులకు నిండ్లులేవు- పరులయిండ్లలోఁ గాలముఁగడుపుచుందురు-

(60) ఏదయిన నొకపరజంతు వావులగుంపులోపలికివచ్చిన నవియన్నియుఁ దానిని గొమ్ములతోఁబొడిచి తరిమివేయును- మఱియొకజంతువుకాక యావేవచ్చిన దానియొద్దకుఁబోయి దానిదేహమునునాకుచు స్నేహముఁజేసికొనును- అవ్విధముననే యొకభక్తునియొద్దకు మఱియొకభక్తుఁడువచ్చిన నిద్దఱికి నమితహాయిగానుండును- వారిద్దఱికి విడి

పోవుటకిష్టముండదు- వెక్కిరించువాఁడొకఁడు వారిలోఁజేరఁబ్రయత్నించిన వానిని రు వెళ్ళఁగొట్టుదురు-

(61) నూలునమ్ముచు నూలుతోఁబనిచేయువాఁడే దానినిఁగూర్చిననంబరు మొదలగు విషయములఁ గనుఁగొనఁగల్గినరీతి జ్ఞానియే జ్ఞానినిఁగనుఁగొనఁగల్గును-

(62) ఒకజ్ఞాని యొకమార్గముప్రక్క సమాధియందుండెను- ఒక దొంగ యా మార్గమునఁబోవుచు నీయననుఁజూచి "ఈతఁడునుదొంగయే- రాత్రి యెక్కడనో క ష్టము వేసి యిప్పుఁడిచట గాఢనిద్రఁబోవుచున్నాఁడు- కనుక నీతనిని త్వరలోఁబోలీసు వారు బట్టుకొనిపోవుదురు- కనుక నేను త్వరగాఁబారిపోయెద" నని తలఁచుచు బరుగెత్తు కొనిపోయెను- తరువాత నచటికి నొక త్రాగుబోతువచ్చి "నీవు గోతిలోఁ బడిపోవుచు న్నావు- నీకంటె నేను నిజముగా నెక్కువబలమునుగలిగియున్నాను- నీవలెనే నేను దొర్లుటలే'దని చెప్పిపోయెను- ఇంతలో నాస్థలమున కొక జ్ఞానివచ్చి యీమహాత్ముఁ డి చట సమాధియందున్నాఁడని తెలిసికొని పాదములనొత్తుచు సేవఁజేసెను-

(63) ఇతరులఁజంపుటకుఁ గత్తులు, గడారములు గావలయును- తనకుఁ దానుఁ బొడుచుకొనిచచ్చుటకు నొక గుండుసూదిచాలును- అట్లే యితరులకుజెప్పుటకు శ్రుతి స్మృతులను జదువవలయును- కాని తనకు జ్ఞానముకలుగుటకు నొక దివ్యమయిన మనో రథదృష్టిచాలును-

(64) విశేషములోతులేని యొకగుంటలో నీరుకలదు- నిర్మలమయిన నీరుద్రాగు టకు దానిలోనీరు గదలింపకుండవలయును- ఏమాత్రముకదల్చినను బురదయై పోవును- నీ వు పరిశుద్ధుఁడవుకావలయుననితలచిన నిశ్చలభక్తిగలిగి నెమ్మదిగ భగవద్ధ్యానముఁ జేయు ము- వట్టివాదములలో నీకాలమును బలమును వ్యయపఱచకుము- అప్పుడు నీ మేదస్సు నిర్మలముగనుండి యాలోచనఁజేయుటకు వీలగును-

(65) నేతినిఁ జక్కగమరగబెట్టి యందులో రొట్టెలకై పిండినివేసినపుడు వి శేష శబ్దమగును. క్రమక్రమముగ నాధ్వనితగ్గిపోవును- ఈచందమున నే స్వల్పజ్ఞానమును గలిగియున్నంతవఱకు నరుఁడు వట్టివాదములఁబెట్టుకొనుచు నుపన్యాసముల నిచ్చుచుండు ను- గాని జ్ఞాని యవియన్నియుమాని సర్వకాలములయందు శాంతిగలిగియుండును-

(66) ప్రపంచములోనుండి ముక్తిని బొందగల్గువారు నిజమయినవీరులు-

(67) 'ప్రపంచము, భగవంతుఁడు' ఈరెంటిని నెట్లుకలిపెదవు? వడ్రంగి భార్యకు నెన్నియోపనులుకలవు- ఒకచేతితో గుండిలోపలిబియ్యమును గదల్చుచుండును- రెండవహస్తముతోఁ బిల్లవానినిఁబట్టుకొని పాలిచ్చుచుండును- బియ్యమునకువచ్చినవారితో నీసమయమున మాట్లాడుచుండును- అన్నిపనులఁజేయుచున్నప్పటికి రోఁకలి తనచేతిపైఁబడకుండునట్లు దంపువేయుటయందే యామెమనస్సుకలదు- లోకమువారితోఁ దిరుగుచు వ్యవహారములఁజేసికొనుచున్నను భగవంతుని నెప్పుడుమరచియుండకుము- ఆయనను జేరుమార్గమునువిడిచి యెప్పుడు నడువకుము-

(68) మొసలికి నీటిపైనుండుటయిష్టము- నీటిపైకివచ్చినపుడు వేటగాండ్రుచంపివేయుదురు. కనుక నీటిలోనుండితీరవలయును- అయినను మొసలి వీలుగానున్నపుడెప్పుడు పైభాగమునకువచ్చి యీదుచుండును- ప్రాపంచకవిషయములలో మునిగిన యోమనుజుఁడా! నీకును భగవత్సాన్నిధ్యమందుదిరుగుటయిష్టమేకాని అట్లుచేయుటకు నిన్ను లోకవ్యవహారముబాధించుచున్నది- కనుక వీలుగానుండి తీరికయున్నపుడెల్ల మంచియాసక్తితో దేవునిబ్రార్థింపుము- నీదుఃఖములనన్నిటిని నాయనతోఁజెప్పుము- సరియైనవేళ వచ్చినపుడు నీవెప్పుడు నిత్యానందసాగరమునందు మునిగియుండునట్లు భగవంతుఁడేయవకాశముఁగలుగఁజేయును-

(69) బజారులో సంగీతముఁబాడుచు తిరుగువారు సంగీతవాద్యము నొకహస్తముచేతవాయించుచు మఱియొకచేత మద్దెలగొట్టుచు నోట బాటలఁబాడుచుందురు- అట్లే మనుజుఁడు చేతులతో నేపనిజేయుచున్నను మనస్సునందు భగవన్నామమునుస్మరించుట మరువగూడదు-

(70) ఇంటియం దెన్నిపనులఁజేయుచున్నను జారస్త్రీ తన మనస్సును బ్రియులయందేయుంచును- అవ్విధముననే మనుజుఁడుగూడ భగవంతునియందులక్ష్యముంచి లోకవ్యవహారములఁ జక్కబఱచుకొనుచుండవలయును-

(71) భాగ్యవంతులయిండ్లలోనుండుదాసీలు వారిపిల్లలు దమపిల్లలుగఁజూచుకొని యాడించుచుందురు- అయినను యీదాసీలకు వారు తమపిల్లలుగారని తెలుసును. అట్లే మీరును మీపిల్లలకు నిజమయినతండ్రి భగవంతుఁడనియు, మీరు పోషించువారమమాత్రమేయనియు దలఁచుడి-

(72) వివేకము, విరక్తిగలిగినమనస్సులేక నూరక శ్రుతిస్మృతుల పఠించుటవలన లాభములేదు- వివేకము వైరాగ్యములేక నాత్మజ్ఞానైకవృద్ధిగలుగ నేరదు-

(73) నీవు మొదట నీయాత్మను గనుగొనుము. అప్పుడే పరమాత్మనుగూడ దెలిసికొనినవాఁడవగుదువు. అహంభావత్వమననేమి? అది "నాచెయ్యి, నాపాదము, నాకండలు, నానెత్తురు" అని యర్థమిచ్చునా? తిన్నగ నాలోచనఁజేయుము. అప్పుడు నీకు 'అహం' అనునదియే లేనట్లుతోఁచును. పొరలనుదీసినకొలది నుల్లిపాయ సన్నగిలిపోవునట్లు క్రమముగనాలోచించిన నహమనునదిలేదు. ఈయాలోచనకంతకు ఫలము భగవంతునిఁ గనుఁగొనుటయే. అహంభావత్వముపోయిన నీశ్వరుఁడుప్రసన్నమగును.

(74) భగవంతునిఁజూడవలయునని నీవు నిశ్చయముగఁదలఁచినట్లయిన గట్టినమ్మకఁగలిగి హరినామస్మరణఁజేయుము. సదసత్పదార్థముల తారతమ్యమునుగనుగొనుము

(75) ఏనుగనువిడిచిపెట్టినపుడు చెట్లనుబీకి కొమ్మలనువిరిచివేయును. కాని మావటివానియంకుశముచేతఁ బొడువఁబడియణగియుండును. అట్లే మనస్సును మనముస్వాధీనపఱచుకొననియెడల నది యిష్టమువచ్చినట్లు తలమచుండును. కాన వివేకమనుయంకుశముచేత మనము దానినిఁబొడువగనే యది స్వేచ్ఛగనుండుటమాని శాంతిగలిగి నిశ్చలముగనుండును.

(76) చప్పటులవాయించుచు హరిసంకీర్తనముజేయుము. కొంతకాలమునకు మనమునకు నిలుకడకలుగును. చెట్టుక్రిందఁగూర్చుండి చప్పట్లువాయించుచు హరినామస్మరణఁజేసిన నీకుఁగల దుష్టతలంపులన్నియుఁ దొలఁగిపోవును.

(77) హరినామమును వినినంతమాత్రమున నానందబాష్పములు కలుగునంతవఱకు యోగాభ్యాసములవసరము. హరినామమువిని యానందబాష్పములువిడుచువానికి భగవత్ప్రార్థనలతోఁబనిలేదు.

(78) ఒకయడవిలోఁ గట్టెలఁగొట్టుకొనివచ్చి యొకఁడమ్ముకొనుచుండువాఁడు. ఒక దినమున వాఁడడవిలోఁ గట్టెలఁగొట్టుచుండ నొకసన్యాసి యామార్గమునఁ బోవుచు నీతనినిజూచి, 'ఓమానవుఁడా! నీవింకను నీ యడవిలోపలికిఁ బొమ్ము. అందువలన నీకు లాభము కలుగు'నని చెప్పెను. కట్టెలఁగొట్టువాఁడీమాటలవిని ముందుకుబోయి యొక చందనవృక్షముఁగాంచి చాలాసంతోషించి యాచెట్టుకొయ్యను గొట్టితెచ్చి వీధిలోనమ్ముకొనియమితలాభముఁ బొందెను. అప్పుడువాడు 'నాకాసన్యాసియక్కడ చందన వృక్షమున్నది పొమ్మనక నూరకలోపలికిఁ బొమ్మనుటయేల?' యని యనుకొని మరువాఁడు మఱికొంతదూరము లోపలికిఁబోయి యొకరాగిగనిని గనుఁగొనెను. తరువాత మూఁడు దినములు క్రమముగ నరుఁగఁగా నాతనికి వెండి బంగారు వజ్రపుఁగనులగపడెను. వీనిఁ

గొనిపోయి వీధినమ్ముకొని త్వరలో భాగ్యవంతుఁడయ్యెను- భగవత్ జ్ఞానమును గాంఢించి పనిఁజేయువానిస్థితియు నీకట్టెలమ్మువాని స్థితివంటిదియే- కొంతవఱకు జ్ఞానము కల్గిన తరువాత వదలివేయక నింకఁగృషిఁజేయుచున్నయెడల వాఁడు పూర్ణవివేకముఁబొంది నిజమైన భాగ్యవంతుఁడగును.

(79) ఆత్మైకవృద్ధికిఁ గావలసిన యుపకరణములలో సజ్జన (వివేకులు, భక్తులు) సాంగత్యమొకటి-

(80) చచ్చిపోవునప్పుడెట్లు మనస్సుతలఁచుకొనుచుండునో తిరిగియట్లు పుట్టుచుండును- కావున భగవత్ప్రార్థనలు విశేషమవసరము- ప్రాపంచక విషయములఁగూర్చితలఁచుట సంతతాభ్యాసమువలన మనస్సునకు దప్పదు- ఇట్టి మనస్సుఁగలవాఁడెన్నఁడు భగవధ్యానమును విడువఁడు.

(81) అహంభావత్వమెప్పుడు బూర్తిగ నణిగిపోదా? కమలముయొక్క రేకులు యూడిపోయినను వానియంకురములు కనఁబడుచుండును- అట్లే యహంభావత్వము పూర్తిగా నశించినను దానిచిహ్నములుపోవు- అయిననివియుండి యేపనియు జేయలేవు- కనుక నీచిహ్నములుండి నను భయమవసరములేదు-

(82) భగవద్భక్తుని బలమేమి? భక్తుఁడు భగవంతుని బిడ్డవంటివాఁడు- ఆనంద బాష్పములే భక్తుని బలము-

(83) భక్తుఁడెట్లు భగవంతునిఁ ప్రేమించవలయును? పతివ్రతతనభర్తనెల్లప్పుడుఁ ప్రేమించును- పీనాసివాఁడు తన ధనమునదేవిధమునఁ ప్రేమించును. అట్లే భక్తుఁడయిన వాఁడు భగవంతుని సర్వకాల సర్వావస్థలయందు మనస్పూర్తిగాఁ ప్రేమించవలయును

(84) నీవునీదుర్గుణములనెట్లు జయించెదవు? కాయపుట్టినపుడుపువ్వు రేకులు వానియంతటనవియే యూడిపోవును. అట్లేయీశ్వరునియందు నీకుఁగల పరిశుద్ధభక్తి యెక్కుడయినకొలఁది నీదుర్గుణములు వానియంతటనవియే మాయమైపోవును-

(85) "గీతా"యను పదమును ద్వరత్వరగాఁ బలుమాఱుచ్చరింపుము. కొంచముసేపటికి 'తాగి, తాగి' యనివినఁబడును- ఈనూతనపదమునకు 'విడువుమ'ని యర్థము- ఓ మానవుఁడా! నీవు తత్క్షణము సకలము ద్యజించి యీశ్వరారాధనను సల్పుము.

(86) కోతిపిల్లతల్లిని కాగలించుకొనియుండును. పిల్లికూన యట్లుగాదు- ఇదితల్లి యెక్కడయుండిన నక్కడయుండి 'మ్యావ్, మ్యావ్' అని యఱచును- కోతిపిల్లనితల్లి

విడిచిన గ్రిందఁబడి బాధపడును. ఏలయన దానికి నొరులసహాయ ముండకపోవుటవలన దనుఁదానే పోషించుకొనవలయును. పిల్లితనకూనల నెక్కడబోయినను వెంటఁదీసికొని పోవును. తనకుతానుండుటలో, భగవంతుని యిష్టాయిష్టముల ప్రకారముండుననుట లోఁ గలబేదమిట్టిది.

(87) హిందూదేశములోఁ గాంతలు నాలుగైదు నీళ్ళబిందెల నెత్తిమీదఁ బెట్టుకొనినవ్వుచు నుత్సాహముతోఁ బోవుచుందురు. అయినను నీటిబొట్టొకటిగూడఁ గ్రిందికిఁదొణకిపడదు. సద్గుణమార్గమున నడచువారుగూడ నట్లే నడువవలయును. ఎట్టి స్థితులు కలిగినప్పటికి సత్యమార్గమును తనమనస్సువదలకుండునట్లు జాగ్రత్తపడవలయును

(88) సముద్రములో నీదఁదలచినవాఁడు బాగుగానభ్యాసముఁ జేయవలయును. ఒక్కదిన మభ్యసించిన నీతరాదు. అట్లే 'బ్రహ్మ'మను సాగరములో నీదవలయుననిన విశేషము కృషిఁజేయవలయును.

(89) కృష్ణుని నాటకమాడెదరు. మొదట 'నో కృష్ణా'యని సంగీతములు బాడుచు మద్దెలవాయించి తాళముల నుపయోగించుచుందురు. అయినను కృష్ణునివేషము వేయువాఁడు పొగచుట్టలఁ గాల్చుచుఁ దెరచాటునఁ గూర్చునియుండవచ్చును. ఇట్టి సంగీతనాదములు కొంతకాలమునకు నాగిపోయి రంగముపైకి నారదమహర్షి వచ్చును, ఈయన శృంగారముగ సంగీతముఁబాడుచుఁ 'కృష్ణా'రమ్మనిపిలుచును. అంతటగృష్ణవేషగాఁడు నిట్లుకూర్చుండుట బాగుగనుండదని తలఁచి తత్క్షణము బయలుదేరి వచ్చును. ఎన్నితడవలు పెదవులతో భగవన్నామము దలఁచినను భగవంతుఁడు దర్శనమీయఁడు. భగవద్దర్శనమయినపుడు భక్తుని మనస్సు శాంతిఁగల్గి యానందములో మునిగియుండును. అమితాసక్తిఁ బ్రేమగలిగి భక్తుఁడు పిలిచినపుడు భగవంతుఁడుదర్శనమిచ్చుట కాలస్యముఁజేయఁడు,

(90) భగవంతుఁ డెక్కడనున్నాఁడు? ఆయనయొద్దకు మనమెట్లుపోయి చేరఁగలము? సముద్రములో ముత్యములుగలవు. వానికొఱకు నీవుపలుపర్యాయములు మునిఁగి వెదుకవలయును. అట్లే భగవంతుఁడు ప్రపంచములో నున్నాఁడు. తద్దర్శనార్థివై నీవుపాటుఁపడవలయును.

(91) భుజించుటకు బియ్యముమాత్రమే పనికివచ్చినప్పటికి నాబియ్యమును నారువోసిన మొలవనేరవు. నారుగావలయుననిన వడ్లనే చల్లవలయును. భోజనమునకు నుపయోగపడవలెననినఁ పైపొట్టుమొదలగునవి తీసి బియ్యముఁజేయవలయును. ఇట్లే మత

ము సర్వకాలములయందు, స్థిరముగా నిలిచి యభివృద్ధి నొందుచుండుటకుఁ గర్మలవసరము. ఇవి యే సత్సదార్థమనుపంటఁబొందఁగల్గుట కుపయోగించు విత్తనములు. కావునఁబ్రతి మనుజుఁడును ముందుగఁ గర్మల నాచరింపవలయును.

(92) ఏమతమువారా మతమునే యవలంబించవలయును. హిందువుఁడు హిందూమతమునే, మహమ్మదీయుఁడు మహమ్మదీయ మతమునే, క్రైస్తవులు క్రైస్తవమతమునే యవలంబించవలయును. హిందువులకుఁ బూర్వమున ఋషులు స్థాపించినమతమే ముఖ్యమతము.

(93) నావికులయొద్దనుండు సూదంటురాయి సంబంధమయిన సూది యెప్పుడును ఉత్తరదిశనే చూచుచుండును, అందువలన నావికులు నావలను సరిగాఁ బోనివ్వగల్గియుండిరి. ఇదేవిధమున మనుజుఁడు సర్వకాలములయందు భగవంతునిమీద దృష్టినుంచినట్లయినఁ బ్రాపంచకవిషయములలోనుండి తప్పించుకొనఁగలుఁగును.

(94) మనజున కీశ్వరత్వ మెంతకాలముండును? నిప్పులోనున్నంతవఱకు నినుము ఎఱ్ఱగానుండును. దానిలోనుండితీసిన తక్షణము నల్లపడిపోవును. అట్లే మానవుఁ డీశ్వరునకుఁ గొలువుఁజేసినన్నిదినములు వానికిదైవత్వముండును. తరువాతనుండదు.

(95) నీటిలోఁబుట్టు బుడగలు నీరుయొకటియే. బుడగలు నీటిలోఁబుట్టి నీటిలోదేలి నీటిలోఁదిరిగి కలియుచున్నవి. జీవాత్మ పరమాత్మలొకటిగాని రెండుకావు. కానికొన్ని సూక్ష్మభేదములుకలవు. పరమాత్మ యపారమైనది. కాని జీవాత్మయట్టిదికాదు. ని పరమాత్మకు స్వతంత్రముకలదు. జీవాత్మకు స్వతంత్రములేదు

96) జీవాత్మ, పరమాత్మ, వీనిన్యైక్యము గడియారముయొక్క రెండుముళ్ళ యైక్యమువంటిది. వానిలో వానికి సంబంధముకలదు. ఒకదానినొకటి యాసించుకొనియుండును. చూపులకవి వేఱుగానున్నట్లు కనఁబడినను వీలుగానున్నప్పు డెప్పుడు జీవాత్మపరమాత్మలు కలియుచునేయుండును.

97) రాత్రివేళ మన కగుపడుచున్న నక్షత్రములు సూర్యుఁడుండగ నగుపడుచున్నవా? అగుపడుటలేదు. అంతమాత్రమున నక్షత్రములు లేవనవచ్చునా? వీలులేదు. ఈ విధముననే నీ వజ్ఞానదశలో నున్నంతవఱకు భగవంతునిఁ గనుఁగొనఁజాలవు. అంతమాత్రమున భగవంతుఁడు లేడనవము.

98) ఊసరవెల్లి రంగునుగూర్చి యిద్దఱు మనుష్యులు పోట్లాడుచుండిరి. వారిలో నొకరు, "ఆతాటిచెట్టుపైనున్న యూసరవెల్లి యెఱ్ఱగనుండి సుందరముగ నున్నది" యనియనెను. రెండవవాఁడు, "నీవుతలఁచినది తప్పు. దానివర్ణము నీలముకాని రక్త వర్ణముకాదు." అని చెప్పెను వారిద్దఱికి తగవుతీరక దుదకాచెట్టుక్రింద నుండుమనుజుని యడుగుటకు వెళ్ళిరి వాడచటనుండి యూసరవెల్లి వర్ణము సర్వకాలములందు మారుచుండుటఁ జూచుచుండె వారిలో నొకరు, "ఊసరవెల్లివర్ణ మెఱుపుకాదా" యని యడిగెను. తక్షణము రెండవ మనుజుఁడు, "అట్లు పలికెదవేమి? దానిదినీలవర్ణముకాని యెఱుపుకాదని చెప్పలేదా?" యనెను. వీరిద్దఱుచెప్పుమాటలను వాచెట్టుక్రిందనుండు మనుజుఁడు తలయూచెను. ఈతనికి నూసరవెల్లివర్ణము స్థిరమైనదికాదనియు మార్పులు జెందుచుండుననియు దెలియును. కనుక నే యిద్దఱిమాటలకు 'నౌ' యనెను. ఈయూసరవెల్లికివలె సచ్చిదానంద మూర్తికి ననేకరూపములుకలవు. ఒకభక్తునికి నొకవిధముగ భగవంతుఁడు దర్శనమిచ్చిన నారూపముమాత్రమే యాయనకు దెలిసియుండును. అన్నిరూపములఁ జూడఁగల్గినవాఁడు మాత్రము 'భగవంతునకు వివిధరూపములుకల' వని చెప్పఁగలుగును. భగవద్రూపములనన్నిటిఁ జూడఁగల్గినవా రెవ్వరులేరు. దేవునకు రూపారూపములు రెండునుకలవు,

(99) గాలిదీపమున్నది. దానికాంతి వివిధస్థలములఁ బ్రకాశింపఁజేయుచున్నది. కాని యొక్కొక్కస్థలమునందుఁగల తీక్ష్ణతమారుచున్నది. అయినను గాలి, దీపముననొక్కబుడ్డినుండియే వచ్చుచున్నది, అట్లే వివేకము భగవంతునివలన మతగురువులైనవారికి నందఱికిఁ గలుఁగుచున్నది. అనగా వీరు దానిని తెలిసికొని యితరులకుఁ జెప్పుచున్నారు. కనుక సర్వమునకు భగవంతుఁడేమూలము.

(100) 'దాగుడుమూత' యను యాటలో నెవరైననొకరు వెదుకువానిచేఁ బట్టుబడక దల్లిస్థానమునకు జేరును, ఇకవానిని 'దొంగ' వనలేరుగదా. అట్లే భగవంతునిఁ జూడ నేర్చినవాఁడు తిరిగి ప్రాపంచకవిషయములలో మునుఁగ నేరఁడు. పైఁజెప్పఁబడిన యాటలోఁ దల్లిస్థానముఁజేరినవాఁడు 'దొంగ' యని పిలువఁబడకుండ నిష్టమువచ్చినట్లు తిరుగవచ్చునుగదా. అట్లే యొకపర్యాయము భగవత్సాన్నిధ్యగమునకు బోనేర్చినవాఁడు దేనిచేతఁ గట్టుబడడు. లోకవిషయములందాసక్తినిజిజ్ఞాసయుండదు.

(101) ఏఫలముఁ బొందఁదలచుకొనినవాఁ డాఫలమునిచ్చుపనినిజేయుటకు దగినయుపకరణములఁ గలిగియుండవలయును. పాలలో వెన్నకలదని యూరకనంటిన లాభముండునా? వెన్నకావలసియున్న పాలనుఁ బెరుగుగఁజేసి చల్లఁజేసి వెన్నతీయుము. నీ

వు భగవంతునిఁజూడఁదలఁచుకొనిన సాధనలన్నిటి నభ్యసించుము. ఊరక 'భగవంతుఁడా! భగవంతుఁడా'యని యఱచిన నేమిసార్థకము?

(102) 'గంజాయియా'కనుకొనినమాత్రమున మత్తుకలుగదు. దానినిదెచ్చి నలిపి ముద్దఁజేసిమ్రింగిన మత్తుకలుగును. 'దేవా, దేవా'యని పెదవులతోఁబల్కిన లాభములేదు. సతతము భగవన్నామస్మరణ నాసక్తితోఁ జేయుము. యుక్తకాలములో నీకు భగవంతుఁడు దర్శనమిచ్చును.

(103) మనుజునకు ముక్తి యెప్పుడుకలుగును? అహంకారముచచ్చిపోయినపుడు ముక్తిగలుగును.

(104) కాలిలో ముల్లువిరిగినపుడు మఱియొకముల్లుసహాయముతోఁ దానిఁదీసి యప్పుడు రెంటిని బారవేయుదుము. మనయాత్మనుగప్పియుండ జ్ఞానమును వివేకమే తొలగించును. నిజమయినజ్ఞానికి జ్ఞానాజ్ఞానములు రెండునుండవు. ఆయనస్వేచ్ఛగ నుండును.

(105) మాయనుండితప్పించుకొనుటకు సాధనములెవ్వి? మాయనుండి విడుదలకాగోరువానికి భగవంతుఁడే సాధనములఁజూపును. కాని నిజమయిన యాసక్తి యుండవలయును.

(106) మాయకలదనియెఱిఁగి దానిస్వభావమునుదెలిసికొనిన, దొంగతీరున నది దానంతటనదియే మనయొద్దనుండిపారిపోవును.

(107) నీవు శాశ్వతమయిన సచ్చిదానందసాగరములో మునుగవలయును. 'ధనాశ, కోపము'నఁబడు నీటిజంతువులకు భయపడకుము. 'వివేకము, వైరాగ్యము'నఁబడు పసుపుఁబూసికొనిన నావాసనకు నేజంతువయు నీచెంతకురాక దూరముగఁబోవును.

(108) భ్రాంతికలుగునని భయమున్నచోటికి వెళ్ళకఁదప్పకబోయిన జగన్మాతను మఱవక స్మరించుకొనుచుండుము. నీ కక్కడఁగలుఁగఁగల దురుద్దేశములనన్నిటి నా జగన్మాతయే త్రుంచివేయును. అట్లుతలఁచుటకు నీ కప్పుడు సిగ్గుకలిగి యనుకొనక బాగుపడుదువు.

(109) మనము భగవంతునిబిగ్గరగబ్రార్థింపవలయునా? నీ యిష్టమువచ్చినట్లు ప్రార్థనసలుపుము. నీ వెట్లుప్రార్థించినను భగవంతుఁడు వినుననుమాటనిశ్చయము. చీమ నడుచునపుడగుశబ్దముఁగూడ నాయనవినఁగలుగు ను.

(110) ప్రాణముపై నిచ్ఛ మనకెట్లుపోఁగలదు? ఈదేహము కండ, యెముక, నెత్తురు మొదలగువానిచేఁ జేయఁబడెననియు నివియన్నియు నశాశ్వతమనియుఁ దలఁచుచుండిన ప్రాణేచ్ఛఁ దప్పిపోవును.

(111) భక్తుఁడుధరించవలసిన దుస్తులు వేఱుగాఁగలవా? అనుకూలముగనుండు దుస్తులధరించినమంచిది. కాషాయవస్త్రములుధరించి కమండలువు, దండముఁబూనినవాఁడు (సన్యాసి) తత్వమునుబోధింపకఁబోవచ్చును. ఈశ్వరకీర్తనల బాడలేకపోవచ్చును. జారునివలె దుస్తులఁధరించువాఁడు సర్వకాలములందు భగవత్ప్రార్థనలఁజేయుచు నాయన మహిమల వర్ణింపుచుండవచ్చును.

(112) భగవంతుఁడు దర్శనమిచ్చుటకుఁ బూర్వమగుపడు చిహ్నములెవ్వి? సూర్యుఁడు రాబోవుచుండఁగా హరిహయదిగ్భాగము రక్తవర్ణముఁగలిగియుండును. అట్లే భగవంతుఁడు భక్తునకుఁగనఁబడఁబోవుపూర్వము 'నిష్కపటత్వము, పరిశుద్ధత, పాపరహితత్వము' భక్తునకలవడును.

(113) మనకు ప్రాపంచకసుఖములయం దరుచియెప్పుడుకలుఁగును? భగవంతుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. ఈయానందము శాశ్వతమయినది. ఈశ్వరభవనమునకుఁ జేరఁగలిగినవారికి నశాశ్వతములయిన యీ యిహలోకసుఖముల ననుభవించుటకు నిష్టముండదు.

(114) మనస్సుస్థితి యెట్లిదై యుండినపుడు భగవద్దర్శనము సంప్రాప్తమగును? మనస్సునకు శాంతియున్నపుడు భగవంతుఁడు భక్తునకగుపడును. మనస్సనఁబడుసముద్రము కోరికయనఁబడుగాలివల్లఁ గదలుచుండిన భగవంతునిరూపమున్న డుందులో నగుపడుటకు వీలుండదు.

(115) మనము మనప్రభువైన యీశ్వరుని నెట్లు చూడఁగలము? పెద్దగాఁగనుండి సుందరముగనుండు మత్స్యముఁ బట్టదలఁచి చేపలఁబట్టువాఁడు తనగాలమును నీటిలోవేసి చాలకాలము వేచుకొనియుండును. 'శాంతి, ఓర్పు, ఆసక్తి' వీనినిగలిగియున్నవాఁడు చిరకాలము ప్రార్థనలఁజేసి భగవంతునిఁగనుఁగొనఁగలుఁగును.

(116) క్రొత్తఁగాఁబుట్టినదూడ తిన్నగనిల్చినడచుటకుఁబూర్వము పలుపర్యాయములుఁ క్రిందికిఁబడిపోవును. అట్లే భగవంతునియొద్దకుపోవఁగోరువాఁడు మార్గమునందనేకతడవలు పడిపోవును. ఓర్పుఁగలిగి యత్నింపుచు లేచుచుబోయినఁదుదకు 'ముక్తి'యను గమ్యస్థానమును జేరును.

(117) ఇద్దఱుమనుష్యులు 'శవసాధన' యనఁబడు క్రూరపద్ధతిప్రకారముకాళినిఁబ్రార్థించుటకు మొదలుబెట్టిరి. (చీఁకటిరాత్రియందు శవముమీఁదఁగూర్చుని ప్రార్థించుట 'శవసాధన' యనఁబడును). వారిలోనొకరు పూర్వరాత్రియందుభయపడెను. రెండవవాఁడు రాత్ర్యంతమందుగలిగిన దేవి సాక్షాత్కారమువల్ల సంతోషపడెను. అప్పుడీతఁడామెనుజూచి 'అతఁడేల భయఁపడి పిచ్చివాఁడాయె'నని యడిగెను. ఆమె 'ఓభక్తా! నీవును వానివలె నిదివఱకుజన్మలలోఁ బిచ్చివాఁడవైతివి. ఇప్పుడు నన్ను జూడఁగలిగితివి" యని బదులుచెప్పెను.

(118) హిందువులలో ననేకతెగలుకలవు. వీనిలో దేనిని మనమవలంబించవలయును? పార్వతి యొకానొకప్పుడు మహాదేవునితో, "నాథా! సచ్చిదానందస్వరూపునకు మూలమేది" యనిప్రశ్నించెను. అప్పుడాయన 'భక్తి'యేమూలమని ప్రత్యుత్తరమిచ్చెను. కనుక మతభేదములఁబాటింపక నమ్మిక, భక్తిఁగలిగి మీమీమతములప్రకారము మీరు కృషిఁజేయుఁడు.

(119) మొక్కను మేకలు మొదలగునవివచ్చి త్రొక్కిపోకుండ మనము దాని చుట్టు కంచనువేయుదుము. తర్వాత నది పెద్దదయినపుడు గొఱ్ఱెలు, గోవులు మొదలగు యనేకజంతువులు దానిక్రిందికివెళ్ళి దానియాకులనుదిని బ్రతుకవచ్చును. అట్లే నీకు విశేషము భక్తిలేనపుడు దానిని దుర్గుణములనుండి దుస్సహవాసమునుండి రక్షింపవలయును- నీభక్తి యధికమయినపుడవియన్నియు నిన్నేమియుఁజేయలేవు. దుర్మార్గులు దుష్టులుఁగూడ నీచెంతకువచ్చి బాగుపడుదురు.

(120) అనేకకోట్లయేండ్లు చెకుముకిరాయి నీటిలోనుండినను దానికి దానియంత రాగ్నిపోదు. దాని నేసమయమునందు గొట్టినను నిప్పుపడును. భక్తునియొక్క భక్తిఁగూడ నటువంటిదియే. ప్రపంచములోఁగల యపరిశుద్ధవస్తువులన్నియు నాయనను జుట్టుకొనిన నాతనిభక్తినశింపదు. భగవన్నామమును వినినప్పుడెల్లఁ బొంగిప్రకాశించును.

(121) అతివేగముగాబ్రవహించుచున్న ప్రవాహములో నక్కడక్కడ సుడిగుండములువడును. మఱికొంతకాలమునకు జక్కగా నీరుపారుదలయగుచుండును. ఈతీరు ననే భక్తులమనస్సుగూడ నప్పుడప్పుడు 'దుఃఖము, అపనమ్మిక' యనఁబడు సుడిగుండములఁబొంది తరువాత నెప్పటియట్లగుచుండును. ఈసుడిగుండములు విశేషకాలముండునవి కావు.

(122) ఒకమనుజుఁ డొకబావినిత్రవ్వించెను. ఇరువదిమూరలలోతు త్రవ్వఁబడినది కాని బుగ్గపడలేదు. కనుక దానినివిడిచి యింకొకదానినిద్రవ్వించెను. ఇచ్చట నంతకం

పో లోతు త్రవ్వినను నీటిబొట్టుగుపడలేదు. ఇంకొకబావిని త్రవ్వించెను కాని కష్టమంతయు నేలఁబడిపోయెను. తుదకు విసుగుజనించి యాపని నేమానుకొనెను. ఈ మూడుబావుల లోతు సుమారు నూరుమూరలుకలదు. ఇంతపని నోర్పుఁగలిగి మొట్టమొదటిబావియందే చేసిన నెంత దివ్యమయిననీరుపడునది తెలుసుకొనలేకపోయెను. పలుపర్యాయములు మనోరథదృష్టుల దొలఁగించుచుండువారి స్థితియు పైజెప్పఁబడినకథలో మనుజుని స్థితివంటిదియే. జయమునొందఁదలఁచుకొనిన నేదియో యొకదానియందు గుఱిఁబెట్టుకొనిపనిఁజేయ వలయును.

(123) ఎన్నిదినములు రాయి నీటిలోనున్నను నీరు దానిలోపలికిఁ జొరనేరదు. బురదనేల యెంతనీరుతగిలిన నంత మెత్తఁబడిపోవును. దృఢమయిన దైవభక్తిఁగలవానిని

యెంత గొప్పయాపదవచ్చినను మనస్సుచలింపదు. అట్టి గట్టినమ్మికలేనియెడల నాపదలు సంభవించినకొలఁది మానవుఁడు దుర్బలుఁడగును.

(124) పొగబండి యింజను తనవెంట నెన్నియో పూర్తిగనింపఁబడినబండ్లనులాగుకొనిపోవును. అట్లే దృఢనమ్మికఁగలవారెన్నికష్టములననుభవించుచున్నను దమనాశ్రితుల భగవత్సన్నిధానమునకుఁ గొనిపోవుట కేమాత్రముఁ గష్టపడరు.

(125) పిల్లవాని యజ్ఞానమెటువంటిది? పిల్లవాఁడు ధనము నాభరణములను విడిచి బొమ్మలనుమాత్రముకోరును. భక్తునివిషయముఁగూడ నిటువంటిదియే. మఱియెవ్వరు నీ ధనమును గీర్తిని గౌరవమునువిడిచి భగవద్ధ్యానముఁజేయ నిచ్చగింపరు.

(126) పిల్లవాఁడు స్తంభమునుగాని, కఱ్ఱనుగానిపట్టుకొని యేమియుభయములేక దిరుగును. ఒకవేళఁబడినఁ దిరిగిలేచి తిరుగుచుండును. అట్లే నీవును భగవంతుని యాధారముగఁజేసికొని లోకవ్యవహారములఁ జక్కఁబెట్టుకొనుము. భయపడవలదు.

(127) విశేషములోతులేనిగుంటలోనీరు నెవ్వరుపయోగింపకఁబోయినను నది త్వరలో నిగిరిపోవును. అట్లె పాపిష్ఠుడైనవాఁడుగూడ 'సర్వము భగవంతునిదే. ఆయనయనుగ్రహా'మని పూర్తిగ మనస్సులోఁదలఁచిన వానిపాపములన్నియు హరించిపోవును. ఆతఁడప్పుడు పరిశుద్ధుఁడగును.

(128) 'బకాలమా' (Bakalama) కంటె భద్రకరమై సులభముగనుండు మార్గము మఱివేఱులేదు. 'బకాలమా' యనిన భగవంతునియిష్టమునకు సర్వమును విడుచుట యని యర్థము. 'నాది'యనుమాటయేయుండదు.

(179) 'పూర్ణమయినవిశ్వాసము' దీనిస్వభావమెట్టిది? పగలంతయుఁ గష్టపడిపని చేసి రాత్రివేళ దిండుమీదనొరిగి మానవుడు సుఖముగానున్నపు డాతనిబాధలు, దుఃఖములు తుదవఁబచ్చును. ఇట్టిస్థితినే పూర్ణమయినవిశ్వాసమందురు.

(180) ఎండాకులు వాయువువీచుప్రక్కకుఁ గొట్టుకొనిపోవుచుండును. వానికి స్వాతంత్ర్యబుద్ధిగాని, కష్టముగాని లేదు. అట్లే భగవంతునిమాత్ర మేనమ్ముకొనువా రాయన యిష్టమువచ్చినట్లు నడచుకొందురు. వీరికిస్వాతంత్ర్యబుద్ధిగాని శరీరకష్టముగాని లేదు.

(181) చక్కఁగాబండిన మామిడిపండును భగవంతునకు సర్పణజేయవచ్చును. లేనియెడల దానితో నేపనియైనఁజేయవచ్చును. కాని పక్షికొరికిన పండెందుకుఁ బనికిరాదుగదా. అట్లే బాలునిమనస్సు పరిశుద్ధమైయున్నప్పుడే యీశ్వరసేవకు వానిఁబ్రేరేపింపవలయును. ప్రాపంచకవిషయాసక్తి, కోరిక మొదలగునవి పట్టుబడకపూర్వమే యట్లుచేయుము. ఈ లోకవ్యవహారసముద్రమునందు మునిఁగినవారిని లేవనెత్తి సన్మార్గమును ద్రొక్కునట్లుచేయుట దుర్లభము.

(182) సన్యాసి కాషాయవస్త్రములఁ గట్టుకొనినందువలన నేమిలాభము? దుస్తులలో నేమికలదు? పరిశుద్ధవిషయములతో సంబంధముఁ గల్గియుండుటకాషాయవస్త్రముల స్వభావము. మురికిగుడ్డలను, జిరిగిపోయిన గుడ్డలను ధరించిన వినయోద్దేశములు కలుగును. కొంచెము సుందరమగు వస్త్రములఁగట్టి కాళ్ళకు బూట్సు దొడిగినవానికి గర్వ మధికమగును. నల్లకమ్ములబట్టలఁ గట్టుకొనినవాఁడు శృంగారపద్యములను, పాటలను పాడును. కాషాయవస్త్రములు స్వాభావికముగ మనస్సునందు పవిత్రమైన తలఁపులు పుట్టునట్లుచేయును, 'దుస్తు' యనునది విశేషమేమియు బోధింపకున్నను బ్రతివిధమయిన దుస్తుస్వాభావికముగఁ గొన్ని సంబంధములఁ గల్గియుండును.

(183) ఒకమనుజుఁడు తనకొడుకులలో నొకనిఁజంకలో నెత్తుకొని యొకనిని నడపించుకొనుచు నొకతోటలోగుండ బోవుచుండెను. గాలిలో గాలిపట మొకటి యెగురుచునాడుచుండుటఁ జూచి నడచుపిల్లవాఁడు, "తండ్రీ! అదిగో గాలిపట'మని చప్పట్లు కొట్టుకొనుచు నఱచెను- ఇప్పుడీతఁడు తండ్రిచేతినివిడిచెను గనుక క్రిందఁబడిపోయెను చంకలోఁబిల్లవాఁడుగూడ జప్పట్లుగొట్టెనుగాని క్రిందఁబడలేదు. నడచుపిల్లవాఁ డాత్మైకవిషయములలో స్వయంసహాయమును గల్గినట్లును రెండవపిల్లవాఁ డొకరుచేయు సహాయమునకు లోఁబడియున్నాఁడని తెలియుచున్నది.

(184. 'వేనకువేలు గురువులు కలరు. కాని యనుభవసిద్ధులొక్కరుగూడనుండ' రని యొకసామితకలదు. సలహాలనిచ్చువా రందురుగాని వానిప్రకారము నడచుకొనువా రు కొద్దిమందియుందురు.

(185) సూర్యరశ్మి యెక్కడవ్యాపించినను నదియొక్కటియేకదా. అయినను నది i మెఱయుప్రదేశము ii నీరు iii అద్దము iv లోహము వీనిపైఁబడిప్రతిఫలించుచుం డును. దివ్యజ్యోతియు నట్టిదియే. అందఱి హృదయములందు సమముగానే పడును. కాని సాధుజన హృదయమునందుఁబడినఁ జాలఁబ్రతిఫలించును.

(186) కొన్ని పదార్థములఁగల్పి ముద్దఁజేసి బియ్యపుపిండిలో ముంచి రొట్టెలఁ జేయుదురు. ఆ కలుపఁబడు పదార్థములనుబట్టి యారొట్టె రుచిమారుచుండును. అట్లే మనుష్యులందఱికి దేహము లొక్కటేయైనను వారిహృదయముయొక్క పరిశుద్ధాపరిశు ద్ధతలఁబట్టి వారియందు భేదములగుపడును.

(187) మతమేలభ్రష్టగుచుండును? వాననీరు నిర్మలమైనదయ్యును భూమిమీదఁ బడి ప్రవహించునపుడు భూమితీరునుఁబట్టి మలినపూరితమగుచున్నదిగదా. ఇండ్లకప్పులు, గొట్టములు కాలువలు మురికిగానుండిన వానిలోఁ బ్రవహించు నీరుగూడ ననిర్మలముగ నుండును.

(188) సత్వరజస్తమోగుణములనుబట్టి మానవులనేక భేదగుణములను గలవారుగా నున్నారు.

(189) గొంగళిపురుగు తాఁగట్టుకొనిన గూటిలోనే యిరుకుకొనిపోవును. అట్లే ప్రపంచమునుగోరువారి మనస్సును విషయములం దిరుకుకొనిపోవుచున్నది. తరువాత నా పురుగు శీతాకోక చిలుకగామారి బయటికివచ్చి వెలుగును వాయువును ననుభవించు చున్నది. అట్లే ప్రాపంచక విషయాసక్తుడైనవాఁడు మాయయనఁబడు తెగనుండి వైరా గ్యమనఁబడు రెక్కలుగల్గి బయటికివచ్చును.

(140) ప్రేమమూఁడువిధములు i సమర్థ (నిష్కపటమైనది) ii సమంజస (పర స్పర) iii సాధారణ (సామాన్యలేకగపటసహిత). ఈమూఁడింటిలోసమర్థప్రేమయుత్త మము. ప్రియుఁడు తనకష్టములనుఁగూడ లక్ష్యపెట్టక ప్రియురాలి మేలునుమాత్రముజూ చును. ఈప్రేమను సమర్థప్రేమయందురు. ప్రియురాలి మేలును జూచుచుఁ దనమేలు

నుఁగూడ జూచుకొను ప్రియుని ప్రేమ సమంజసప్రేమ యనఁబడును. ప్రియురాలి మేలు నుజూడకఁ దన మేలునుమాత్రము జూచుకొను వాని ప్రేమను సాధారణప్రేమయందురు.

(141) మంచునుగూర్చి వినినవారు పలుమందియుందురు. కాని దానిఁ జూచినవారు తక్కువమై యున్నారు- అట్లే భగవద్గుణములగూర్చి గ్రంథములలో జాలామంది చదివియుందురుకాని యనుభవసిద్ధముగ జూచినవారరుదు. మంచునుజూచి ... కాని రుచిజూచినవారుండరు. అవ్విధముననే భగవంతునిఁజూచినవారున్నను నాయన స్వభావమెఱింగినవారు తక్కువ. మంచును రుచిజూచినవారు మాత్రమే దానిని గూర్చి చెప్పఁగలరు. అట్లేయొకపర్యాయము భగవంతునిఁ దనయధికారిగను నొకప్పుడు తన మిత్రునిగనిట్లనేక రూపములతో భగవంతునిఁ జూడనేర్చినవారే యాయన గుణముల వర్ణింపనేర్తురు.

(142) మనస్సొక్క పదార్థమైనను నందఱిమనస్సులు నాల్గువిధములు i బద్ధమనస్సు ii ముముక్షుమనస్సు iii ముక్తమనస్సు iv నిత్యముక్తమనస్సు.

(148) అప్పుడే గ్రుడ్డులోనుండివచ్చిన కప్ప మొదలగువాని పిల్లకుఁ దోకయూడిపోయినఘూమిమీదను నీటిలోనునివసింపఁగలదు. మనుష్యునకజ్ఞానమనుతోక యూడిపోయిన లోకములో నేగాక భగవంతునితోఁగూడనివసింపఁగలడు. అనగా నట్టివాఁడులోకములోఁ దిరుగుచున్న నజ్ఞాన మహాసాగరములోఁ బడక నీశ్వరునియందే తన దృష్టిని నిల్పును.

(144) చేతులకు నూనెరాచుకొని పనసపండుఁగోసిన దానిరసముంటుకొనిబాధింపదు- అట్లేనీవు నిజమైన జ్ఞానమును (తత్వమును) సంపాదించిన నప్పుడీ ప్రాపంచకవ్యాపారములు, విషయములు నిన్నేమియుఁ జేయలేవు.

(145) చింతామణివలన బంగారముగఁ జేయఁబడిన యినుపతునుక నింటిలోనుంచినను పైటఁబెంటలోఁ బారవేసినను బంగారు తునుకగనేయుండును. ఇవ్విధమున నొక్కపర్యాయము భగతత్సాన్నిధ్యమునకుఁ బోవనేర్చినవాఁడు మహాకల్లోలముగనుండు గృహమునందుండిన నడవియందుండిన నొక్కటియే. ప్రాపంచక విషయములేవియునాతని నంటుకొనవు.

(146) సముద్రములో నొకచిక్కున నడుగుభాగమున సూదంటిరాయి యుండును. దానిపైఁబోవు పడవయొక్క యినుపమేకుల నన్నిటి నిది యాకర్షించును. ఇప్పుడు చెక్కకూర్పు వదలిపోవుటవల్ల పడవమునిఁగిపోవును. అట్లే యపారమైన భగవంతు

నిచేత భక్తునిమనమాకర్షింపఁబడిన నీయనకుఁగల యహంభావత్వము, కపటము మొదల గు దుర్గుణములన్నియు వదలిపోవును. అంతభక్తుని మన మీశ్వరునియందు లీనమగును.

**(147)** నూతనముగవచ్చిన కోడలు గృహకృత్యములఁ జక్కఁబెట్టుచుండును. కాని సంతానముకలిగిన తరువాతఁ బూర్వమువలె నింటిపనిఁజేయనేరదు. దీనిని జేయు టయం దామెకు సంతోషముండదు- ఎప్పుడు బిడ్డను దగ్గరబెట్టుకొని ముద్దాడి యాడు చుండును. ఇదేవిధమున నజ్ఞానియైనవాఁడు ప్రాపంచక విషయములందు సంతోషముఁ బొంది చేయుచుండును. ఒకతడవ భగవద్రూపముఁ గనుఁగొనినవాఁడు ప్రపంచ విషయ ముల నిచ్ఛయింపక సర్వకాలములందు మనస్సును సర్వశక్తునియందే లీనము చేయును.

**(148)** సిద్ధుఁడుపొందు స్థితియెట్టిది? (చక్కఁగనుడికినయన్నమునకు, బరిపూర్ణజ్ఞా నికి, 'సిద్ధ'యనిపేరు) వంకాయగాని బంగాళాదుంపగాని చక్కఁగ నుడికినపుడు మెత్త పడును. మనుజుఁడు సిద్ధుఁడైనపుడు శాంతునిగను దయామూర్తిగను మారును.

**(149)** లోకములోఁ బంచసిద్ధులు కలరు- i స్వప్న సిద్ధులు. వీరు స్వప్నజ్ఞానముఁ బడయుదురు. ii మంత్రసిద్ధులు. వీరు పవిత్రమంత్రములజపించి పూర్ణులగుదురు. iii హ ఠాత్ సిద్ధులు ధనముకొరకిగాని, లేక ధనపతియైనకాంతఁ బెండ్లియగుటవల్లగాని యక స్మాత్తుగ భాగ్యవంతులగు బీదవారివలె నాకస్మికముగ బ్రహ్మజ్ఞానులగువారు హఠాత్ సిద్ధులు. ఏవిధముననో కొంతమంది పాపాత్ములు హఠాత్ సిద్ధులగుదురు. iv కృపా సి ద్ధులు, ఈశ్వరానుగ్రహమువల్ల ముక్తిబొందువారు. అడవినిఁ బాగుచేయుచున్నవానికి స్వంతముగ కృషిఁజేసి నిర్మింప నవసరములేక బావియింటినొకదానిఁ గనుఁగొనవచ్చును. ఇట్లేకొంతమంది యనాయాసముగ ముక్తిఁబొందుదురు. v నిత్యసిద్ధులు. వీరెప్పుడు ను బరిపూర్ణజ్ఞానులే యయి యున్నారు.

**(150)** కూరగాయలవీధికి దూరముగ నున్నంతవఱకు మన మొక పెద్ద యవ్యక్త మైన ధ్వని వినఁబడును. ఆవీధికిఁ బోయిన నొకరు వంకాయలు బేరముచేయుచున్నట్లు, మఱియొకరు పచ్చిమెరపకాయల బేరముఁజేయుచున్నట్లు నింకొక రింకొక బేరముఁజేయు చున్నట్లు మనకుఁ దెలియఁగలదు. అట్లే మానవుఁడు భగవంతునకు దూరముగ నున్నంత వఱకు విషయాసక్తుఁడై వృధావాదములలోమున్గిపోవును. ఇవియన్నియు నాతఁడు భగ వంతునిని సాన్నిధ్యమునకుఁ జేరినపుడు మాయమైపోవును. అప్పుడీశ్వరచిత్రముల జక్క గా గుర్తించును.

**(151)** 'జ్యూ' యనుతెగవారు 'జేసస్'ను గొయ్యకుఁబట్టించి మేకులఁగొట్టించి నశాయన వారిని క్షమించవలయునని. కారణమేమి? సామాన్యపు కొబ్బరికాయకు జి

న్న రంధ్రముఁజేసి లోపలికొబ్బరిని దాకవచ్చును. కాయయెండిపోవును. ఇప్పుడు కొబ్బ రిచిప్ప నంటుకొనియుండదు- ఇదివఱలోఁజేసినట్లిప్పుడుఁగూడ రంధ్రముఁజేసిచూచినలో పలికొబ్బరి వ్రేలికిఁదాకదు. 'జేసస్' యెండుకొబ్బరికాయవంటివాఁడు. అతని యం తరేంద్రియము బహిర్దేహముతో సంబంధముఁ గల్గియుండలేదు. అందువలన దేహమునకుఁ గల్గిన బాధ మనస్సునకులేదు. ఎంతలోతుగ మేకులను నాయన దేహములోఁ గొట్టినను దనశత్రువుల మేలుకై శాంతమనస్సుతో నాయనప్రార్థింపఁగలఁడు.

(152) ఒక వనితారత్నమునకనేకమంది పిల్లలుకలరు. ఒకరికి నొక ముత్యముని చ్చును. మఱియొకరికి నొక బొమ్మనిచ్చును. వీరు వీరితల్లినిఁగూడ మఱచిపోయి తమ కాటవస్తువులు దొరకినవియని సంతోషపడుచుందురు. అప్పుడుతల్లి గృహకృత్యముల నె ఱవేర్చుచుండును. ఇంతలో నాపిల్లలలో నొకరు తనయాటవస్తువునుబోఁగొట్టుకొని "అ మ్మా! అమ్మా! నాదిపోయినదే"యని తల్లినిగూర్చి యేడ్చును. ఈమె వానియొద్దకుబోయి పోయినదా'యని ముద్దాడును. కనుక నోమనుజుఁడా! ప్రాపంచక విషయములలో ము నిఁగి జగన్మాతను మఱపోతివి. వీనిని విడిచి యామెనుఁగూర్చి ప్రార్థించిన నిన్నామె ద గ్గిరకుఁదీసి కాపాడును.

(153) భగవంతునకు బెక్కు-నామములు, పలురూపములు కలవు. ఏరూపమును గోరి యేనామమును స్మరింతువో యా రూపముననేనీకు సర్వశక్తుఁడయిన యీశ్వరుఁడు దర్శనమిచ్చును.

(154) నీటిగుంటకలదు- దానిలోఁబెరుగుచున్న పాచి, తుంగవలన వద్దుననున్న నీరు నీ రగుపడదు- నీరునుఁజూడవలయుననిన గుంటలోపలికిదిగి తుంగను బాచిని దొలఁ గింపవలయును- 'మాయ' నీనేత్రములఁ గప్పియున్నంతవఱకు నీవు భగవంతుఁడు లేఁడం దువు- భగవంతునిఁ జూడవలయుననిన 'మాయ' యను తెరను దొలగింపుము- నీకోరిక సి ద్ధింపగలదు-

(155) వివాదములు పెట్టుకొనకుము- నీవెట్లొక దానిని నమ్మి యొకయభిప్రాయ మును గలిగియుంటివో యితరులకుఁగూడ నంతస్వాతంత్ర్య మివ్వుము- వారినివారియిష్ట మువచ్చినట్లు తలఁచనిమ్ము- వారికి నిష్టమువచ్చిన మతమునవలంబించనిమ్ము- వట్టివాదముల వలనబరమతత్త్వుని భక్తినినీవు చెఱుపలేవు- భగవదానుగ్రహముండిన నెవరితప్పులు వారే కనుగొందురు-

(156) మలయమారుతమువీచినపుడు కర్ణికలఁగల్గిన చెట్లన్నియు గంధపుచెట్లుగ మారునందురు. కర్ణికలులేని యరటి, వెదురు మొదలగు చెట్లుమార్పుజెందకనుండును. "ష

విత్రత, మంచిగుణములు, భక్తి" వీనిగల్గినవారు భగవదనుగ్రహముకలిగినపుడు దైవత్వముఁ బొందుదురు. ప్రాపంచకకార్యాచరణపరాయణులయినవా రెప్పటివలె మార్పుబొందక నుందురు.

(157) పిల్లవాఁడు తల్లినిఁజూచి, "నాకాకలియగునపుడు నిద్రలేపవలసినద"నిచెప్పెను. అప్పుడు తల్లి 'నీయాకలియే నిన్ను లేపున'ని బదులుచెప్పెను.

(158) నేను ప్రతిదినము నాహారము సంపాదించుకొనవలసియుండ భగవంతుని నెట్లుసేవింపగలను? నీవెవరికొఱకు బనిచేయుచున్నావో వారే నీకుఁగావలసినదియిచ్చి నీ కోర్కెలఁదీర్తురు. పుట్టించినప్పుడే భగవంతుఁడు నీ కాహారము నేర్పఱచియుంచెను.

(159) నీకు నిజముగా భగవచ్చిత్రములఁగనుఁగొనుట కాసక్తియుండిన భగవంతుఁడే నీయొద్దకు సద్గురువునుబంపును. గురువునకై నీవు వెదకుకొననవసరములేదు.

(160) ఒకానొకప్పుడొకదైవభక్తుఁడు వీధిఁబోవుచు నొక పాపాత్ముని పాదమును ద్రొక్కఁదటస్థించెను. ఇతఁ డమితకోపముఁదెచ్చుకొని యాసాధువును మూర్ఛవచ్చి పడిపోవునట్లుగాఁ గొట్టెను. సాధువుయొక్క శిష్యులు తమగురువునకుఁ దిరిగి తెలివి వచ్చుట కనేకయుపాయములఁబన్నిరి కొంతకాలమయినతరువాత స్మారకము తెలిసి సాధువు కూర్చునియుండ వారిలోనొకరు, "అయ్యా! మీకిప్పుడు సేవఁజేసినదెవరనియడిగను. 'నన్ను కొట్టినవాఁడే సేవఁజేసెన'ని సాధువు బదులుచెప్పెను. సాధులకు మిత్రులని శత్రులనిలేరు.

(161) నల్లదిండ్లని, తెల్లదిండ్లని, యెఱ్ఱదిండ్లని యనేకవిధములయిన దిండ్లుకలవు. వీనియొక్క పైగుడ్డలరంగులు మారుచున్నవికాని వీనిలోఁగల దూదియంతయు నొకటేకదా. అట్లే మానవులలో నొకరు సుందరముగ నొకరునల్లగా నొకరుపచ్చగా నుందురు. ఒకరు పరిశుద్ధులై మఱియొకరు పాపులైయుందురు. అయినను నందఱిలోనుండు భగవంతుఁడొక్కఁడే.

(162) జలమంతయు నారాయణస్వరూపమని సర్వవిధములయిన జలములఁద్రాగుటకూడునా? కూడదు. ఆవిధముననే భగవంతుఁడందఱిలోనున్నప్పటికి మనుజుఁడు ప్రతియితరమనుజునిఁ బూనుకొనఁగూడదు. కొంతజలము కాళ్లుగడుగుకొనుటకుఁ బనికివచ్చి కొంత దైవకర్మలఁజేయుటకుఁ బనికివచ్చి కొంత త్రాగుటకుఁబనికివచ్చి మఱికొంత యితరులుత్రాగుటకుఁ బనికిరాకయుండును. అట్లే పలువిధములయిన స్థలములుకలవు. కొన్ని

టికిఁ దగ్గరకుఁబోవచ్చును. కొన్నిటి లోతుపాతులఁ దెలిసికొనవలయును. కొన్నిటికిఁ జెంతకుఁగూడఁబోవక దూరముగఁ దొలఁగిపోవలయును.

(163) పెద్దపులిలోఁగూడ నీశ్వరుఁడు కలఁడని మనమాజంతువును సమీపించి యెదుర్కొనలేముగదా. అట్లే యతినీచపదార్థములందుఁగూడ భగవంతుఁడున్నాఁడ వానిని మనము కోరఁగూడదు. దుష్టులసహవాసముఁ జేయవలదు.

(164) ఒకతోటవాఁడు పగలంతయుఁ దోటకునీరుఁబెట్టి యాపనిముగిసినతరువాత తోటలోఁజూడఁగా నొకనీటిబొట్టును నగుపడదయ్యె. ఎలికబొక్కలలోగుండ నీరంతయు భూమిలోపలికిఁబోయినది. భక్తునిస్థితిఁగూడనిటువంటిదియే. ప్రాపంచకసుఖములను గీర్తినిఁగోరి సర్వకాలములందు నీశ్వరునినారాధించినను మనుజుఁడు లాభమును బొందనేరఁడు. ఏలయనిన కోరికలనెరవేర్చుకొనుటలోనే కాలమంతయుఁగడచిపోవును. కనుక చిన్నతనమునందెట్లుండునో జ్ఞానమందుఁ బెద్దవాఁడయినప్పుడు నట్లేయుండును.

(165) భగవదారాధన నసహ్యించుకొని యెగతాళిసల్పువారియొద్ద నెప్పుడు భగవంతుని నారాధింపకుము.

(166) 'పాలు, నీరు' ఈరెంటినిఁగలిపినఁ జక్కఁగఁగలసిపోవును. కనుక జ్ఞానికాఁగోరువాఁడు ప్రపంచములోఁగల నందఱితోఁ గలసిమెలసితిరుగుచున్న నాయన కడివఱలోనున్న భక్తివిశ్వాసములుగూడ చచ్చిపోవును.

(167) మతభేదములఁగల్పించుట మంచిదియా? నీటిప్రవాహములో రెల్లు చెట్టు నిలిచియుండనేరదు. చలింపనినీరులోనుండఁగలదు. అట్లే భగవద్దర్శనముఁగోరువాఁడు మఱియితరవిషయములఁజూడలేఁడు. కీర్తిమర్యాదలకు నాశపడువారు మతభేదములఁగల్పించుచుందురు.

(168) 'వేదములు, తంత్రములు, పురాణములు' ఇవియన్నియు బాతపడిపోయినవి. మానవులెప్పుడు వీనిని నొకరివల్లనొకరు చెప్పుకొనుచునేయుండిరి. ఇంతవఱకు బ్రహ్మమును వర్ణించినవారెవ్వరునులేరు.

(169) సూర్యుని మేఘములు కప్పివేయుచున్నట్లు భగవంతునిమాయకప్పివేయుచున్నది. మేఘములువిడిపోయిన సూర్యుఁడగుపడురీతి 'మాయ'ను దొలఁగించిన భగవంతుని దర్శనమగును.

(170) ఒకగురువొకనాఁడు తనశిష్యుఁడున్న మఱియొకయూరికిఁబోవుచుండెను ఈయనవెంట నెవ్వరును వెళ్ళలేదు- మార్గమందున నొకమాదిగవాఁడగుపడగాగురువు, ''ఓరీ నీవు నావెంట నాకరుగవచ్చెదవా? నీకుభోజనముబెట్టించెదను- రావలసినది' యని యడిగెను- 'నేను హీనజాతివాఁడను తమరికి సేవకునిగనుండుట యెట్లు'ని మాదిగవాఁడు తిరిగియడుగ గురువు, 'అయిననుసరియే నేను మాదిగవాఁడనని యెవ్వరితోఁ జెప్పవద్దు- ఎవ్వరితోమాట్లాడకుము- ఎవ్వరితో సహవాసము జేయకుము'ని చెప్పెను- అందుల కా హీనజాతివాఁడొప్పుకొని వెంటవెళ్ళెను- అరుణోదయమువేళ గురువు భగవత్ప్రార్థన ముఁజేయుటకుఁ గూర్చుండెను- ఇంతలో నక్కడికి నింకొకబ్రాహ్మణుఁడువచ్చి యా సేవకునిఁజూచి 'ఓరీ నీవక్కడనున్న నాపాదరక్షలఁగొనిరమ్ము' అనిచెప్పగా నీతఁడుగురువాజ్ఞప్రకారము బదులుచెప్పక నూరకయుండెను- ఆబ్రాహ్మణుఁడు తర్వాత నెన్నిపర్యాయములుచెప్పినను మాట్లాడకనుండెను- అంత బ్రాహ్మణుఁడుకోపమువహించి 'ఓరీ దుర్మార్గా! నీవేల బ్రాహ్మణునిమాటవినవు? నీపేరేమి? నిజముగా నీవు మాదిగవాఁడవు కాదా?'యనిపలుక నాహీనజాతివాఁడు దీనస్వరముతో 'నయ్యా! కనుఁగొంటిరా? ఇక ముందు నిచటనిలువలేను- నన్నుపోనిండు' అనిచెప్పి పరుగెత్తిపోయెను- 'మాయ' ఈ మాదిగవానివంటిది- దానిఁగనుగొనఁగానే యది వానంతటనదియే మనయొద్దనుండి పారిపోవును

(171) 'హరి' భయంకరముగనుండునట్లు సింహపుతోలనుదాల్చుకొని తనతోఁబుట్టువాఁడుకొనుచోటికిబోయి బిగ్గరగానఱచును- ఆమెభయఁపడి పెద్దగా కేకలఁబెట్టి 'యీయాపత్తునుండితప్పించుకొనలేననితలంచి యాశవదలుకొనును- కాని హరి తన మొగముపైనున్న తోలునుదీసివేసిన నామె తక్షణము 'అన్నయ్యా! నీవేనా'యని యనును- మాయవల్ల మోహింపఁబడినవారిసంగతియు నింతయే- 'మాయ'యను తెరనుదీసివేసిన బరబ్రహ్మమిదివరలో ననుకొనుచున్నంత భయంకరముగానుండక దయామూర్తివలెనగుపడును-

(172) జీవాత్మ, పరమాత్మలనఁగానేమి? నీటిలోనొకకొయ్య నడ్డముగబెట్టుదువు అప్పుడు నీరు రెండుభాగములుగానగుపడును- అట్లే మాయవలన నాత్మ రెండుగా నగుపడినప్పటికి జీవాత్మ, పరమాత్మలొక్కటియే-

(173) ఒక పెద్ద పంచదారగుట్టకలదు- చిన్నచీమ కొద్దిపంచదారనుహరించును- పెద్దచీమ యింకకొంచెమపహరించును- ఇంతమాత్రమున నాగుట్ట యేమాత్రము తగ్గదు- భగవంతుఁడొకపెద్ద పంచదారగుట్టవంటివాఁడు- ఆయనభక్తులు చీమలవంటివారు- వీరు భగవద్గుణముకొంచెము తమకుఁగల్గినను సంతోషింతురు- ఈశ్వరగుణములన్నిటి బొందినవారెవ్వరును లేరు-

(174) కొంతమందికి గొద్దిగాఁ ద్రాగిన నేమత్తుకల్గును- కొందఱికి రెండుమూఁడు బుడ్లు ద్రాగినఁగాని మత్తుకలుగదు- ఇట్లయినను వీరిద్దఱికినుండు మత్తుసుఖ మొక్కటియే- అట్లే భగవత్ప్రభయొక్క కిరణ మొక్కటివచ్చి తాకిన సంతోషింతురు- మఱికొందఱు భగవత్సాన్నిధ్యమునకుఁ బోయినప్పుడుమాత్రము సంతోషముఁ బొందుదురు- కాని వారియిద్దఱియదృష్ట మొక్కటియే-

(175) సజ్జనసాంగత్యము బియ్యపుకుడితివంటిది- ఈకుడితి సారాయిమత్తునుబోఁగొట్టును- ప్రాపంచకవిషయాసక్తి యెక్కువయి మత్తెక్కియున్నవారు సజ్జనసాంగత్యముఁ జేసిన మత్తువదలి బాగుపడుదురు-

(176) చాలా భాగ్యవంతుఁడయిన యొకజమీందారునకొక నౌకరుకలఁడు- ఈయన గ్రామాదులకుఁ బోయి విశేషక్రూరకృత్యముఁ జేయుచుండును. జమీందారుయొద్దకుఁ బోయినపుడు ప్రజలబాధలన్నియుఁ జక్కఁగ దెలియఁజేసి యతి సాధుగుణము గనఁబఱచి యందఱికిఁబక్షపాతము లేకుండ న్యాయము జూపునట్లునటించును. అధికారికి వంగివంగి మాట్లాడును- అట్లే పవిత్రులు భక్తులునై వారిసాంగత్యమువలన దుష్టులుఁగూడ బాగుపడుదురు- దుర్జనులు సజ్జనులఁజూచి భయఁపడి గౌరవించుచు కొన్నిదినములగునప్పటికి సజ్జనులు గామారుదురు.

(177) కొయ్య తడిదియైన నగ్నిలోఁ బెట్టినపుడు తడియారి యంటుకొనిమండును- అట్లే దుష్టులయినవారిమనస్సుయందుఁగల 'కోరిక' యను తడి సజ్జనసాంగత్యమువలన నారిపోయి వివేకమనునగ్ని వారిలోపలమండును-

(178) జీవితకాలము నెట్లుగడుపవలయును? అగ్నిహోత్ర మిటునటుమండకుండునట్లు మన మెట్లు సరిచూచుచుందుమో యట్లే యప్పుడప్పుడు దుష్టులమనస్సు సజ్జనసాంగత్యమువలన పరిశుద్ధము చేయఁబడుచుండవలయును-

(179) కమ్మరివాఁడెట్లు తిత్తులలోఁగుండనూదుచు గొలిమిలోనిప్పు చల్లారిబోకుండ నిల్పుకొనునో యట్లే సజ్జనసహవాసముఁ జేయుచు మనమనస్సును పరిశుద్ధముగఁ జేసికొనుచుండవలయును-

•

(180) సమాధియందున్నవాని మనస్సెట్లుండును? కొంచెముకాలము పైకితీయఁబడి తిరిగి నీటిలోపలికి వేయఁబడిన చేపమనస్సువలెనుండును-

(181) సత్యజ్ఞానమనఁబడు వెలుతురును బొంది ప్రకాశించుమనస్సుగలవాఁడే నిజమైన మనుజుఁడు. తక్కినవారందఱు పేరునకుమాత్రము మనుష్యులు.

(182) అహంభావత్వము రెండువిధములు: 1 వివేకాహంభావత్వము. 'చూచునది వినునది, అనుకొనునది నేనుకాదు. ఈదేహము నాదికాదు. నేనుశాశ్వతుఁడను, సర్వజ్ఞుడను, స్వేచ్ఛుఁడను' అనియిట్లుతలచుట వివేకాహంభావత్వమనబడును. 2 "ఇదినాయిల్లు, నాదేహము, నాపిల్లలు, నాభార్య" అనియిట్లనుకొనుట యవివేకాహంభావత్వము.

(183) భగవంతునిఁదెలిసికొనినవాఁడొకఁడు. భగవంతునిఁబ్రేమించువాఁడొకఁడు కలసి యిద్దఱొకయడవిలోఁగుండ వెళ్ళుచున్నారు. మార్గమున నొక పెద్దపులి వారికగుపడినది. అప్పుడు జ్ఞాని 'మనము పరుగెత్తవలసినపనిలేదు. భగవంతుఁడే మనలనుగాపాడును'అనిపలికెను. ఈమాటలవిని భగవంతునిఁబ్రేమించువాఁడు 'సహోదరా! మనమిప్పుడగత్యము పరుగెత్తుకొనిపోవుదము. స్వయంకృషివలనఁ జేసికొనఁగల్గినదానికిఁగూడ భగవంతుని నేలబాధపెట్టవలయును?' అని బదులుచెప్పెను.

(184) ఈశ్వరజ్ఞానము పురుషునివంటిది. భక్తి స్త్రీవంటిది. జ్ఞానము భగవంతుని భవనముయొక్క ముంగటిగడపయొద్దకుఁగొనిపోవును. భక్తి యాభవనాంతర్భాగమునకుఁగొనిపోవును.

(185) రాంబందు లాకాశముయొక్క పైభాగమునఁ బెగురుచుండును. అయినను వానిమనస్సు భూమిమీఁదనుండు కళేబరములమీఁద నేయున్నది. అట్లే బాగుగా జదివిన విషయాసక్తులు తమచుట్టునున్న వారందఱికి మహావేదాంతములఁబోధించుచున్నను వారి బుద్ధి ప్రపంచవ్యాపారములయందువ్యాపించి యాలోచనలఁజేయుచుండును. పరుల పొగడికమాటలకు సంతోషపడుచుండును. బంగారముఁగోరుచుండును.

(186) గ్రంథములఁజదివి భగవంతునివర్ణింపఁబ్రయత్నించుట, కాసీబొమ్మనుఁజూచి కాసీనిగూర్చి చెప్పఁబ్రయత్నించుమనట్లుండును.

(187) 'స,రి,గ,మ,ప,ద,ని,స'యని నోట ననవచ్చును. కాని యావర్ణముల సంగీతవాద్యముపైఁ బలికించుట చాలాకష్టము. అట్లే మతమునుగూర్చి యుపన్యాసముల నివ్వవచ్చును. అనుభవముఁ గల్గియుండుట దుర్లభము.

(188) “ i దంతములు ii నమలుట కుపయోగించు దంతము” లను రెండువిధములయిన దంతములు గజమునకు గలవు- శ్రీకృష్ణుఁడు మొదలగువారు లోకములో మనుజులవలెఁ దిరుగుచున్నను వారిమనస్సు కర్మరాహిత్యమై వెలుఁగుచుండును.

(189) గొప్పయుపన్యాసములిచ్చి బోధింపఁగలవానికి నాత్మజ్ఞానాభివృద్ధియుండదు- అట్టివానినిఁగూర్చి మీయభిప్రాయమేమి? తనస్వాధీనములోనున్న పరులయాస్తిని గాను ఖర్చుపెట్టునట్లుండును- తనకప్పుడేమియు నష్టములేదుగనుక నితరులకు ననాయాసముగ సలహాలనివ్వవచ్చును- ఆమాటలు (అభిప్రాయములు)గూడ నితరులవికాని తన స్వంతముకావు-

(190) పేలములవేయించుటకు గుండను నిప్పుమీదఁబెట్టి గానిలోవడ్లనుబోయుదురు- వేగినగింజ యెగిరిపడుచుండును- ఏమాత్రము పచ్చియున్నను నణగిపడియుండును- అట్లేలోకమును బూర్తిగావిడచువారుందురు- వీరికేలోపమునుండదు- భూమిపైనిచ్ఛగలిగినవారందరు లోపములుకలవారే-

(191) వెన్నపూసనుదీసి మజ్జిగలోనుంచెదరు- ఉంచినట్లయిన దానిరుచి తగ్గిపోవును- కనుక దానిని నీరుగల యింకొక గిన్నెలోవేయుదురు- ప్రపంచములోనుండిజ్ఞానముఁబొందినవారు భ్రాంతిఁగలుఁగఁజేయు లోకములో నింకనుండినవారి కదివఱలో నున్న జ్ఞానముఁగూడ నశించును- కనుక బ్రపంచమును ద్యజించి బ్రతికినవాఁడు జ్ఞానాభివృద్ధిఁగాంచును-

(192) మురికిగదిలోఁగూర్చున్నపుడు నీదేహమున కేమాత్రముమురికికాకపోవునా? కాకపోదు- అట్లేదుష్టుల సహవాసముఁ జేయుచు నెంతజాగ్రత్తఁ దీసికొనుచున్నను, నెంతమతమనోనిశ్చయముఁ గల్గియున్నను నీకువారియాలవాట్లు, బుద్ధిపట్టుబడకమానవు-

(193) ఒకబ్రాహ్మణుఁ డొక సన్యాసియుఁగలసి లోకవ్యవహారములను మతవిషయములనుగూర్చి ముచ్చటించుచుండిరి- తుదకు సన్యాసిబ్రాహ్మణునిజూచి “చూచితివా ఈలోకములో నొకరినైనొక రాసించుకొనియుండఁగూడదు. అట్లుచేయుటకు వీలులేదు-”అని చెప్పెను- ఈమాటలసత్యమును బ్రాహ్మణుఁడునమ్మజాలక సన్యాసితోఁ “రాత్రింబవళ్ళు కష్టపడి దేనికై మనముపనిఁజేయుదుమో యాసంసారము నాసించుకొనియుండదగదా? నాకు కొంచెము తలనొప్పి వచ్చినప్పుడు నా తల్లి తనకదివచ్చినటుగాఁ దలంచి యెంతో పనిఁజేయును- అట్టితల్లినిఁగూడ మనమేలును గోరుదానినిగాఁ దల్చకుండుట నాకిష్టములేదు- మీరుచెప్పినమాటలయందు నాకు నమ్మకలేదు-”అని పలికెను- అప్పుడా

సన్యాసి, "నిజముగా నీతల్లియట్లుచేయునెడల నామె నీమిత్రకోటిలోనిదే- నిజమును విచారించిన నీతల్లియునట్టిదిగాదు- తల్లిగాని, భార్యగాని, పిల్లలుగాని సమయమువచ్చినపుడు వారిప్రాణముల నిచ్చెదరనుమాట యసత్యము- అదికలలోవార్త- దీని నిజమును నీ వనుభవించి చూడవచ్చును- ఇంటికివెళ్ళి యేదియోబాధ గల్గినట్లు నటించియేడ్వుము- అప్పుడు నేనువచ్చి యొకచిత్రముఁజేసెదను" అనిచెప్పి బ్రాహ్మణునినింటికిఁ బంపెను- ఈతఁడువచ్చి సన్యాసిబోధించినరీతి నాచరించెను- వైద్యులువచ్చినలాభములేకపోయెను- ఈయన(బ్రాహ్మణుని)తల్లి యేడ్చుచున్నది- దారాపుత్రులు ఘొల్లున ఘోషిల్లుచుండిరి- ఇంతలో మనసన్యాసి యటకరిగినాఁడు-

ఈతఁడు, "ఈరోగము మానునదికాదు- ఎవ్వరయిన వారిప్రాణముల నిచ్చువారున్న నీయనబ్రతుకవచ్చును-" అనిపలికెను- ఈమాటలువిని యందఱిమొగములు తెల్లవోయినవి- అంతటనాసన్యాసి ముసలిదియైన బ్రాహ్మణునితల్లినిజూచి, "అమ్మా! నీకీముసలితనమునందు బడుచువాఁడయిన నీకొడుకుబోయిన నీవు బ్రతికియుండినను జచ్చినను నొక్కటియే- కనుక నీప్రాణములనిప్పుడివ్వవలసినది- నీ కుమారుఁడుఁ బ్రతుకును- తల్లివైన నీవే యీయుపకారము జేయుటకు వెనుకకుదగ్గిన మఱియెవ్వరిచ్చెద'రని యనెను- ఆమెయేడ్చుచు- "అయ్యా! నీవేమిచెప్పిననుఁ జేయుటకు సిద్ధముగనున్నాను. కానియొక్క సంగతి—నాప్రాణము, నాప్రాణము- అమ్మా, నాకొడుకు ప్రాణమును నాప్రాణముతోఁజూచిన నెటువంటిది యెంతగొప్పది- నేను చచ్చిపోయిన నీచిన్నవారేమగుదురని తలఁచిన నాకుగడుభయము కల్గుచున్నది- ధైర్యము తప్పిపోవుచున్నది- నాదురదృష్టమువలన వీరందఱు నున్నారుగదా" యని బదులుపలికెను.

ఇట్లు సన్యాసికి బ్రాహ్మణునితల్లికి వాదము జరుగుచుండ బ్రాహ్మణునిభార్య తన తలిదండ్రులజూచి, "మీకొఱకు నేను ప్రాణములివ్వలేను" అనియేడ్చుచుండెను- ఇంతలోసన్యాసి యామెవంకకు దిరిగి, "నీభర్తగదా. వారికొఱకు నీవేమయిన నీ ప్రాణము నిత్తువా?" యనియడుగ నామె, "నేనేనా, దురదృష్టురాలను, నాకు విధవరికము వచ్చినను సరియే. బిడ్డపోయిన దుఃఖము నా తలిదండ్రులకు నేను కలుఁగఁజేయను" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఈవిధమున బ్రతివారును వెనుకకుదీసిరి. అప్పుడా సన్యాసి, 'ఎవ్వరును బ్రాణము నివ్వలేరట. ఇతరులపై నాసించుకొనియుండుటకు వీలులేదనుమాట సత్యమిప్పుడైనను దెలిసికొంటివా?' యని బ్రాహ్మణునితోఁజెప్పగ నీతఁడు తెల్విఁదెచ్చుకొని సంసారముఁ ద్యజించి సన్యాసివెంటవెళ్ళి బాగుపడెను.

(194) మనస్సునందు దుష్టబుద్ధుల నుంచుకొనుట యగ్రజాతి బ్రాహ్మణుఁడు వెళ్ళి మాలవానియింటిలో నివసించినట్లుండును. ధనముఁగలిగి పెద్దమనిషియైనవాఁడు పెద్దపట్టణమునందు వెనుకప్రక్క నొక చిన్నసందులో నివసించినట్లుండును.

(195) నీరు రాతిలోపలికిఁ బోలేనిరీతి నీశ్వరజ్ఞానమునుగూర్చి యివ్వబడిన సలహో బద్ధజీవున కంటుకొనదు.

(196) గోరును భూమిలోపలికి గ్రుచ్చవచ్చునుగాని రాతిలోపలికి గ్రుచ్చలేము. అట్లే సజ్జనులమాటలు నమ్మకస్థులకుఁ జెవిదూరునుగాని నమ్మకములేనివారికిఁ జెవిదూరవు.

(197) బురదమట్టిపై నడుగులు పడునుగాని రాతిపై నడుగులు పడనేరవు. అట్లే భక్తునిమనస్సు భగవంతుని జ్ఞానమును గ్రహించునుకాని బద్ధమనస్సు గ్రహింపనేరదు.

(198) పిల్లలకు సంసారసుఖము తెలియనట్లు ప్రపంచకవిషయాసక్తులకు నీశ్వర సంయోగమనిన నర్థముకాదు-

(199) మురికిగానున్న యద్దములో బ్రతిరూపమగుపడునా? అగుపడదు. అవ్విధమున నపరిశుద్ధాత్మునకు నీశ్వరుఁడగుపడఁడు. నిర్మలమయిన దర్పణమెట్లు ప్రతిబింబమగుపఱచునోయట్లు పరిశుద్ధాత్మయందు భగవంతుఁడు కనఁబడును.

(200) ఒకమరదిండుకలదు- దానిపై గూర్చున్నపుడు తగ్గి తిరిగిలేచినపుడు యథారూపమును వహించును. విషయాసక్తులయినవారి మనస్సుఁగూడ నటువంటిదియే- మతబోధలు చెవినిఁబడుచున్నంతవఱకు మంచితలఁపులు కలుగుచుండును- కానిలోకవ్యవహారమును జక్కఁబఱచుకొనుచున్నపుడు భగవంతుని మఱచిపోయి యపరిశుద్ధతలఁపులు తలఁచెదరు-

(201) ప్రపంచముఁ గోరువారిని సులభముగఁ గనుఁగొనవచ్చును- అట్టివారు భగవత్ప్రార్థనల సల్పునపుడు తాముఁగూడ సలుపరు- ఈశ్వరకీర్తనలకుఁ జెవియొగ్గరు- భగవన్నామమును స్మరింపరు- వీలుగానున్నఁ జేయువారినిగూడ నడ్డగించెదరు- మతావలంబులఁ దిట్టుచుందురు- ఇటువంటివారు ప్రపంచకలోలులుగాక మఱియెవరు.

(202) మొసలివీపు చాలాదట్టముగనుండును. బాణమువేసినను దానిలోఁ బ్రవేశింపదు- అట్లే ప్రపంచప్రియునకు మతమును బోధింపవచ్చుగాని యెంతఁజెప్పినను వారిమనమున కెక్కదు.

(203) పాపాత్ముని మనస్సు యంగారములు చుట్టుకొనిన జుట్టువంటిది- దీనినెన్నిపర్యాయములు తిన్నగఁదీసినను సరిగానుండదు- ఇట్లుచేయుటకు నీవుచేయు కృషి యంతయు నిష్ఫలమగును- అట్లే దుష్టుని మనస్సును సరిఁజేయుట దుర్లభము,

(204) విశేషదూరములోనున్న యొకపట్టణమునకుఁ జేపలనమ్ముకొనుటకుబోయికొంత మందియాడవాండ్రు తిరిగివచ్చుచుండిరి- వీరికిమార్గమునఁబెద్దవాన కొట్టుటతటస్థించుటవలనఁదమయూరికిఁ జేరలేకదగ్గరలోనున్న యొక పువ్వులమ్ముకొనువాని యింటికి నారాత్రి పరుండుటకు వెళ్ళిరి- దయాపరుఁడై యాతఁడు తనయింటికివచ్చినవారికి నొకగదిఁజూపించి పరుండుడనియెను- తెల్లవారిన తరువాతనమ్ముకొనుటకు నూతనపుష్పములఁదెచ్చియాగృహాధికారి యాగదిలోనుంచెను- ఇందువలన గదియంతయు ఘుమఘుమ వాసనగొట్టుచుండెను- అక్కడఁబరుండవలసిన యా స్త్రీలకు బూలవాసన నసహ్యముగాఁ దోచెను- కంటికెప్పను వాల్చినవారులేరు- ఇట్లుండ వారిలోనొకరు, ''అమ్మలారా! ఈ పాడు పూలు మననిద్రను భంగపఱచుచున్నవి- కనుక మనతట్టలను (చేపల తట్టలను) ముక్కులయొద్దఁ బెట్టుకొనెదము- అప్పుడావాసనపోవును-, మనకు నిద్రపట్టును'' అని యుపాయముఁజెప్పిరి- అప్పుడు తక్కుఁగలవారందఱుఁ గడుసంతోషించి యట్లఁజేసి గుఱకలుబెట్టుచు నిద్రవోయిరి- దుర్గుణములు దుష్టులకుండి వారికిఁజేయు హానినిదలఁచుకొనినఁజాల కష్టముగ నుండును-

(205) ఒకమానవుఁడొకప్పుడు, ''నాపుత్రుఁడయిన హరి పెరిగినతరువాత వానికిఁ బెండ్లిజేసి నేను వానికి సంసారము నప్పగించి లోకమును విడిచివేసి యోగము నభ్యసించెదను'' అని భగవానునితోఁ జెప్పెను- ఈమాటలవిని యాతఁడు, ''నీకెప్పుడును భగవంతునిఁ బ్రార్థించుటకు సమయముదొరకదు- హరిగిరివాడు చాలాయఁటుకొని వదలక మన్నాఁడనియు, నేనీలోకమును విడిచిపోయిన తర్వాత నాసాంగత్యమువారికి నుండదనియు, నాకు మనమఁడుపుట్టి యాతనికి పెండ్లికావలయుననియు నప్పుడు పలికెదవు. ఈ కోరికలకంత ముండదు'' అని బదులుచెప్పెను-

(206) పావురముగూటిలో, నేరుకొనఁబడిన వడ్లగింజలు నిండియున్నట్లు విషయానక్తునితో మాట్లాడునపుడు వానికిఁ గోరికలు, దుష్టతలంపు లున్నట్లు తేటతెల్లమగును.

(207) తుపానుకొట్టుచున్నపుడేది యశ్వత్థవృక్షమో యేదివటవృక్షమో తెలిసికొనుట కష్టము- అట్లేనిజమైన జ్ఞానమనఁబడు తుపానుకొట్టునపుడు మనుజులందు మతభేదములు కనఁబడవు-

(208) కాల్చనికుండ పగిలిపోయినఁ గుమ్మరివాఁడు దాని చెక్కలను మఱియొక దానిని జేయుట కుపయోగించును- కాని కాల్చినకుండ పగిలిపోయినదాని చెక్కలెందు కుఁ బనికిరావు- అజ్ఞానదశలోనుండి చనిపోయినఁ దిరిగిపుట్టును- జ్ఞానియై ముక్తిఁబొందిన పుడు తిరిగిపుట్టడు-

(209) ఉడికినవడ్లు మొక్కలు మొలువవు- పట్టివడ్లే విత్తనములకుఁ బనికివచ్చును- అట్లేజ్ఞానియై ముక్తినిబొందినవాఁడు తిరిగి జన్మమెత్త నవసరములేదు. అట్టి పూర్ణజ్ఞాన ముఁ బొందనివాఁడు సిద్ధుఁడయ్యేటంతవఱకుఁ బుట్టుచుఁజచ్చుచునే యుండవలయును-

(210) పిల్లవాని ప్రేమ పూర్ణమయినది- భాగింపఁబడియుండలేదు- పెండ్లియయి నపుడు సగమైనను భార్యకుఁ బంచిపెట్టఁబడును- పిల్లలుపుట్టిన తరువాత మిగిలిన సగము ప్రేమలో సగభాగము పిల్లలకుఁ బంచిపెట్టఁబడును- తక్కినపావు తలిదండ్రులకు, మర్యా దకు, గీర్తికి, గర్వమునకు, దుస్తులకు నివ్వఁబడును- ఇఁక భగవంతుని కిచ్చుటకెక్కడ గలదు? లేదు- కనుక బిల్లవాఁడయి యుండఁగనే భగవంతునిఁ బ్రేమించినఁ ద్వరలో దేవుఁ డు దర్శనమిచ్చును- వయస్సునందుఁ బెద్దలయినవారికి భగవద్దర్శనము కలుగుట దుర్లభము.

(211) చిలుకకు మాటలఁ జిన్నప్పుడే నేర్పవలయును- పెద్దదైన తరువాత దా నికి మాటలు రావు- కనుక మనుజులకుఁగూడ వయోవృద్ధులైన తర్వాత నీశ్వరునిపై మన స్సు నిల్పుట దుర్లభము- చిన్నతనమునం దిట్లు చేయుట కడుసులభము-

(212) వెదురుకఱ్ఱను లేలికగా వంచవచ్చును- అది పెద్దదయి వాసమయిన తరు వాత నెంత ప్రయత్నముఁ జేసినను వంకర బలవంతముమీద వంగి విరిగిపోవును- అట్లే పసి వాని మనస్సు ననాయాసముగ భగవంతునిపైఁ ద్రిప్పవచ్చును- కాని యజ్ఞానియైన ము సలివానికి నిది నేర్పఁబోయిన నసలుకే మోసమువచ్చును- ఏమాత్రము వీలుపడదు-

(213) రెండువంతుల నీళ్ళతోఁ గలిపిన యొకవంతు పాలుగడ్డకట్టిన పాలుగామా రుటకుఁ జాలాకాలము పట్టును. అట్లే విషయాసక్తుఁడైన మానవుని హృదయమునం దుం డు దుష్టతలంపులఁ దొలఁగించి పరిశుద్ధముఁ జేసి సారవంతముగఁ జేయుట కడుకష్టసాధ్య మైన కార్యము.

(214) అందఱు భగవంతునిఁ జూడఁగలరా? ఎవ్వరు నుపవాసముఁ జేయలేరు. క నుకఁ గొందఱు పగలు తొమ్మిదిఘంటలకు భోజనముఁ జేయుదురు. కొందఱు పండ్రెండు ఘంటలకుఁ గొందఱు సాయంత్రము రెండుఘంటలకు భుజింతురు- అందఱు నొక్కప

ర్యాయమైనను గాకపోయినను నీ జన్మయందయినను గాకపోయినను భగవంతుని నెప్పుడోయొకప్పుడు చూడగలుగుదురు- చూచితీరుదురు-

(215) ఆనందబాష్పములు, కన్నీరు' ఈరెండును నేత్రముల నుండియే కారును. కాని కన్నీరుకొలుకులనుండి కారును. ఆనందబాష్పములు నేత్రాగ్రములనుండికారును.

(216) ప్రేతభూములందు శవములు శాంతముగఁ బడియుండ రాబందులు మొదలగు పక్షులు నక్కలు మొదలగు మృగములు పిలువనిపేరంటముగఁ దశ్శవముల భక్షించుటకు వచ్చుచుండును.

(217) అగ్నిఁజేసినపుడు చుట్టుప్రక్కలనుండు దోమలన్నియువచ్చి దానిలోఁబడి మృతినొందుచుండును. అగ్ని వెళ్ళి దోమలఁ బిలుచుటలేదు. అట్లేపూర్ణులైనజ్ఞానుల బోధగూడనుండును. తత్వమును బోధించుటకై వీరు పరులయొద్దకుబోవరు. కాని నలుదిశల నుండి జ్ఞానబోధ నాశించివందలకు వందలు జనులు వచ్చెదరు.

(218) మిఠాయి, పంచదారలున్న స్థలములకుఁ జీమలు వాటియంతట నవియే వచ్చుచుండును- కనుక నీవు పంచదారవగుటకుఁ బ్రయత్నింపుము. అప్పుడు చీమలునీవు పిలువనక్కఱలేకనే నీయొద్దకు వచ్చును.

(219) మనుష్యులు మేలుకొనియున్న యింటిలో దొంగలు ప్రవేశింపఁజాలరు. ఆవిధముననే నీవుజాగ్రత్తగానుండినయెడల దుష్టతలంపు లేవియు నీ మనస్సునందుఁ జొచ్చి నీ మంచితనమునుఁ జెడగొట్టవు-

పక్షియెగిరిపోయిన పంజరమునకు, ప్రాణముపోయిన శరీరమునకు నెవ్వరు లక్ష్యముఁజేయరు.

(221) చమురులేక దీపము వెలుఁగనట్లు భగవంతుని సహాయములేక నెవ్వరు సజ్జీవితమును జీవింపనేరరు.

వేటాడబడిన మర్కటమెట్లు వేటకానిదగ్గిర ప్రాణములవిడుచునో యట్లు మనుజులు శృంగారముఁజూచిన ప్రాణముల విడిచెదరు.

(223) దుష్టవర్తనముగల్గిన స్త్రీ యొకపరిశుద్ధ హృదయునకుఁ దన దుష్టత్వము నేర్పుటకుఁ బ్రయత్నించిననేమియగును? చక్కఁగఁబండిన మామిడిపండును వత్తినటెంక,

గుజ్జుతప్పించుకొనిపోయి తోలుమనచేతిలోఁ జిక్కును. అట్లే పవిత్రుని మనస్సు భగవత్సాన్నిధ్యమునకుఁబోయి దేహము మాత్రమీస్త్రీయొద్దనుండును.

(224) ధనమువలన రొట్టెయు వెన్నయు వచ్చును- ఇది కలిగినంతమాత్రమున నెత్తురుఁ గండయు నేర్పడునా? ఏర్పడదు- కనుక నా ధనమును సంపాదించుకొనుటయే జీవితముయొక్క ముఖ్యపని యని తలంపకుము.

(225) వాయుదేవుఁడు గంధపుతావు వాసనను శవముల దుర్వాసనను నొక్క పర్యాయమే తీసికొనిపోవును- కాని యాతఁడు వానికినంటుకొనఁడు- అట్లేజీవన్ముక్తుఁడు లోకములోఁ దిరుగుచున్నను విషయములందు మనస్సుఁ జొరనీయఁడు.

(226) సూదిరంధ్రమునందు దారము నెక్కించవలయునని దారపుకొనను సన్నముగఁజేసి పొడుచుకొనియుండు చిన్నపీచులను దీసివేయుము- అప్పుడనాయాసముగ దారము సూదిరంధ్రమునం దెక్కును- ఇక్కరణి నీవు భగవంతునియందు మనస్సు నిలుపవలయునని శాంతి, గర్వహీనత్వము, అణకువ గల్గియుండి కోరికలఁజంపివేయుము.

(227) ఒకమార్గమునం దొకపాముండెక్క కలదు- పాము కఱచునేమోయని భయపడి యెవ్వరు నాత్రోవను వెళ్ళరు. మహాత్ముఁడొకఁ డాదారిఁబోవుచుండ నాదుష్టసర్పము వానినిఁ గఱచుటకుఁ దరుముకొనివచ్చెను- కాని వానియొద్దకు వచ్చినపుడు దానికి దాని క్రూరత్వముపోయి సాధుత్వము పట్టుబడెను- అప్పుడా మహాత్ముఁడు "నన్ను కఱచుటకుఁ దలచివచ్చితివా?"యని యడుగ సిగ్గుపడి సర్పమేమియుఁ బదులుఁజెప్పకఁబోయెను- అంత నిఁకముందెప్పు డెవ్వరినిఁ గఱచుటకు బోవకుమని చెప్పి మహాత్ముఁడు వెళ్ళిపోయెను- అప్పటినుండి పామా మాటలజ్ఞప్తియం దుంచుకొని యెవ్వరికి హానిఁ జేయక నుండె. పామునకు విషముపోయినదని తలఁచి యందఱు దానిచెంతకుఁజని యిష్టమువచ్చినట్లు హానిఁజేయసాగిరి. కొందఱు తోకనుబట్టి జరజరలాగిరి. కొందఱుకొట్టిరి. ఇట్లు చేయఁబడిన పాము బాధల కంతములేకయుండె. ఇంతలోఁ దిరిగి యా మహాత్ముఁడు తన్మార్గమునఁబోవ దటస్థించి చిక్కియున్న యాపామునుజూచి, "ఇట్లు చిక్కిపోతివి. కారణమేమి?" యని యడుగ నా పాము, "మీమాటప్రకారము నేనొరుల కిప్పుడు హానిఁజేయుటలేదు. కాని వారునాయందుఁ గరుణా విహీనులై వర్తించుచున్నార'ని బదులుఁజెప్పెను- ఈ పలుకులవిని మందస్మిత వదనారవిందుడై యామహాత్ముఁడు, "ఎవ్వరిఁ గఱవవద్దంటిని గాని భయఁపెట్టవద్దంటినా? కరివకఁబోయినను బుసపెట్టుచు నీచెంతకు నితరులు రాకుండునట్లు భియపెట్టుచుండవలయును. అట్లే నీవీలోకములోనుండునం

తనలకు నితరులు నీకు భయపడి గౌరవించునట్లు చేయుము- పరులకు హానిఁదలంచకఁ బ
రులవల్ల హానిఁ బొందకుము-

(228) పండ్లతోనిండియుండి వంగియున్న చెట్టువలెను గొప్పవాఁడవు కావలయు
ననుకొనిన నీవు శాంతిఁగలిగి యణగియుండుము.

(229) త్రాసుయొక్క రెండుపళ్ళెములలో బరువైనది వాలిపోవును. తేలికయై
నది పైకిలేచిపోవును. అట్లే సామర్థ్యమును సుగుణములనుగలవాఁడు సర్వకాలసర్వావస్థ
లందు నణగియుండును. కాని మూఢులయినవారు గర్వితులై విఱ్ఱవీగుచుందురు.

(230) మహాఋషులు భగవంతుని బంధుకోటిలోఁజేరినవారగుదురు. వారు దే
వునిఁదమమిత్రునిగను సహవాసిగను నెత్తురుస్పర్శగలిగినచుట్టముగ నెంచుకొనెదరు. ఇఁ
క సామాన్యులు భగవంతునిచేత సృష్టింపఁబడి యాతననుసరించి దూరముగనుందురు.

(231) ప్రపంచములోనుండి ముక్తికై పాటుపడువారు కోటలోనుండి యుద్ధము
చేయువారివంటివారు. ఇఁకసన్యాసులు బహిరంగముగఁ బోట్లాడవచ్చినవారివంటివారు.
బహిరంగముగఁబోట్లాడుటకంటెఁ గోటలోపలనుండిపోరుట యెక్కువ భద్రకరముగదా

(232) 'ఓజగన్మాతా! నీయందు నాకపారమైన భక్తిప్రేమలుకలుగునట్లనుగ్ర
హింపుము' అని జగన్మాతనుగూర్చి ప్రార్థింపుము.

(233) విశేషముపాము లోకయింటిలోనుండును. అప్పుడాయింటివారు కడు
జాగ్రత్తగనుందురుగదా. అట్లే కామలోభాదులను పాములు పట్టిబాధింపకుండ లోపలితి
జాగ్రత్తగానుండవలయును

(234) నీళ్ళకుండకడుగునఁ జిన్నరంధ్రముండినను దానిలోనీరంతయుఁ గారిపోవు
ను. అవ్విధమున నేమాత్రము విషయాసక్తియుండియుండినను సన్యాసియైనగూడ మానవు
ఁడు చేయుకృషి వృథాయగును.

(235) భగవంతుఁడు 'పామునై నేనుకరతును వైద్యుఁడనై నేనే తద్విషము
నకు మందువేయుదును. అట్లే నిందింమయధికారిని నేనే. శిక్షఁబొందుసేవకుఁడను నేనేయై
యున్నాను' అని చెప్పెను.

(236) భగవంతుఁడు దొంగవానిని దొంగతనముఁజేయుటకుబంపును- ఆ భగవం

తుఁడే 'దొంగలువచ్చెదరేమో మేలుకొనియుండు'మని యింటివారికి నూహపుట్టునట్లు చేయును. ఆయన సకలపనులను జేయఁగలఁడు.

(237) దేవునికొఱకై తమగురువులనుగూడఁ దిరస్కరించినవారు కొందఱుకలరు 'భరతుఁడు, ప్రహ్లాదుఁడు, శుకదేవుఁడు, విభీషణుఁడు, పరశురాముఁడు, బలి, గోపికలు' వీరటువంటివారే.

(238) నాటకశాలయందొకఁడనేకవేషములు వేయునట్లు భగవంతుఁడీలోకమునందనేకరూపములవహించెను. ఒకవస్తువనేకమందిధరించుటకు వీలున్నట్లు పలుమృగములు మనుజాలకలెఁగనఁబడినను బలురూపములధరించియున్నవి. కొన్నిటికిఁదోడేలురూపము, కొన్నిటికి నక్కరూపము, కొన్నిటికి నెలుగుగొడ్డురూపముఁగలదు.

(239) సన్యాసియనుటకు నర్హుడైనవాఁడెవఁడు? వస్తులనుగూర్చి యాహారమును గూర్చి యేమాత్రమాలోచనఁజేయక ప్రపంచమునువిడుచువారందఱు సన్యాసులనుటకు నర్హులు. చెట్టుకొనకునెక్కి యక్కడనుండి ప్రాణభయములేక దుముకువారివంటివారు సన్యాసులనుటకు నర్హులయినవారు.

(240) పాము విషజంతువై కఱచునప్పటికి పాముమంత్రగాఁడు దానిఁబట్టుకొని యేభయములేక మెడయందు బంగారుహారమువలెఁ దాల్చును. అట్లే జ్ఞానులయినవారు కామలోభములనఁబడు విషము చేఁదగిలి బాధనొందరు.

(241) శాంతస్వభావమును సుగుణములనుగలిగి జీవయాత్రఁజేయుచుఁ బరులపొగడికలకు, నిందలకు లక్ష్యముఁజేయకుము.

(242) వరిగంటిరాయిపైరాచి బంగారమేదియో రాగియేదియో కనుగొనవచ్చునుగదా. అట్లే సాధులను, కపటసాధులను 'నింద, హింస'లనఁబడువరిగంటిగ నుపయోగించి కనుఁగొనవచ్చును.

(243) లోకమునందుండినను లోకవ్యవహారాసక్తుఁడవుకాకుము. కప్పను పాము చెంతనాడనిమ్ము. కాని పాము దానిని మ్రింగకుండఁజూడుము.

(244) పరిశుద్ధాత్ముఁడు కొమ్మలుగల దీపస్తంభముయొక్క త్రిపార్శ్వములలోఁ జూచిచూచి తుదకునవ్వును. ఏలయనిన త్రిపార్శ్వములలో వర్ణములన్నియునగుపడినవి

యన్నియు నిజమైన రంగులుకావనియుఁ బ్రపంచకముగూడ నిట్టిదియేయనియు నాతఁడు తెలిసికొనును.

(245) ఒకరు 'ప్రకృతికి మార్పులే'దనిరి. మఱియొకరు 'బొగ్గులో నగ్నియున్నపుడు బొగ్గుయొక్క యసితవర్ణమునశించిపోవు'నని నుడివిరి. అప్పుడు భగవాన్ "మనస్సు వివేకాగ్నివలన దహింపఁబడినప్పుడు దాని నైజస్వభావమునశించును. అప్పటినుండి యది భ్రాంతికిఁగారణముకాదు."

(246) తెల్లఉల్లిగడ్డరసమునుంచినగిన్నె నెన్ని పర్యాయములుతోమినను వాసన పూర్ణముగఁబోదు. అట్లే యెంతకృషిసల్పినను నహంభావత్వము పూర్తిగా నశింపదు.

(247) విషయాసక్తుఁడైనవాఁడు తేలికగా ధనమును గాంతనుద్యజించి భగవంతుని బ్రార్థింపలేడు. ఎన్నికష్టము లెన్ని దుఃఖములుకలిగినప్పటికి జ్ఞానము దెచ్చుకొనఁడు.

(248) మనస్సునకు నిశ్చలతయుండునంతవఱకు సద్గురువున్నను, సజ్జనసాంగత్యమున్నను లాభముండనేరదు.

(249) 'అష్టకష్ట'మనబడునాటలో గింజలు మధ్యస్థానమునకుఁ జేరుటకుఁబూర్వము చదరములన్నిటిలోఁ దిరిగి రావలయును. గింజమధ్యస్థానమునుఁ జేరనంతవఱకుఁ దనయథాస్థానమునకువచ్చును. తిరిగితిరిగి తిరుగుచుండును. కాని రెండుగింజలుకలిసి యొక్కచదరమునుండి మఱియొకచదరమునకుఁగదలుచుండిన వానినింకొకగింజవెంబడించి వెనుకకుఁ ద్రిప్పలేదు. అట్లే మానవులు గురువును నిష్ఠదైవమునునుంచుకొని భగవధ్యానాదుల నభ్యసించిన నేవిధమయినకష్టములను దిరుగుబాట్లనుబొందరు. వారికిఁగల్గుయభివృద్ధికి నడ్డను మాటయుండదు.

(250) అహంభావత్వముఁబోగొట్టుకొనుటయెట్లు? సంతతాభ్యాసమువలనఁబోగొట్టుకొనవచ్చును. వడ్లను బియ్యముగాఁజేయవలెననుకొనుడి. ముందు వడ్లనుదంపి ముడిబియ్యమునుజేయవలయును. తరువాత బియ్యము చక్కఁగఁబోటుపడుటకు సెగత్రోయుచు నప్పుడప్పుడు బియ్యము బాగుగామెదిగినదిలేనిది చూచుచుదంపవలయును. అట్లే మానవుఁడు తనకుఁగల విషయాసక్తి కామము, లోభము మొదలగునవియన్నియు నశించినవా లేక యుండినవాయని యప్పుడప్పుడు పరీక్షఁజేసుకొనుచుండవలయును. తనకుఁగల యాత్మప్రేమ నిర్ధారణయగుటకు దూషించుకొనవలయును. 'ఈదేహమేమిటి? తోలుతోఁగప్పఁబడిన యెముకలపుట్ట యీదేహము. దీనిలోనేమికలదు? నెత్తురు, కండ, పై

త్యరసము మొదలగునవికలవు- ఈపాడుదేహమునుజూచి నేనేలగర్వపడవలయును? ఎప్పటికి నీదేహమునుజూచిగాని తత్సంబంధములఁజూచిగాని మనముగర్వించఁదగదు' ఇట్టి యాలోచనవలన నహంభావత్వము చీల్చివేయఁబడును-

(251) ఏమతమునందుగాని, యేతెగయందుగాని స్వపక్షాభిమానముండఁగూడదని భగవానునియభిప్రాయము- ప్రతిమతస్థుఁడుఁ దనమతమునందు గట్టినమ్మకఁగలిగి కృషిఁజేయవలయును- దృఢనమ్మకయుండవలయునేకాని 'పరమతదూషణ, స్వపక్షమందలి దురభిమానము' యివి యుండఁగూడదని భగవాన్ యప్పుడప్పుడు చెప్పుచుండెడివాఁడు-

252) రాస్మణిరాణికట్టించిన కాళీదేవాలయమునకు నొకప్పు డొకసాధువు వచ్చెను- ఆదినమున నాయనకు నన్నమెవ్వరునుబెట్టలేదు- కావుననాయన చాలాయాకలిఁగొనియున్నాఁడు. కాని యెవ్వరినేమియునడుగలేదు- ఇంతలోఁబారవేయఁబడిన యొక విస్తరంటనాకుచున్న యొకకుక్క దృగ్గోచరమయ్యెను- సాధువు దానియొద్దకునేగి దానినిఁగౌఁగలించుకొని 'సహోదరా! నాకుఁగూడ నొకభాగముపెట్టక నచ్చగా నీవేతినఁదలఁచితివేమి'యనినుడువుచుదానితోఁగూడఁ దానుఁదినసాఁగెను- కావలసినదితిని యాసాధువు గుడిలోపలికివచ్చి కాళిని మహాసక్తితో స్తోత్రముఁజేయఁదొడఁగె- ఇది ముగిసిన తరువాత వెళ్ళిపోవుచుండెను- ఆగుడిలో నదివఱలోనున్న భగవాన్ యీసంగతియంతయుఁగనిపెట్టి తనమేనల్లుఁడయిన హ్రిదాయిముఖర్జీనిఁబిల్చి 'నీవీసాధువువెంటనరిగి యాతఁడుపల్కుమాటల నాతోవచ్చిచెప్పుము' అనిచెప్పెను- మేనమామయాజ్ఞనుశిరసావహించి యాయనవెంటవెళ్ళెను- కొంతకాలమునకు సాధువు వెనుకకుఁదిరిగి నీవేలనావెంట వచ్చుచున్నావనియడుగ నప్పుడు ముఖర్జీ 'నాకేదైన దయచేసిచెప్పవలసినది'యని విన్నపించిన సాధువు 'ఈముఱికిగుంటలోనీరు గంగానదినిర్మలోదకము నీకంటికి నొకటిగానగుపడినపుడు, నీపిల్లనగ్రోవిశబ్దము తత్సమూహమునుండి వచ్చుచున్నశబ్ద మొకటిగా నీకువినబడినప్పుడు నీవు నిజమైనజ్ఞానివగుదువ'ని బదులుఁజెప్పెను- ముఖర్జీచెప్ప, నీమాటలువిని భగవాన్ 'అతఁడు మహాజ్ఞాని- నిత్యానందమునునుభవించువాఁడు- పిల్లవానివలెనైన, పిచ్చివారివలెనైన, మురికివారివలెనైన మఱి యనేకరూపములతోనైన జ్ఞానులు తిరుగుచుందురు-

(253) విగ్రహముల భగవంతునిరూపములుగఁ దలఁచువారుభగవంతునిఁజేరుదురు- వానిని మట్టి, రాయి యనుకొనువారెట్లు వానినిఁబూజఁజేసిన నేమియుఁలాభముండదు-

254) తార్కికుఁడొకఁడు భగవానునిఁజూచి 'జ్ఞానమననేమి? తెలుసుకొనువాఁడెవఁడు? తెలియఁబడునదియేది?' యనియడిగెను- ఈప్రశ్నలకు భగవాన్ 'నేను చదువు

కోనినవాఁడనుగాను- మీరడుగుమాటలన్నియు నాకుఁ దెలియవు- నేను నాయాత్మను జగన్మాతనుమాత్రమే యెఱుఁగుదును-

(255) భగవంతుఁడు, ఆయనమాటలు, ఆయనభక్తులు' వీరందఱొక్కటేగాని వేఱుకాదు-

(256) మనుజులు భూములను బంచిపెట్టనేర్తురుకాని యాకాశమును బంచలేరు- ఇట్టియాకాశము సకలవస్తువులనుజుట్టుకొని సర్వముఁగప్పుకొనియున్నది- అట్లే యజ్ఞానియైనవాఁడు మతవాదములవిడిచి యొక్కటియై శాశ్వతమైనదై యభేద్యమయినమతమును గోరును-

(257) 'రాముఁడు, సీత, లక్ష్మణుఁడు' వీరడవికివెళ్ళినపుడు రాముఁడు ముందు, సీత మధ్య, లక్ష్మణుఁడు వెనుకనుండెను- లక్ష్మణునికెప్పుడు రామునిమొగముఁ జూడవలయుననికోరిక- ఇట్లుచేయుటకు సీత నడుమ నడ్డముగనున్నది- కనుక నీమెను లక్ష్మణుఁడు కొంచెము ప్రక్కకుఁదొలఁగియుండునట్లు ప్రార్థించెను- సీతతొలఁగియున్నది- లక్ష్మణుఁడు రామునిమొగంబుఁజూడఁగలిగెను- అట్లే ప్రపంచములోఁ 'బరబ్రహ్మము, మాయ, జీవుఁడు' యివియాక్రమమున నేయున్నవి- పరబ్రహ్మము ముందు- మాయనడుమ జీవుఁడు వెనుకనుండును- మాయతొలఁగినఁగాని జీవుఁడు పరబ్రహ్మముఁ జూడఁజాలఁడు-

(258) ఒకమట్టికుండలోనీరుపోసి యెండలోఁబెట్టుము- నీరంతయునిగిరిపోవును. ఎండలోఁబెట్టక నీటిలోఁబెట్టుము నీరేమియుఁగదలక యెప్పటిరీతినుండును- భగవంతునియందు నీకుఁగల్గుప్రేమయు నట్టిదే- కొంతకాలమతిభక్తి ప్రేమలఁగలిగి భగవంతునిఁబ్రార్థనఁజేసి తరువాతఁ గొన్నిదినములూరకయుండుము- అప్పుడు నీభక్తిపాడగును- ప్రేమనశించును- అట్లుగాక సర్వకాలములందు భక్తిప్రేమలనుగలిగి యీశ్వరునియందు మనస్సునిల్పుము- అప్పుడవినశింపవు-

(259) యోగాభ్యాసముఁజేయుటకుఁ గూర్చున్నపుడు మనస్సువశము నిలుకడయే లనుండదు? ఈఁగ మిఠాయిదుకాణములో మిఠాయిపైఁబ్రాలియుండును- ఇంతలో నామార్గమున నొకరు పేడతట్టనెత్తుకొనిపోవుచుందురు- దీనినిజూచి యీగ మిఠాయిని వదలి యాతట్టపైఁబ్రాలును- ఇఁక దుమ్మెదలెప్పుడు పువ్వులమీదఁబ్రాలునుగాని పాడువస్తువులపైఁబ్రాలదు. ప్రపంచకవిషయాసక్తులీగలవంటివారు- ఉన్నతాత్మఁగలిగిన పరమహంస యెప్పుడు నిత్యానందములోమునిఁగియుండును-

పూలికగవిషయములలో మునిఁగినవాఁడెప్పుడు దుమ్ములోఁబుట్టి దుమ్ములోఁబెరిగి దు

మ్ములోఁజచ్చు పురుగులవంటివారు- ఇప్పుడుదుమ్ములోనుండి యింకఁగొంతకాలమునకుఁబం చదారపైఁబ్రాలు యీగలవంటివారు సామాన్యులు- నిత్యానందమనుభవించువారు పరబ్ర హ్మజ్ఞానులు-

(260) ప్రపంచలోలునిమానసము పేడపురుగువంటిది- ఈపురుగెప్పుడుఁ బేడలో నుండి పేడలోఁబెరుగును పేడలోనేచచ్చుచుండును- ఎవ్వరయినదీనినిదీసి రోజాపువ్వు మీఁదఁబెట్టిన దీనివాసనసహింపలేకఁ జచ్చిపోవును- అట్లే విషయానురాగముఁగలవాఁడు కామలోభాదులవిడచి ప్రపంచవిషయములఁద్యజించియుండలేడు-

(261) పక్షియొకటి నావయొక్క తెరచాపకొయ్యపైఁబ్రాలును- ఇచ్చటఁ గొంత కాలముండి విసుకుతోఁచి యింకొకవస్తువుపైఁబ్రాలనిశ్చయించి లేచిపోవును- కాని యెంత తిరిగినను వ్రాలుటకేమియు నాధారముకానఁబడక తిరిగి యానావ తెరచాపకొయ్యపైకి వచ్చివ్రాలును- ఈశ్వరజ్ఞానముఁబడయఁగోరి యొకగురువుయొద్దఁజేరి కొన్నిదినములుండి యాయనచెప్పుతత్త్వములుఁరుచింపక నక్కడనుండుటకష్టమని లేచిపోయి యింకొకగురువు ను వెదకుటకు నారంభించును- కాని మరియెవ్వరుఁగానరాకఁ దిరిగి పూర్వగురువుచెంతకే రావలసివచ్చును- ఇప్పుడు శిష్యునకుఁగురువునందుఁగల గౌరవమధికమగును-

(262) లోకములోనుండి త్యాగియైనవానిమనస్సెట్లుండును? ఈయన నీటిలోఁబె రుగు రోజాచెట్టాకువంటివాఁడు- బురదగుంటలోనుండు బురదగుడిసెవంటివాఁడు- రో జాచెట్టాకునకు నీరంటుకొనదు- బురదగుడిసెకు బురదయంటుకొనదు-

(263) లోతయినబావియంచునఁగూర్చుండినవాఁడు విశేషముజాగ్రత్తగానుండును- అట్లే మనుజుఁడు లోకములోనున్నంతవఱకు 'మాయ'కు వశముఁగాకుండునట్లు జాగ్రత్త పడవలయును- ఒక్కపర్యాయము 'మాయ'యను బావిలోఁబడినగాయములుతగులక నొ ప్పికలుగక బయటికి రాలేరు-

(264) వైరాగ్యము నేర్చుకొనుటయెట్లు? ఒకగృహిణి తనభర్తతో 'నాకు నా తోఁడబుట్టినవానివిషయమై చాలాదుఃఖముగానున్నది. ఆతఁడు వారముదినములనుండి స న్యాసియగుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు- క్రమక్రమముగాఁ గామలోభాదులఁ జంపివే యుచున్నాఁడు' అని చెప్పెను- అప్పుడు భర్త 'నీకుఁజింతవద్దు- ఆతఁడు సన్యాసికాఁ డు. ఆలోచనలఁజేయువాఁడు సన్యాసికానేరడు' అని బదులుచెప్ప విని 'మఱియింక నె ట్లగు'నని యడిగెను. అంత భర్త 'సన్యాసియగువానిపద్ధతియిది'యని చెప్పి తనవస్త్రముల

(జింపుకొని యొక పేలికను మొలకుఁజుట్టుకొని భార్యతో 'లోకములో స్త్రీలు నాకు తల్లు'లని నుడువుచు నింటినుండి లేచిపోయెను.

(265) వైరాగ్యము లెన్ని విధములు? తీక్ష్ణవైరాగ్యమని, సామాన్యవైరాగ్యమని రెండువిధములు. ఒక్క రాత్రిలోఁ జెరువుఁద్రవ్వి నీరుఁబెట్టుటవంటిది తీక్ష్ణవైరాగ్యము. నెమ్మదిగా నోర్పుగలిగి సంపాదించుకొనునది సామాన్యవైరాగ్యము. ఇదియెప్పుడు పూర్ణమగునది యెవ్వరికిఁ దెలియదు.

(266) ప్రపంచలోలుని స్వభావమెట్టిది? ఈతఁడు కుండలోనుండు ముంగిసవంటివాఁడు. ముంగిసను బెంచినవాఁడు గోడపైభాగమున నొక తట్టను దగిల్చి యందులో నాజంతువును బెట్టును. దీని మెడకు వదులుగా నొక త్రాటినిఁ గట్టి యా త్రాటి రెండవకొనకుఁ బెద్ద బరువుఁ గట్టును. ఆ ముంగిస బయటికివచ్చి యాడుకొనుచు నెప్పుడయిన భయపెట్టబడినపుడు దట్టలోపలికిఁ బోయి దాగుకొన ప్రయత్నించును. కాని త్రాటికిఁ గట్టబడిన బరువు దానినిఁ బరుగెత్తనీయదు. అట్లే ప్రపంచలోలుఁడుగూడ నప్పుడప్పుడీకష్టములకు నీదుఃఖములకు నోర్వలేక భగవంతునిఁ బ్రార్థింపఁ దలఁచును. కాని యట్టివానిని దిరిగి యీ ప్రపంచకము కష్టములలోనికి నాకర్షించును.

(267) పల్లెవాఁడు జేపలకై వలను వేయును. కొన్ని చేపలు దానిలోఁబడి కదలకయుండును. కొన్ని కదలి తప్పించుకొనఁ జూచును. కాని వాని ప్రయత్నములు వ్యర్థాయగును. కొన్ని తప్పించుకొనఁగల్గును. లోకములో నుండు వారుగూడ మూఁడుతరగతులు. (i) ఎన్నఁడును జ్ఞానమునుగోరనివారు. (ii) ముముక్షువులు. (iii) ముక్తులు.

(268) సూర్యోదయమునకుఁ బూర్వము తీసిన వెన్న తరువాత దీసిన వెన్నకంటె రుచిగానుండును. శ్రీ పరమహంస పడుచువారలయిన తనశిష్యులఁ జూచి 'మీరు సూర్యోదయమునకుఁ బూర్వమునఁ దీయఁబడిన వెన్నవంటివారు. ఇఁక నాశిష్యులలో గృహస్థులయినవారు సూర్యోదయాత్పరమందుఁ దీయఁబడిన నవనీతమువంటివారు.

(269) ఈశ్వరుఁడెక్కడనున్నాఁడు? ఆయన నెట్లు కనుఁగొనవచ్చును? లోతైన సముద్రమునందు మత్స్యములున్నవి. వానికొఱకు నీవందులో మునిఁగి పలుపర్యాయములు వెదుకవలయును. లోకములోనున్న భగవంతుని విషయముగూడ నింతయే.

(270) 'నెత్తురు, చీము' వీనితోఁ గూడిన యీదేహమునందు భగవంతుఁ డెట్లుం

దును? పిచికారులో దండమెట్లు దానిని నంటుకొనక నుండునో యట్లే భగవంతుఁడు గూడ దేహమున కంటుకొనక నందులోనుండును.

(271) భగవన్నామమును దలఁచుకొనినప్పుడు లేక వినినప్పుడు తన దేహమునందలి రోమములెప్పుడు పొడుచుకొనునో, యెప్పుడానంద బాష్పములు వానికండ్లవెంటఁ గారునో యప్పుడు వానికదియే చివరి జన్మయని చెప్పవచ్చును-

(272) గాలిలో ననేకకోట్ల గాలిపటము లెగిరియాడుచున్నవి- కాని వానిలో నొకటి రెండుమాత్రము ధారములఁ ద్రెంపుకొని యెగిరిపోవుచున్నవి- అట్లే యనేకవందల సాధనములలో నొకటి రెండుమాత్రము మనకు విషయాసక్తినిఁ దొలఁగించి వైరాగ్యము నివ్వగలుగును-

(273) 'పరభక్తి' యన నేమి? భక్తుఁడు భగవంతునిఁ దన యనుంగు చుట్టముగాఁ జూచుకొని చింతించుచుండుటయే 'పరభక్తి' యనఁబడు- శ్రీకృష్ణునకు గోపికలు చూపిన భక్తియటువంటిదియే- వారాయనను 'గోపీనాథా' యని పిలిచిరికాని జగన్నాథా యని పిలువలేదు-

(274) ధనకామములఁగోరు మనస్సు లేత పోకకాయవంటిది- ఇయ్యది లేతగా నుండునంతవఱకు దాని డొల్లకు రసముతో నంటుకొనియుండును- పచ్చి వదలిపోయి నపుడు డొల్లకంటుకొనక లోపలఁ గొట్టుకొనుచుండును- అట్లే మనుష్యునకు 'భాగ్యము, సుఖము' అను రసమారిపోయిన తరువాత స్వేచ్ఛుఁడగును-

(275) 'సత్వరజస్తమములు' అనఁబడు పూజాభాగములకుఁగల భేదమేమి? గర్వము, నటనలేక సత్యాసక్తిఁగల్గి పూజించుట సాత్వికపూజ యనఁబడును- ఇల్లునలంకరించి, సంగీత నృత్యములుండునట్లేర్పాటుఁజేసి, పంచిపెట్టుటకుఁ బండ్లు ఫలములఁ దెప్పించి పూజజేయుట రజసిక పూజనాఁబడు- దేవాలయములో ననేకవందల మేకలను గొఱ్ఱెలను బలియిచ్చి, కల్లుసారాయి మాంసములఁ దెప్పించి, యాటలాడుటకు భోగమువాండ్ర రప్పించి సంగీతములఁ బాడుచు బూజసల్పుట తామసిక పూజయందురు-

(276) మనుజుని జ్ఞానిగానయిన నజ్ఞానిగానయినఁ జేయునది మనస్సు- ఒకఁడు మనస్సువల్లనే పరిశుద్ధతఁగల్గి భక్తుఁడగును- ఇంకొకఁడు దానివల్లనే దుష్టుఁడగును- మఱియొకఁడు పాపియగును- కనుక మంచిగుణములకుఁ గారణమైనదిగూడ యీ మనస్సే యయియున్నది- ఈశ్వరునిపై సర్వకాలములందు మనస్సును నిల్పినవానికి మఱియేసాధనగాని యితర దైవభక్తిగాని యవసరములేదు-

(277) జ్ఞానముఁబొందిగాక కష్టములఁ బడలేక సన్యాసిత్వమైనవాని స్వభావమెట్టిది? ఇంటియొద్దఁ దండ్రితోఁగాని తల్లితోఁగాని భార్యతోఁగాని మఱియెవ్వరితోనైనఁ బోట్లాడి సన్యాసము బుచ్చుకొనువాఁడు పేరునకుమాత్రము విరాగియనఁబడును. ఆ వైరాగ్యము మనస్సునఁబుట్టినదికాదు- తిరిగి మంచిభాగ్యము కలిగినట్లయిననా సన్యాసము మాయమైపోవును-

(278) అకస్మాత్తుగ నేపనియైనఁ గానేరదా? ముక్తినిఁగాని మఱిదేనినైనను సాధించవలయునన్న సామాన్యుఁడైనవాఁడు క్రమముగా ననేకప్రయత్నములఁ జేయవలయును- ద్వారకానాథమిత్రుఁ డొక్కదినములోఁ బ్రధానన్యాయస్థానమునకుఁ దీసికొనఁబడలేదు- ఇట్లు తీసికొనఁబడుటకు బూర్వమనేక సంవత్సరములు కష్టించి పనిఁజేసెను. విశేషము కష్టబడుటకు నిష్టములేనివారు న్యాయవాదులుగనే యెప్పుడునుండవలయును- అయినప్పటికి భగవదనుగ్రహమువలన కొందఱుహఠాత్తుగా జ్ఞానులగుదురు- మహాకవియైన కాళిదాసిటువంటివాఁడే- ఈయన మొట్టమొదట మోటవాఁడుగానుండి తరువాత సరస్వతీదేవి యనుగ్రహమువలన హిందూదేశమంతటను మహాప్రసిద్ధివహించిన సంస్కృతకవియై విలసిల్లినాఁడు.

(289) భక్తియొక్కయుగ్రరూపమేమి? సతతము 'కాళీ, జైకాళీ' యనుటయు 'హరీ, హరీ' యని కేకలవేయుటయు భక్తియొక్క యుగ్రరూపము- ఈ కలియుగములోనిదియే ప్రశస్తము. శాంతివహించిచేయఁబడు భగవచ్చింతనకంటె నిదిత్వరలో ముక్తినొసగును- ధూర్తశాసనమువహించియైనను స్వర్గమును బొందవలయును-

(280) మనుజుని తలఁపులు, నుద్దేశములఁబట్టి వానికిఫలము కలుగుచుండును- భగవంతుఁడు కల్పవృక్షమువంటివాఁడు- ఒక బీదవానికొడుకు కష్టించి చదువుకొని ప్రధాన న్యాయస్థానాధిపతియై "నేనుహాయిగా నిప్పుడుంటిని- పూర్ణగానభివృద్ధిఁబొందితిని- నేను కోరఁదగినది మఱియేమియులేదు" అని తలఁచును- దీనికి భగవంతుఁడు, 'నీవెప్పుడు దీనిలోనే యుండు'మని చెప్పును. కొంతకాలమైన తరువాత నాతఁడు పింఛనఁ బుచ్చుకొని "అయ్యో! నేనేమిచేసితిని"యని యనుకొనెను- తిరిగియీశ్వరుఁడు "అయ్యో! నీవేమిచేసినావ"ని బదులుచెప్పును-

ఒకనికిఁ జేపలఁబట్టుటయిష్టము, కవుకవాఁ డదివఱలోఁ జేపలఁబట్టువారియొద్దకు వెళ్ళి, "ఎక్కడ మంచిమత్స్యములు దొరకును? వానినిఁ బట్టుటకు మంచిగాలమేది?" యనియడిగి వారిజవాబువాలించి తగుసాధనములఁగైకొని యాగుంటకువెళ్ళి గా

లము వేసి వేచియుండి పెద్దపెద్దచేపలఁ బట్టును. అట్లే మహాపురుషులు చెప్పు మాటలయందు దృఢనమ్మకఁగల్గి భక్తియను యెఱ్ఱను వేసి మనస్సను దండముతో భగవంతునిఁబొందవలయును- తత్సమయమున నసమానమైన యోర్పుఁగల్గి వేచియుండువానికే భగవంతుఁడు కనఁబడును.

(282) చెరువులో గాలము వేసినప్పుడా యెఱ్ఱను దినుటకు నన్నిప్రక్కలనుండి మత్స్యములువచ్చుచుండును- అట్లే పరిశుద్ధుఁడైన భక్తునియొక్క భక్తిప్రేమల మెచ్చుకొని భగవంతుఁడు దర్శనమిచ్చుచుండును-

(283) 'నాకజ్ఞానము కలదని యెవరు తెలుసుకొనెదరో వారు జ్ఞానము బొంది యజ్ఞానమును విడిచివేయుదురు. అట్లే తనను మాయ యావరించుకొనియున్నదని యెఱిగినవాఁడు మాయావిమోహితుఁడగును-

(284) తామరను గోకినకొలఁది యింకను గోకుటకుబుద్ధిపుట్టి గోకునపుడుసంతోషముగ నుండును. అట్లే భగవద్భక్తులకు భగవంతుని కీర్తనలఁబాడుటయందు విసుకు తోఁచదు.

•

(285) తామరను గోకుచున్నపుడు హాయిగానున్నను తరువాత మంటపుట్టుచుండును- అట్లే యీలోకమందలి సుఖములు మొట్టమొదట బాగుగానుండినను దరువాత వాని ఫలములఁ దలంచుటకు సహించుటకు జాలాకష్టముగ నుండును.

(286) దయ్యముపట్టినవానికి నువ్వుల మంత్రించియిచ్చినఁ బోవును. దయ్యము పట్టిన నువ్వులెట్లు దయ్యమును వదలింపఁగలవు? ఆవిధముననే నీవునీమనస్సునందు దుష్ట తలంపులఁ గల్గియుండి భగవంతునిఁ బ్రార్థించిన నెట్లు జయమునొందుదువు?

(287) నీటిలోఁ బడవ యుండవచ్చును కాని పడవలో నీరుండఁకూడదు. అట్లే భగవద్భక్తుఁడు ప్రపంచములోనున్నను భక్తునిలోఁ బ్రపంచముండఁగూడదు.

(288) ప్రార్థనలవలన లాభమున్నదా? మనస్సునందు వాక్కునందు నొక్క విషయమునే తలఁచి ప్రార్థించిన లాభముండును. మనస్సులో సర్వము నాదియని తలఁచుచు మాటలయందు మాత్రము, "ఓభగవంతుఁడా! సర్వమునీదియే" యని ప్రార్థించిన లాభమేమాత్రము నుండనేరదు-

(289) ఒక పెద్దగోడ యొక్క ప్రదేశముచుట్టుఁ బెట్టఁబడియున్నది, దీనిలో నేమి యున్నది- యెవ్వరు నెఱుఁగరు- ఒకపర్యాయము నలుగురు మనుజు లందులో నేమి యున్నది యొక నిచ్చెన సహాయమువలనఁ జూచి కనుఁగొనెదమనుకొనిరి. మొదటివాఁడు పైకెక్కి- హాహాయని దానిలోపలికి దుమికెను. రెండవవాఁడు మూఁడవవాఁడుఁ గూడ నట్లే దుమికిరి. కాని నాల్గవవాఁడు గోడపైనెక్కి- దానిలోపల ఫలవంతమయిన యొక శృంగారవనమును వీక్షించి తక్కినవారివలె లోపలికి దుముకనిశ్చయించియు దుముకక దిగివచ్చి తన సహోదరులతో నాతోటవృత్తాంతమంతయుఁ జెప్పెను. చుట్టును గోడఁగల్గిన యాతోటవంటిది పరబ్రహ్మము- ఆపదార్థమును జూచినవాఁడు తన దేహముఁగూడ మఱచిపోయి యాయనలో లీనమగును. ఋషులు సన్యాసులునటువంటి వారే- ఇకనీశ్వరునిఁజూచి తమసౌఖ్య మితరులకుఁగూడఁ గలుఁగునట్లు చేయువారు మానవకోటిని రక్షించువారు. తక్షణము నిర్వాణస్థితిని వీరుకోరక దమ సహోదరుల యజ్ఞానమును బాపుటకు దిరిగి జన్మమెత్తుచుందురు.

(290) “పరిశుద్ధమైన జ్ఞానము, పరిశుద్ధమైనప్రేమ” ఈరెండు నొక్కటియే.

(291) పిల్లవాఁడు తల్లిని బొమ్మలిమ్మని యేదయినఁ దినుటకుఁబెట్టుమని యేడ్పింమను. అట్లే తనదగ్గిఱ చుట్టుముగ భగవంతునిఁ జూచుకొని యజ్ఞానిఁడయిన పిల్లవానివలె నాయనను జూచుటకుఁ దొందరఁబడువానికిఁ దుదకు భగవద్దర్శనముతప్పకఁగలుగును అట్టిభక్తునకు దేవుఁడు దర్శనమిచ్చుటకు నాలస్యముఁ జేయఁడు.

(292) ఓమనసా! సర్వశక్తుఁడయిన భగవంతుని నాసక్తిఁగల్గి పిలువుము. ఆయన యెంత త్వరితముతో నీయొద్దకు బఱుగెత్తుకొనివచ్చునో చూచెదవు. మనహూసక్తితోనే పిలిచినట్లయిన నీశ్వరుఁడు దర్శనమియ్యక నుండలేఁడు.

(293) ఈనాందారుఁడు భాగ్యవంతుఁడైనను దన బీదకాపు భక్తితోఁదెచ్చియిచ్చు చిన్న బహుమానమును సంతోషముతో గ్రహించునుగదా. అట్లే తనభక్తుఁడిచ్చు నైవేద్యముల,దీనమైనవియైనఁ, దృప్తిగల్గి సంతోషముతో నీశ్వరుఁగు గ్రహించును.

(294) శ్రీరామచంద్రుఁ డీ లోకమునం దవతరించినప్పుడాయన యవతారపురుషుఁడని యేడుగురుమాత్రము తెలుసుకొనఁగల్గిరి. అట్లే భగవంతుఁ డవతరించి నప్పుడు కొద్దిమందిమాత్రము నిజమును దెలిసుకొనఁ గల్గుదురు.

(295) గంటయొక్క ధ్వని చక్కఁగా వినఁబడునంతవఱకు నదియాకార మిచ్చుచుండును. వినఁబడనప్పుడు రూపమునివ్వలేదు. ఈవిధముననే భగవంతుఁడు రూపారూపములఁగల్గియున్నాఁడు.

(296) "లక్క యేనుగ, లక్క పండు" ఇవియెట్లు నిజమైన యేనుగను బండునుఁ జ్ఞాపకమునకు దెచ్చుచున్నవో యట్లే విగ్రహములుగూడ నిరాకారుఁడును శాశ్వతుఁడు నయిన యీశ్వరునిజ్ఞాపకము చేయుచున్నవి.

(297) విగ్రహములను హేతము చేయువాఁడగు కేశవ్ చంద్రసేనునిఁజూచి శ్రీరామకృష్ణ పరమహంస, "నీవు విగ్రహములనుజూచి వట్టిరాళ్ళని నిరుపయోగమైనవని యేలఁదలఁచెదవు? ఈవిగ్రహములలో మాత్రము శాశ్వతుఁడు సర్వజ్ఞుఁడునయిన భగవంతునిరూపము నేల నూహింపలేవు? ఇవిగూడ భగవద్రూపములేయని యెఱుంగుము" అని చెప్పెను.

(298) పంచదారతోఁ బక్షులను మృగములను జేయవచ్చును. అట్లే వివిధకాలములలో వివిధస్థలములలో వివిధనామములతో వివిధరూపములుగ నీశ్వరుఁడు పూజింపబడును.

(299) వివిధమతములు భగవదాలయమునకుఁబోవు వివిధమార్గములు. కలకత్తాయొద్ద కాళీఘట్టములోఁ గాళీదేవిగుడికి బోవుమార్గము లనేకములు ఆవిధముననేయీశ్వరుని భవనమునకుఁ జేరుట కనేకత్రోవలు కలవు. ప్రతిమతమునట్టిత్రోవలలో నొకటిగాని మఱివేఱుకాదు.

(300) బంగారముతోఁ బలువిధములైన యాకారములను బలునామములను గల్గిన యాభరణములఁ జేయించవచ్చును. అట్లే భగవంతుఁడుగూడ ననేకపేరులతో ననేకరూపములుఁగాఁ బూజింపఁబడుచుండును. కొందఱాయనను దండ్రీయని మఱి కొందఱు తల్లీయని యింకొందఱు మిత్రమాయని ప్రియుఁడాయని పిలుచుచుందురు. ఏన్ని విధములుగాఁ బిలువఁబడినను భగవంతుఁ డొక్కఁడే.

(301) ఒక బీదబ్రాహ్మణునకు బట్టలవర్తకుఁడొకఁడు శిష్యుఁడుగా నుండెను. వర్తకుఁడు సహజముగ లోభియైయుండును. ఆబ్రాహ్మణునకొకనాఁడు తనపుస్తకము నంటించుకొనుటకొక చిన్న గుడ్డపేలిక కావలసివచ్చి శిష్యునియొద్దకుఁబోయి యొకగుడ్డపీలిక నివ్వుమనియడిగెను. అప్పుడావర్తకుఁడు 'అయ్యో! ఇప్పుడడిగినారే. కొంచెముముంద

ర నడిగినట్లయిన నిచ్చువాఁడను. ఇప్పుడు నాయొద్ద నేమియు లేవు. అయినను జ్ఞాపకముఁ బెట్టుకొనెదను. అప్పుడప్పుడు జ్ఞాపకముఁ జేయుచునుండవలసినది' యని బదులుచెప్పెను. ఇప్పుడు బ్రాహ్మణుని యాశ నిరాశయై వెళ్ళినమార్గముననే తిరిగివచ్చుచుండెను. ఈ యనకుఁ దనభర్తకుఁ జరిగిన సంభాషణ చాటుగానుండివిని తక్షణము తిరిగిపోవుచున్న యా విప్రునిఁ బిలిపించి 'అయ్యా! ఏమిటి మీరు వారినడుగుచుంటిరి' యని యడిగెను. జరిగిన వృత్తాంతమంతయు నీయన చెప్పగావిని యామె 'ఈదినమునకు మీగృహమునకు దయచేసి వెళ్లుడి, రేపు ప్రాతఃకాలమున మీకు గుడ్డవచ్చును' అని చెప్పి యాయన నానాటికి బంపివేసెను. రాత్రి భర్త యింటికి రాగా 'కొట్టునప్పుడేమూసినారా?' యని యామె యడిగెను. అట్లడుగుటకుఁ గారణమేమని భర్త యడుగ నామె 'తక్షణము నీవు వెళ్ళి ప్రశస్తమయిన రెండుగుడ్డలను దెమ్మ'ని యాయనతోఁ జెప్పెను. ప్రొద్దునఁ దీసికొనివచ్చెదనన్న వినక నిప్పుడే నాకవి కావలయునని భార్య బలవంతపెట్ట నాయన చేయునదేమియు లేక, తనగురువును దిరస్కరించినట్లు గృహగురువయిన భార్యమాటల కెదురుఁ జెప్పజాలకఁ దక్షణము వెళ్ళి ప్రొద్దుపోయినను గొట్టుతాళముఁ దీసి గుడ్డలఁ దీసికొనివచ్చి యామెకిచ్చెను. మంచిహృదయము గలయామె వానిని మరునాఁడుదయమున నా బ్రాహ్మణునకుఁ బంపుచు, 'ఇఁకముందు మీకేమైనఁ గావలసియున్న యెడల నన్నడిగిన నేనిచ్చెద'నని వార్త బంపించెను. కనుక నట్లే భగవంతునిఁ దండ్రిగాఁ దలఁచువారికంటెఁ దల్లిగాఁ దలఁచువారు త్వరలో శ్రేయస్సుఁ బొందుదురు వీరి ప్రార్థనలు వారి ప్రార్థనలకంటెఁ ద్వరగా దేవునిచే నాలకింపఁబడును.

(802) ఒక బ్రాహ్మణుఁ డొకతోటను బెంచుచుండెను. గాత్రింబవళ్లు కాపాడఁబడుచున్నను దానిలోపలికి నొకనాఁడొకయావువచ్చి యొకమామిడిపిలకఁ ద్రొక్కివేసె. అప్పుడా బ్రాహ్మణుఁ డమితకోపాయత్తచిత్తుఁడై దానిని గొట్టిచంపివేసెను. 'బ్రాహ్మణుఁడు, గోవునుజంపె'నను వార్త లోకమంతయు వ్యాపించెను. ఈవార్తవిని యారామాధికారి పరమవేదాంతివలె "నేను గోవునుజంపలేదు. నాచెయ్యి చంపినది. ఇప్పుడు హస్తాధిపతి యింద్రుఁడై యున్నాఁడు. కనుక గోవునెవ్వరు చంపినను నింద్రుఁడు చంపినవాఁడగును"నిపల్కెను, ఈమాటలను హరివాయుఁడువిని వృద్ధబ్రాహ్మణరూపముఁ దాల్చి యా వనాధికారియొద్దకు వెళ్ళి 'అయ్యా! ఈతోట యెవరిది' నియడిగెను. 'నాది' యని విప్రుఁడు చెప్పగావిని యింద్రుఁడు "ఇయ్యది చాలాసుందరముగనున్నది, తోటమాలిగూడ చాలా తెలివిఁగలవాఁడు, చూడుడు! ఏంతచిత్రముగ నెంతచక్కగ నీచెట్లను నాటినాఁడో కనుగొనుఁడ"నిపలికెను. ఈమాటలకుఁ దిరిగి బ్రాహ్మణుఁడు "అదిగూడ నేనుచేసినదే. ఇట్లు చేయవలసినదియని చెప్పి వానిచేతఁ జేయించితిని" అని చెప్ప స్వర్గాధిపతి 'ఈమార్గము నెవ్వరువేయించినారు? విశేషమాలోచనఁ జేసిపోసియుండవలె'నని తిరిగి విప్రుని యడిగెను

ఈయన 'ఇదియంతయు నేనుచేసినదియే'యని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట నింద్రుడు బ్రాహ్మణునిచేతులఁబట్టుకొని, 'అయ్యా! ఇవియన్నియు నేనుచేసినవే. ఆకీర్తి యంతయు నాకురావలసినదియే'యని చెప్పవు నీవుచంపినగోవుపాపమునుమాత్రము దీనుఁడైన యింద్రునిమీఁదఁద్రోయుట న్యాయమగునా'యని చెప్పి వెళ్ళిపోయెను.

ఒకరాజుగృహములో నర్ధరాత్రివేళ నొకదొంగప్రవేశించెను. అప్పుడు రాజు తనభర్యతో 'మనపిల్లను నానదియొద్దునివసించియుండు సాధువులలో నొకరికి నివ్వఁదలఁచితి'నని చెప్పుచుండెను. ఈమాటల నాదొంగవాఁడువిని 'నాయదృష్టము బాగుగానున్నది. రేపాసాధువులలో వెళ్ళికూర్చుందును. రాజప్పుడువచ్చి తనపిల్లను నాకిచ్చిన నివ్వవచ్చు'నని తలఁచి యచ్చటనుండి వెళ్ళిపోయి మరునాఁడాసాధులలో వెళ్ళి కూర్చుండెను. రాజుదగ్గరనుండువా రానదియొద్దకు వెళ్ళి యక్కడనున్న సాధులందఱిని రాజుకుమార్తెను వివాహమాడవలసినది యనియడిగిరికాని యొక్కరునొప్పుకొనకఁబోయిరి. తుదకు రాజుదగ్గరవా రీకపటసాధువుదగ్గరకువచ్చి యాప్రశ్ననడిగిరి. ఈప్రశ్నవిని యాతఁడేమియుఁజెప్పక నూరకుండెను. అంతట నీసంగతిని వారువెళ్ళి రాజునకుఁజెప్పగా నీయన తత్క్షణమాకపటసాధువుయొద్దకుఁజనుదెంచి "అయ్యా! మీరు నాకుమార్తెనుగ్రహించి నన్ను పవిత్రునిఁజేయు"మని ప్రార్థించెను. కపటసాధువయిన యాదొంగవానిమనస్సు తత్క్షణముననుమారిపోయినది. 'నేను సాధునిదుస్తులమాత్రముధరించితిని- ఈరాజువచ్చి యీవిధముగఁ బ్రతిమాలుకొనుచున్నాఁడు- సాధువుగానటించినమాత్రముననే యిట్టిగొప్పవింతలుజరిగినవి- నిజముగా సాధునయినట్లయిన నెట్లుండునోగదా' యనియాదొంగతలఁచి తత్క్షణము వివాహమునుమానివేసి నిజమయినసాధువగుటకుఁ బ్రయత్నించెను. తరువాత నెప్పుడుఁ బెండ్లిఁజేసుకొనలేదు. కొద్దికాలములో నొకపెద్దఋషియయ్యెను. మంచివిషయములనటించినను గొన్నిసమయములయందు జాలా మంచిఫలములుకలుగుచుండును.

(804) ఒకానొకప్పుడు మహాభక్తుఁడయిన యర్జునుఁడు గర్వితుఁడై ఈశ్వరుఁడును నామిత్రుఁడునునైన శ్రీకృష్ణునియందు నాకుఁగలప్రేమ మఱియెవ్వరికిలేదని తలఁచెను. ఈవిషయముతెలిసి శ్రీకృష్ణుఁ డొకనాఁడర్జునుని సాయంత్రముపూట షికారునకుఁ దీసికొనిపోయెను. వారు విశేషదూరము వెళ్ళకమునుపే వారికి నొకబ్రాహ్మణుఁడు దృగ్గోచరమయ్యెను. ఈయన యెండుగడ్డిఁదినుచున్నాఁడు. ఈయనకు నొకప్రక్క వాడిమొనగల యొకకత్తి మెఱయుచున్నది. ఈతఁడువిష్ణుభక్తుఁడనియు, నేభూతమునకు హింసఁజేయఁజాలక బచ్చిగడ్డిలోఁగూడఁ బ్రాణమున్నదనియెతెలిసి యీయన యెండుగడ్డినిఁ దినుచున్నాఁడనియు నర్జునుఁడు గ్రహించెను. అయినను బ్రాహ్మణుఁడై క్షత్రియునివలెఁ గత్తినిధరియించుటఁజూచి యాశ్చర్యపడి శ్రీకృష్ణునిఁజూచి 'మిత్రమా! ఈయన వైష్ణవుఁ

డైయుండి కత్తి నేలఁ దాల్చవలెను? భూతహింసఁ జేయఁజాలక యెండుగడ్డినిఁదినుచున్న యీ బ్రాహ్మణునకు మరణచిహ్నమయిన యీవాడికత్తితోఁ బనియేమి? ఈసంకోచమునుఁ దీర్పవే'యనియడిగెను. అంతట శ్రీకృష్ణుఁడు 'నీవే వెళ్ళి యాయననడుగవలసినది'యని బదులుచెప్ప నర్జునుఁడావిప్రునిడాయఁజని 'ఓమహాత్మా! అహింసనే వ్రతముగాఁ దాల్చి యెండుగడ్డినిఁదినుచున్న నీకు బాణమదియేల?'యనియడిగెను. ఈప్రశ్నను వినితద్బ్రాహ్మణుఁడు 'మొదట నారదుఁడు దుష్టుఁడ'నెను. ఇట్లాడినందులకుఁ గారణమడుగఁబడి యాయన తిరిగి 'ఆతనిదుష్టతనముఁ జూడుఁడు! ఏమేమియో కీర్తనలను సంగీతములను సతతముఁ బాడుచు నాప్రభువైన యీశ్వరునిశాంతిని భంగపఱచుచున్నాఁడు. రాత్రింబగళ్లుయుక్తాయుక్త సమయమెఱుఁగక నాప్రభువును విసికించుచున్నాఁడ'నిచెప్పెను. అంత నర్జునుఁడు రెండవ దుష్టుఁడెవరనియడుగఁగా బ్రాహ్మణుఁడు 'ద్రౌపది'యని బదులుచెప్పెను. 'ఆమె జేసిన తప్పేమి'యని యర్జునుఁడడుగఁ దద్బ్రాహ్మణాగ్రేసరుండు 'చూడుఁడి! ఆమెకేమియు నాలోచన లేదు. నాప్రభువయిన శ్రీకృష్ణుఁడు భోజనముఁ జేయఁబోవుచుండ నానాఁడు తొందరపడి 'నీవువచ్చి నన్ను కాపాడవలసినద'ని పిలిచినది. అప్పుడాయన యన్నముఁ జాలించుకొని కామ్యవనమునకు వెళ్ళి దూర్వాసునిశాపమునుండి పాండవులవిముక్తులఁ జేసి రక్షింపవలసివచ్చెను. ఆమెతాఁదినగా మిగిలినయపరిశుద్ధాన్నమునుఁగూడ నాయనతినునట్లుచేసెను'అని ప్రత్యుత్తరమిచ్చెను. ప్రహ్లాదుఁడు మూఁడవదుష్టుఁడనిచెప్పగా నర్జునునిచే నాతీరునఁబల్కు-నందులకుఁగారణంబడుగఁబడి యావిప్రుఁడు 'ఆతఁడు నాప్రభువు నానాఁడు మరగఁబెట్టిన నూనెలోనుండి కాపాడవలసినదనియు, వేదండముల కాళ్ళలోనుండి బాధతగులకుండ రక్షింపవలసినదనియు, నినుపస్తంభములోనుండి పగులఁగొట్టుకొని రావలసినదనియుఁ బల్కినాఁడ'ని వాక్రుచ్చెను. నాల్గవదుష్టుఁడెవఁడనియడుగఁబడి యాభూదేవుండర్జునుండ నిపలికెను. 'అదియేమియట్లంటిరని' ప్రశ్నించ నాయన, 'నాప్రభువైన శ్రీకృష్ణుని నాకురుక్షేత్రయుద్ధమందుఁ దనరథసారధినిగా నర్జునుఁడుంచుకొని యున్నాఁడ'ని వచించెను. అప్పుడర్జునుఁడు తద్బ్రాహ్మణుని పరమభక్తియుఁ బ్రేమనుజూచి మహాశ్చర్యమునొంది నిర్గర్వితుఁడాయెను.

(805) ఈసంసారబాధలు నీవికావనియు, భగవంతునివేయనియుఁ దలఁచుము. నీ వాయనసేవకుఁడవు. కనుక నాయనయాజ్ఞలప్రకారము నడఁచుకొనుము. దృఢనమ్మకముఁగలిగి యిట్లుతలఁచినవానికి 'నాది' యనుమాటయుండదు.

(806) శ్రీరామకృష్ణభగవాన్ 'నాయాజ్ఞలప్రకారము నీవు పూర్తిగానడచుకొనఁగలుగుదువా? ఇంతయేల, నేనుచెప్పుదానిలోఁ బదునాఱవవంతుఁజేసిన నీకు ముక్తివచ్చును. సంశయములేదు- నామాటలనువినుము'ని యిట్లుచెప్పుచున్నాఁడు-

(807) ఇనుమునుఁ గొలిమిలోఁ బెట్టి చక్కఁగాఁ గాచినఁగాని యుక్కు కానేరదు. ఉక్కైననుగాని కత్తిజేయుటకువీలులేదు- ఇట్లుచేయఁబడినయుక్కు కత్తి యెట్లుత్రిప్పిన నట్లుతిరుగును- మనస్సుఁ బరిశుద్ధముఁ జేసుకొనవలయు ననిన మనము దానిని 'ఆపదలు, దుఃఖములు' అనుకొలిమిలోఁ గాల్చవలయును- తరువాత 'హింస'యను సుత్తిఁదీసికొని దెబ్బల వేయవలయును-

(808) ఒకమంగలవాఁ డొకచెట్టు క్రిందుగాఁ బోవుచుండఁగ నప్పు డాతనికి 'నీయేడు బిందెలబంగారము గ్రహింతువా?' యని యొకపెద్దశబ్దము వినఁబడెను- ఈమాట్లాడినదియెవరోయని యతఁడు చుట్టుఁబరికించిచూచెనుగాని యెవ్వరునగుపడలేదు- బంగారమువచ్చుననియాసపడి గ్రహింతునని బిగ్గఱగానఱచి పల్కెను- 'నీవు నీగృహమునకు నేగుము- అవి మీయింటిలోనుండు' నని తిరిగియొకశబ్దము వినఁబడ నీమాటలసత్యమునుఁ గనుఁగొనుటకు దక్షణమాతఁడు గృహమునకరుదెంచెను. ఏడుబిందెలున్నవి. తెరచిచూడ నాలింటిలోఁ బూర్తిగా, నొకదానిలో సగము వఱకు బంగారము కలదు. అంతట నామంగలి 'ఈ యేడవ బిందెగూడ నిండియున్నగాని నాసౌఖ్యము పూర్తిగాద'ని తలంచి తనయింటిలోఁగల నగలనమ్మి యాధనము నందులో వేసెను. కాని యాయేడవబిందె యెప్పటివలె నున్నది. కనుకఁ దానుఁ దనసంసారముఁ దినుటగూడమాని తమయాదాయమునంతయు నందులో వేసిరి. ఇప్పుడునునది పూర్వమురీతి నేయున్నది. అందువలన నామంగలి యొకనాఁడు రాజుచెంతకుఁ బోయి 'నాకు మీరిచ్చుజీతము చాలుటలేదు. కనుక నాజీతమును హెచ్చింపుఁడ'ని దీనముగా వేడెను. రాజీతనికిఁ బ్రియుఁడగనుక నీతనికి జీతమునిబ్బడిచేసెను. తన జీతము నంతయుఁ గాచి మంగలి యాబిందెలో వేయుచుండెను. కాని యదినిండుసాధనయేదియుఁ గానఁబడదయ్యె. అక్కడనుండి యాతఁడు ముష్టియెత్తి యాధనమునుగూడ నందులో వేయసాగెను. అనేకనెలలుగడచినవికాని యామంగలిదుఃఖమగ్నైయున్నది. అప్పుడు రాజాతనినిఁ జూచి "ఇప్పుడిచ్చుదానిలో సగమిచ్చునప్పుడే చాలాసంతోషముగను హాయిగనుంటివి. ఇప్పుడీయవస్థయేమి? ఇబ్బడిజీతమునుదీసికొనుచు నిట్లతిదీనుఁడవై దుఃఖించుచుంటివి. నీసంగతియేమి? నీకేడుబిందెలబంగారమువచ్చినదా?" యనియడిగెను. ఈ మాటలకు మంగలియాశ్చర్యపడి, 'మీకిదియెవ్వరుచెప్పిరి?' యనియడిగెను. అంతట రాజు 'యక్షుఁడెవ్వనికి నేడుబిందెలబంగారమునిచ్చినను వానిస్థితియిట్లగునని నీవెఱుఁగవా? నాకుఁగూడ నట్లేయిచ్చినాఁడు. అప్పుడు నేను 'నీవునాకిచ్చుచున్న ధనమును దాచమందువా? లేక ఖర్చుపెట్టమందువా' యనియడిగితిని. నేనిట్లు ప్రశ్నించఁగనే యాయక్షుఁడు తిరిగిచూడకఁ బారిపోయెను- ధనముఁగలవారు ఖర్చుపెట్టఁగనియెఱుఁగవా? ధనమువచ్చుచు దానివెంట లోభితనమునుగూడఁ దెచ్చును. కనుకఁ దక్షణము వెళ్ళి యాధనము నిచ్చివేయు'

మని చెప్పెను. అప్పుడామంగలి మొదట శబ్దమువినబడినచెట్టుయొద్దకుఁబోయి 'నీ ధన మంఁదిరిగి నీవుతీసుకొనుము'నగా యతఁడు 'సరే'యనియెను- గృహమునకువచ్చిచూచున ప్పటికి నాయేడుబిందెలధనముతోఁగూడఁదానుసంపాదించుకొనినదియు మాయమైపోయిన ది- స్వర్గరాజ్యమునందు కొంతమందిమనుష్యులస్థితి యిటువంటిది- తమకువచ్చునదియెం తయో తమకు ఖర్చగునదియెంతయో చక్కగాఁదెలిసికొనలేనివారికిఁ దుదకు నంతయుఁ బోవును.

) పిల్లవానికి దుమ్ములో నాడుకొని యొడలంతయుఁ దుమ్ముఁజేసుకొనుట యి ష్టము- కానితల్లి పిల్లవాఁడట్లు చేయుటకు నియ్యకొనక నప్పుడప్పుడు శుభ్రముగరుద్ది నీ ళ్ళుపోయును- అట్లే మనుష్యునకుఁ బాపముఁజేయుట స్వభావము- కాని నరుఁడు పా పముఁజేయకుండునట్లు భగవంతుఁడు పలుయుపాయముల యోచించిచేయుచుండును. ఇ ది నిస్సంశయము.

(809) మనుజుఁడజీర్ణమువలనఁ దీసికొనుచున్నను, గడుపు నిండుగానున్నను నా తనికి మిఠాయిగాని మఱియే తినుపదార్థముగాని కనుఁబడినప్పుడు నోరూరుచుండును. అట్లే యొకరిధనమును, భ్రమగల్పించు వస్తువులను జూచినపుడు తప్పక నెటువంటివానికి ఁబీనాసితనము దురాశఁబుట్టును.

(810) ఇతరుల గుణాగుణముల విచారించువాఁడు తనకాలమును వృధా పుచ్చిన వాఁడగును. ఏలయనిన నట్లుచేయుట తనయాత్మనుగూర్చి తలంచుటకాదు. ఈశ్వరుని గూర్చి తలఁచుటకాదు. పరులయాత్మలఁగూర్చి మాట్లాడుటయగును.

(811) భగవంతుఁ డాద్యంతములులేనివాఁడు. జీవుఁ డాద్యంతములఁగలవాఁడు. ఆద్యంతములు కలదానిచే నాద్యంతములు లేనిదానినిఁ దెలుసుకొనుట యెట్లు? ఉప్పుతోఁ జేయఁబడిన బొమ్మను సముద్రమడుగువఱకు ముంచుటకుఁ బ్రయత్నించినట్లగును- ఇట్లు చేయుటయందా బొమ్మకరగి నీటిలోఁ గలసిపోవును. అట్లేజీవుఁడు విడిగానుండి భగ వంతునిఁ గనుఁగొనుటకుఁ బ్రయత్నించిన నా ప్రయత్నములోఁ దన యహంభావత్వమును వదలి భగవంతునితో లీనమగును.

(812) ప్రతివస్తువు నారాయణుఁడనియు, మానవుఁడు నారాయణుఁడనియు, జంతువు నారాయణుఁడనియు, ఋషి నారాయణుడనియు, దొంగవాఁడు నారాయ ణుఁడనియు శ్రీరామకృష్ణభగవాన్ చెప్పుచుండెడివాఁడు. ప్రతివస్తువుయు నారాయ ణరూపమే. నారాయణుఁ డనేక రూపములఁ గలవాఁడు, సకలము నారాయణుడే.

(813) భగవాన్ తనహృదయముంజూపి, "మనస్సులో భగవంతుఁడున్నాఁడని తలంచువారికి బహిర్ప్రపంచమందుగూడఁ గలఁడు. తనలో నీశ్వరునిఁ జూడలేనివాఁడు బయటఁజూడలేఁడు. కాని తనయం తర్హృదయమునందు భగవంతునిఁ జూడనేర్చినవాఁడు జగదాలయమందుగూడ నీశ్వరునిఁ గనుఁగొనఁగలఁడు" అని చెప్పెను.

(817) ఎవ్వ రెవ్వరిగురువు? భగవంతుఁడే ప్రపంచమంతకును మార్గదర్శియు గురువునై యున్నాఁడు.

(815) మనుజుని యాత్మజ్ఞానాభివృద్ధి వాని యభిప్రాయములనూహలఁబట్టియుండును. అదియాతని మనస్సునందు వృద్ధిఁజెందుచుండునుగాని యాతనికార్యములనుండి గాదు. ఇద్దఱు స్నేహితు లొకమార్గమునఁ బోవుచుండ నొక్కచోట భాగవతమును జదువుచుండిరి. ఈయిద్దఱి స్నేహితులలోనొకఁడు, "అక్కడికి వెళ్ళి కొంచెముకాలముండి వినెదమురా!" యని రెండవవానితోఁ జెప్పెను. ఈమాటలవిని వీఁడు, "అదియేమి లాభము? ఇక్కడికిఁగొంతదూరములోనున్న పట్టణశాల (Town Hall) యొద్దకేగిమనకాలము నుత్సాహముతో గడుపుదుమురా", యని పిల్వగా మొదటివాఁడు వినకఁ బురాణముఁజెప్పుచున్న స్థలమునకు వెళ్ళి వినసాగెను. అంతట రెండవవాఁడు పట్టణశాలయొద్దకు వెళ్ళి యేమాత్రమును సంతోషమునుగాంచక, "నయ్యో! ఇచటికి నేలవచ్చితిని? హరికథల వినుచు నా స్నేహితుఁ డానందించుచుండునుగదా" యని తలఁచెను. ఇట్లీతఁడు పట్టణశాలలోనుండియైనను హరినామముఁ దలఁచుకొనెను. భాగవతమును జెవులారవినుచున్నవానికి సంతోషమేమియుఁ గలుఁగలేదు. కనుకవీఁడు, "అయ్యో! నా స్నేహితునితోనయిన వెళ్ళకపోతిని. ఇప్పుడాతఁ డెంతసంతోషముగ నుండునోగదా."యని యనుకొనెను. తుదకువీఁడు పురాణమును వినక నూరకఁగూర్చుండెను. కనుక నీతఁడు దురూహలఁ గలిగి యిక్కడనుండియే యక్కడకు వెళ్ళినపాపముఁ గట్టుకొనెను. అక్కడికి వెళ్ళినవాఁడు హరినామము నక్కడనే దలఁచుకొని పురాణమును వినినఫలమును సంపాదించుకొనెను.

(816) ఒకగుడిప్రక్క నొకసన్యాసి నివసించువాఁడు. ఈయనయున్న స్థలమున కెదురుగా నొక భోగముదాని యిల్లుకలదు. ఈయింటికి ననేకమంది వచ్చుచుండుటఁ బోవుచుండుటఁజూచి యొకనాఁడా సన్యాసి తద్గృహమునందుండు వెలయాలిఁజూచి, "నీవురాత్రింబగళ్ళు పాపముఁజేయుచున్నావు. ఇకముందు నీగతియేమౌనో యని సందేహమునొందెదుచున్న"దని పలికెను. ఇప్పలుకుల నాలించి యామెతన పాపవర్తనకుఁ జాలఁజింతిల్లి క్షమించవలసినదని భగవంతునిఁ బ్రార్థనఁజేసెను. లంజరికె మామె వృత్తియై

యున్నది- కనుక దానినిఁ గాదనివిడిచి రెండవవిధమున నన్నమును సంపాదించుకొనలేక పోయెను- తరువాత నెప్పుడుఁదిరిగిపాపముఁ జేయుచుండినను మున్పటికంటె నధికమగు జిజ్ఞాసఁగల్గి భగవత్ప్రార్థన సల్పుచుండెను. ఆసన్యాసి తాఁజెప్పిన మాటలవలన నామె యేమియు బాగుపడలేదని తలఁచి యీమెజన్మలో నికముందు నీమెయింటికి నెంతమంది వచ్చెదరో చూచెదననుకొనెను- తరువాతఁ దద్గృహమునకు మనుజుడు వచ్చినపుడెల్ల నొక్కొక్కరాతిని బ్రత్యేకముగ నుంచుచుండెను. కొంతకాలమునకొక కుప్పయయినది. ఇంకొకపర్యాయ మామెనుబిలిచి యీరాతికుప్పనుజూపి సన్యాసి, "ఈకుప్పను జూచితివా! నీకు నేను వలదనిచెప్పినది మొదలు నీవుచేసిన ప్రతిపాపకార్యమునకు నొక్కొక్కరాతినివేయగా నీకాలమున కీకుప్పయేర్పడినది- ఇప్పుడయిన నీదుష్కార్యముల వదలివేయుడ"ని బోధించెను- అప్పటినుండి యీవెలయాలు గడగడవణకిపోయి కన్నీరు విడచుచు, "ఓదైవమా! నాకీపాపపుజన్మయేల? దీనినుండి నన్ను విడుదలబెట్టుమ"ని భగవంతుని వేడుకొనెను- చిత్రముగా నప్పుడే మృత్యుదేవతవచ్చి యీమెను గ్రుంచుకొనిపోయినది- ఆదినముననే పైఁజెప్పఁబడిన సన్యాసిగూడ మృతినొందెను- విష్ణుదూతలు వచ్చి భోగముదానిప్రాణమును, యమదూతలువచ్చి సన్యాసిప్రాణమును గొనిపోయిరి- దుష్టవర్తనముఁగల్గిన యీస్త్రీ యదృష్టముజూచి సన్యాసి, "భగవంతుని న్యాయమిదియా! నాజీవితమునంతయు సన్యాసిగను సామాన్యునిగను గడిపితిని- తుదకు నాకునరకము సంప్రాప్తమైనది. పాపకార్యములఁజేయుటయే వృత్తిగాఁగల్గిన యీవెలయాలు స్వర్గసుఖము ననుభవించుచున్నది-" నియనుకొనెను. ఈమాటలను విష్ణుదూతలువిని, "భగవంతుఁడుచేయునది న్యాయముకాని యన్యాయముకాదు. నీతలఁపులనుబట్టి నీకుఫలము కలుగును- 'పరు లనుకొందురుగదా' యని నీవుసన్యాసివైయుంటివి- నీవలెగాక నీమె పాపకార్యములఁ జేయుచున్నను సత్యాసక్తిఁగల్గి దేవునిఁబ్రార్థించినది- ఇప్పుడు మీకళేబరములనుజూడుడు. నీకళేబరమును బూదండలతో నలంకరించి సంగీతముఁబాడుచు నూరంతయుఁద్రిప్పి నదిలోఁబారవేయుటకుఁ గొనిపోవుచుండిరి- ఈమెకళేబరమావలఁబారవేయఁబడి నక్కలచేత రాబందులచేతఁ జీల్చుకొని తినఁబడుచున్నది. అయినను నీమెహృదయముమంచిది- కనుకస్వర్గమునకువచ్చుచున్నది. ఎప్పుడు నీవామె పాపముల నెంచుచుంటివి కనుక నీవు నరకప్రాప్తుఁడవయితివి. నీవుదుష్టుఁడవుకాని, యీమెదుష్టవర్తనఁగలదికాదు" అనిబదులుచెప్పిరి.

(817) ఒకఁడునదికిస్నానమునకుఁబోవుచుండెను. అప్పుడాయనకు నెవ్వరోయొకరు కొన్నిదినములనుండి సన్యాసియగుటకుఁ బ్రయత్నించుచున్నాఁడని చెప్పిరి. తక్షుణమాయనకేవిధమునో సన్యాసిజీవితముత్తమమైనదనితోఁచి సన్యాసియయ్యెను. ఇంటియొ

ద్దనుండివచ్చునపుడు పూర్తిగాఁగూడ దుస్తుల ధరింపకవచ్చెను- కనుక నిప్పుడు సన్యాసియై యాగుడ్డలతోనే వెళ్ళిపోయెను. తీక్ష్ణవైరాగ్యమునకు నిదియొక యుదాహరణ-

(818) ప్రసిద్ధుఁడైనయొక బ్రహ్మసమాజ మతస్థుఁడు శ్రీరామకృష్ణ పరమహంస పిచ్చివాఁడనియు, నాయనపిచ్చికి నెప్పుడు నొక్క విషయమునే యాలోచించుచుండుట కారణమనియుఁ జెప్పినాఁడు. ఈసమాజకునితోఁ దరువాత భగవాన్, "మీరు 'ఐరోపా' ఖండములోఁగూడనెల్లకొంతమంది యీ కారణమువలనఁ బిచ్చివారయిరని చెప్పియుంటిరి. ఆయొక్క సంగతియునేది? ఆత్మా? లేక ప్రకృతియా? ప్రకృతియైనట్లయిన దానిని సతతమాలోచించి పిచ్చివాఁడగుట యాశ్చర్యవిషయముకాదు. భగవంతుని నాత్మనుగూర్చి తలఁచుచుండిన నేలపిచ్చివాడగును? మీగ్రంథములిట్లుచెప్పనాయేమి?" అనిప్రత్యుత్తరమిచ్చిరి.

(819) ఒకమనుజుఁడు చేతిలోలాంతరుఁబట్టుకొని పోవుచుండును. దాని వెలుతురెవ్వరిమీదబడునో వారి నా మనుజుఁడుచూడఁగలఁడు. పరులా మనుజునిఁజూడవలయుననిన నాలాంతరు నాయినముఖమువంకఁ ద్రిప్పవలయును. అట్లే భగవంతుఁడందరినిఁజూడగలఁడు- కాని పరులాయనను గాంచలేరు- చూడగోరువారాయనయనుగ్రహము నేసంపాదించవలయును-

(820) గర్వము బూడిదకుప్పవంటిది- ఈకుప్పపై నీరుపోసిన నిగిరిపోవును. అట్లే గర్వితుఁడైనవాఁడెన్ని ప్రార్థనలుసల్పినను లాభములేదు-

(821) ఒకనదికలదు. దానికి నొక్కప్రక్క నొక బ్రాహ్మణుఁడుండువాఁడు- రెండవప్రక్కనున్న యొకగొల్లది యాబ్రాహ్మణునకుఁ బాలుఁబోయునది. నదినిదాటుటకుఁ దెప్పకొయ్యవచ్చుట యాలస్యమగుచుండుటవలన నాగొల్లది ప్రతిదినము వేళకుఁ దీసికొనివచ్చునదికాదు. ఒకపర్యాయము బ్రాహ్మణుఁ డాలస్యమగుచున్నందులకుఁ గోపము వహించి యాగొల్లదానిని దూషించనామె, "అయ్యా నేనేమిచేయుదును- ఇంటినుండి త్వరగా బయలుదేరుదును- కాని నది దగ్గిర వాలస్య మగుచుండు"నని బదులు చెప్పెను- ఈ ప్రత్యుత్తరమును విని తద్బ్రాహ్మణుఁడు, "ఓ గొల్లదానా! కొందఱు భగవన్నామమును దలఁచుకొని ప్రపంచసముద్రమును దాటుచుందురు- ఇక నీవీ చిన్ననదిని దాటలేవా?" యనియడిగెను. నదినిదాటుటకు సులభమార్గము నేర్చుకొంటినని సంతోషపడుచు నావెఱ్ఱిగొల్లది వెళ్ళిపోయెను- మరుసటిదినమునుండియుఁ బ్రాతఃకాలముననే పాలుతెచ్చిపోయుచున్నది- ఒకదినమున బ్రాహ్మణుఁడు 'నీవిప్పుడేమాత్ర మాలస్యము

(జేయక వచ్చుచున్నావెట్లు?" యని యడిగెను. దీనికి గొల్లది 'మీరు చెప్పినట్లు భగవన్నామమును దలఁచుకొని పడవయవసరము లేక నదిని దాటుచున్నా'నని బదులుచెప్ప నా మాటలయందు నమ్మకములేక నాయన 'నీ వెట్లు దాటుచున్నది నేనుఁగూడఁజూడవచ్చునా?' యని యడిగెను. అంతట నామె యాతనను వెంటఁదీసికొని నీటిమీద నడువసాగెను. ఆయన యామెతో నడువఁజాలక వెనుకఁజిక్కెను. కొంతకాలమునకు నామె వెనుకకుఁ దిరిగిచూచి 'ఇదియేమి? భగవన్నామమును నోటితోనుచ్చరించుచుండిరి. బట్టలుతడియునని భయపడి పైకెత్తుచుండిరి. మీరు పూర్తిగా నీశ్వరునిపై నాశించుకొని యుండలేర'ని వాక్రుచ్చెను. 'మనది'అని దేనినిఁదలఁచక సమస్తమును భగవంతునకు విడుచుట సంపూర్ణమయిన భక్తి యొక్క పరమరహస్యమైయున్నది.

(222) క్రొవ్వువత్తిదీపమును జూచి మనస్సునిల్పుట నేర్చుకొనవలయును. క్రొవ్వువత్తిపై ముందు మానసమును నిల్పవలయును. దాని వెలుతురుయొక్క లోపలిదయిన నీల భాగము కారణశరీరమునకుఁ బోలును. దృష్టినిదానిపైనుంచి యభ్యాసముఁజేసిన మనో నిశ్చలతయెక్కుడగును. ఈనీలభాగమునకుఁ బైనున్న భాగము సూక్ష్మశరీరమును, దాని పైనున్న భాగమునకు స్థూలశరీరమును బోలును.

(223) 'హిందూమతమునకును బ్రాహ్మమతమునకుఁగల భేదమేమి'యని ప్రశ్నింపఁ బడి శ్రీరామకృష్ణభగవాన్ బ్రాహ్మమతస్థునితో 'ఈరెండుమతములకునుగల భేదము సంగీతమంతకు దానిలో భాగమయిన యొకరాగమునకుఁగల భేదమువంటిది. బ్రాహ్మమతము బ్రహ్మమను సంగీతమం దొకరాగముతోఁ దృప్తిఁజెందునది. హిందూమతమునకు బ్రహ్మమంతయుఁ గల్గినఁగాని తృప్తిలేద'ని వచించెను.

(224) తనచుట్టు నేమియున్నది తెలిసికొనలేకఁ బ్రార్థనలో మునిగినవాఁడు తనజుట్టులోఁ బక్షులు గూళ్ళుఁగట్టుకొనినను గనుఁగొనలేఁడు. అట్టివాఁడే నిజమైనజ్ఞాని.

(225) ఒకపర్యాయము రామకృష్ణపరమహంసను నాయన శిష్యులలో నొకరు 'స్వామీ! నేను ప్రార్థనలసల్పుచుండినను దుష్టతలంపులప్పుడప్పుడు నాకుఁ బుట్టుచుండును. కోరికనుజంపుకొనుట యెట్లు'ని యడిగెను. అప్పుడు భగవాన్ 'ఒకడు కుక్కను బెంచుచుండెను. దానిని ముద్దాడును. ఆడించును. ఎత్తుకొనితిరుగును. జ్ఞానముఁ దెలిసినవాఁడొకఁడు శునకాధికారినిఁజూచి 'ఇదినీకుఁదగదు. కుక్కకై నీకాలమంతయు గడపకుము. అది క్రూరజంతువు. ఎప్పుడయిన నిన్నుగరవవచ్చున'ని మంచిమాటలతోఁ జెప్పెను. 'ఇకముందెప్పుడుఁ గుక్కనే ముట్టుకొన'నని కుక్కనుబెంచుచున్నవాఁడా

పలుకులువిని నిశ్చయించుకొనెను- కుక్క నీమాటలఁ దెలుసుకొనలేదుగనుక బలుపర్యాయములు తనయధికారియొద్దకుఁబోవుచుండెను. ఈతఁడనేకతడవలు దానిఁగొట్టెను. కనుక నదివచ్చుట మానుకొనెను. నీయొక్క స్థితియునట్టిదియే. దుష్టతలంపులు త్వరగా విడిచిపోవు. అయినను మించిపోయినదియేమియులేదు. దుష్టతలంపులుపుట్టినను నీవు వానిని స్థిరముగా నుండనియ్యకుము. నీ మనస్సు చెంతకువచ్చినప్పుడెల్లఁ దరిమివేయుము. కొంతకాలమునకు నవి వచ్చుటయేమానుకొనున'ని వాక్రుచ్చెను.

(826; ఇక్కాలపువిద్య నేర్చుకొనిన యొక పెద్దమనిషి గృహస్థులకుఁ బ్రపంచకవిషయాసక్తి కలుగుటకువీలులేదని భగవానునితో వాదించుచుండెను. అప్పుడు భగవాన్ 'ప్రస్తుతకాలమునందు గృహస్థులుగానుండి విషయాసక్తులుగానివారెవ్వరో నీకుఁదెలియునా? ఏమైననివ్వుమని యొకబీదవాఁడొక విరాగియింటికివచ్చి యడిఁగిన నీయనభార్యచేతిలో ధనముఁబోసియొక్కఁగుడ్డిగవ్వనైనఁగలిగియుండక 'ఓబీదవాఁడా! నేనుధనముముట్టను. పగులనకుగుటయుండేల నీకాలమునంతయు వృధాపుచ్చుచున్నావ'ని చెప్పెను. బీదవాఁడువదలిపోక నడుగుచుండ విసుకుతోచి భార్యయొద్దకుఁబోయి యావిరాగి 'కాంతా! ఒక బీదవాఁడువచ్చి బిచ్చమడుఁగుచున్నాఁడు. ఆయన బ్రాహ్మణుఁడట. రేపురమ్మని చెప్పినాను. కనుక వానికి నొక్కరూప్యమునయిన నివ్వవలయు'నని చెప్పెను. ఈమాటలు తన శ్రుతపుటములఁజొచ్చిన వెంటనేభార్య 'ఏమి! నీదాతృత్వము. రూప్యములు రాళ్ళనుకొంటివా?'యని యదిరిపడిన భర్త దీనస్వరముతో, 'పాపము కటికబీదవాఁడట అట్టివానికి నొక్కరూప్యమునకుఁ దక్కువయిచ్చినఁ బాగుగనుండునా?'యని మనవిచేసుకొనెను. తుదకు నాయనభార్య కోపముఁదాల్చి, 'ఇవిగో నాయొద్ద రెండణాలు కలవు. ఇష్టమున్నయెడల వీనినిఁదీసికొని యివ్వుము. లేకపోయిన వెళ్లిపొమ్మనిచెప్పు'మని చెప్పెను. సతీమణివాక్యముల కెదురాడఁజాలని యావిరాగి యారెండణాలనుగైకొని మరునాఁడు తద్బ్రాహ్మణునకిచ్చివేసెను. కనుక మీరుచెప్పుచున్న విరాగులందఱు భార్యయాజ్ఞల శిరసావహించి వంగివంగి సలాములుఁజేయువారైయున్నారు. వారు వారనుకొనునట్లు విరాగులుకారు గాని రాగులైయున్నారు.

(827) తెలిసియైనను దెలియకనైనను, జ్ఞానముఁగలిగియైనను గల్గకయైనను భగవన్నామమునుఁదలఁచిన ఫలము తప్పకఁగలుఁగును- నదికివెళ్ళి స్నానముఁ జేసినవాఁడు స్నాతయగును- నదిలోనికిఁద్రోయఁబడువాఁడు స్నాతయగును- నిద్రఁబోవుచుండగా నీరు పైఁజల్లఁబడినవాఁడుగూడ స్నాతయగును-

(828, మానవదేహము కుండవంటిది- 'మనస్సు, జ్ఞానము, బుద్ధి' ఇవిక్రమముగా

గుండలోనుంచఁబడిన 'నీరు, బంగాళాదుంప, బియ్యము' వంటివి- వీనినిగల్గినకుండను ని ప్పుపైఁబెట్టిన లోపలిపదార్థములన్నియు వేడిపట్టును- అప్పుడు దానిలోఁ జెయ్యిఁబెట్టి నఁ గాలిపోవును- ఈవేడిమి కుండదికాదు- 'బియ్యము, నీరు, దుంప' వీనికి సంబంధించి నదికాదు- మనుజునియందుఁగల బ్రహ్మముయొక్క-శక్తియు నటువంటిదియే- ఈశక్తిమన స్సును, జ్ఞానమును, బుద్ధిని దానిదాని పనిఁజేయునట్లుచేయును- అది యేపనినిఁ జేయనపు డవిగూడఁ బనిఁజేయమానును-

(329) వాననీ రింటిమీదఁబడి పులినోరువలెనున్న గొట్టముగుండఁ గ్రిందికిఁ బడు చున్నది- అయినను నిది యాకాశమునుండి పడుచున్నట్లే యెంచఁబడునుగదా- అట్లే ఋషులు మహాఋషులుచెప్పు నుపదేశములు వారి స్వంతమయినవానివలెనగుపడినను న వి వారివికావు- నిజముగ నవి భగవద్వాక్యములు-

(330) ఒంటరిగానున్నను బరులు నన్నుచూచుటలేదుగదాయని పాపకార్యములఁ జేయక నీశ్వరుఁడు కనిపెట్టియున్నాఁడని తలఁచి పాపకృత్యములనొనరింపనివాఁడు నిజ మయిన మతముఁగలవాఁడు- అడవిలోనున్న పుడొకయాతి సుందరమయినస్త్రీ యగుపడిన ను భగవంతుఁడు నన్నుఁజూచుచున్నాఁడని తలఁచి యామెవంక మొగమునుగూడఁ ద్రి ప్పనివాఁడు నిజమయినమతముఁగలవాఁడు- ఎవ్వరునులేనిగృహములో బంగారపు మూట యగుపడినను దానిఁదీసికొనఁదలఁచనివాఁడు నిజమయిన మతముఁగలవాఁడు- ఇతరు లను కొనుటకై మతముఁగల్గినట్లు నటించువాఁడు యథార్థమతమునుగలవాఁడుకాఁడు- శాం తము, రహస్యము నిజమతముయొక్క-చిహ్నములు 'నటన, గర్వము' ఇవికానేరవు-

(331) వెదురుబద్దలతోఁగట్టఁబడిన మావులోగుండనీరు మెఱయుచుఁ బ్రవహించు చుండును, ఇందువలనఁ జిన్నచేపలు సంతోషముగా నందులోఁబ్రవేశించును, కానియం దులోఁజిక్కు-కొనిపోయి బయటికిరాలేవు. అట్లే వట్టిభ్రమచేత నాకర్షింపఁబడి మూఢు లు ప్రపంచమనువలలోఁ జిక్కు-కొనిపోవుదురు, వలలోపలికిఁబోవుట బయటికివచ్చుటకం టెఁ దేలికకనుక లోకములోనుండి విషయాసక్తుఁడగుటఁ దేలిక, విరాగియగుటకష్టము.

(332) తడిసినదినిప్పుపుడక యెంతరాచినను మండదు, కాని పొగబారిపోవును. ఎం డియున్న పుడక తక్షణమంటుకొనును. నిజమయినభక్తునిమన స్సెండుపుడకవంటిది. భ గవన్నామము వినఁబడినమాత్రమున నాయనప్రేమ బయటికివచ్చి ప్రజ్వలించుచుండును, కామము, విషయాసక్తిఁ గలిగినవానిమనస్సు తడిసినదినిప్పుపుడకవంటిది, ఇట్టి మనస్సుండి నవానికి యెన్నిపర్యాయములు భగవంతునిఁగూర్చి చెప్పినను బ్రేమయనుమాట పుట్టదు- భక్తి యంకురించదు,

(883) భగవంతుఁడు స్వతంత్రుఁడును శాశ్వతబ్రహ్మమును జగత్పితయు నై యుం న్నాఁడు. సముద్రము నెట్లు భేదింపలేమో యట్లే భగవంతునిఁగూడ భేదించలేము. పరబ్రహ్మమును దెలిసికొనుట కష్టము. కాని సముద్రములో మునిగిపోవుచున్నవానిని బయటికిలాఁగిన వానికెట్లుండునో యట్లే భగవంతునిఁదలఁచుకొనువానికిఁ ద్వరగా మనస్సునకు శాంతికలుగును.

(884) భక్తునిమనస్సునందుఁగల్గు తలంపులకేలఁ దుదయుండదు? ఒకభాగ్యవంతునకు వడ్లకొట్టుండును. దానిలోఁగలధాన్యము నొకకోమటి కొలుచుచుండును. ఈతఁడు దీనునివలె వడ్లను తానేతెచ్చుకొనిపోసుకొనక నూరకఁగొల్చుచుండును. దాసీయొకతె వడ్లనుదెచ్చిపోయుచుండును. అట్లే భక్తునిమనస్సునందు తలఁపులను భగవంతుఁడుకలిగించుచుండును. గర్వితుఁడై తనదేహము నేయాశించుకొనియున్నవాఁడు పుస్తకములలోమాటలను దలఁచుచుండును. కనుక నివి త్వరలోమునిగిపోవును. ఈతఁ డొక చిన్నకొట్టును బెట్టుకొనినవానివంటివాఁడు.

(885) స్త్రీలందరు 'భగవతి' యనఁబడు దేవియొక్క భాగములేకనుక నందఱు కాంతలు మనకుఁ దల్లులైయున్నారు.

(886) 'మాయ' యననేమి? ఆత్మజ్ఞానాభివృద్ధికినడ్డగించు 'కోరిక' యే మాయ.

(887) భర్తచనిపోయినను బతివ్రతయె ట్లాయన నేకలుసుకొనియుండునో యట్లే యిష్టదేవతనునమ్మకొనినవాఁడుతప్పక భగవంతునిఁజేరును.

(888) సీసమును బాదరసములోవేసినఁ గరగిపోవునట్లు జీవుఁడు బ్రహ్మమను సముద్రములోమునిఁగినఁ దాను భగవంతునకు వేఱైయుండుటఁ బోఁగొట్టుకొనును. అనఁగా భగవంతునిలోఁ దానుగూడఁ గలియును.

'లోకవ్యవహారము, విపత్తులు, దుఃఖములు' మొదలగువానిచేత నీవు బాధపడకుము. ప్రతియుక్తకాలమునం దప్పటికిఁ గావలసిన పనిఁజేయుము.

'పరబ్రహ్మ' మను సముద్రమునుండివచ్చుగాలి దానిననుభవించువారికి నందటికిని ఫలమునిచ్చును. దీని ననుభవించిరియే పూర్వమా సనకసనాతనాదులు సుఖంబుఁగాంచిరి. నారదుఁడాసముద్రమును గొంచెముదూరమునసుండిచూచుటవల్లనే తనకుఁదాను మఱచిపోయి పిచ్చివానివలెనెప్పుడు హరికీర్తనలఁబాడుచు లోకములందుఁ దిరుగు

చుండును. పుట్టుఋషియైన శుకదేవుఁడు మూఁడుపర్యాయములుమాత్రమే యీ పరబ్రహ్మాఖ్యసముద్రజలమును రుచిఁజూచి యమితానందముఁబొంది పిల్లవానివలెఁ బ్రవర్తించుచున్నాఁడు. గొప్పయుపదేశకుఁడయిన మహాదేవుఁడు తత్సముద్రమునుండియే మూఁడు దోసిళ్ళనీరుఁద్రాగి మహానందమువలన మత్తెక్కిపడియున్నాఁడు. అట్టి మహామహిమఁగల సాగరముయొక్క లోతు నెవ్వరుకనుఁగొనఁగలరు?

(841) 'స్వాతంత్ర-విజ్ఞాన-ముక్తి-సచ్చిదానంద' యనఁబడు చెట్టుపైఁ 'గృష్ణులు-రాములు- బుద్ధులు- క్రీస్తుల'నఁబడు పండ్లగుత్తులుకలవు. వాటిలో నప్పుడప్పు డొకరిద్దఱువచ్చి లోకములో ననేకమార్పులఁజేయుచుందురు. ఇట్లేపరిణామముకలుగుచున్నది

(842) ఒకపర్యాయము భగవాన్ తనశిష్యులలో నొకరిఁజూచి 'ద్రాక్షరస మొకగిన్నెలోఁగలదు. ఈఁగలువచ్చికొన్ని యంచుపైవ్రాలి ద్రాక్షరసమును ద్రాగును. కొన్ని యందులోఁబడిదొర్లును. కొన్నిమునిఁగిపోవును. అట్లే నీవుఁగూడ సచ్చిదానందరసమను నంచుపైనుండిత్రాగి లేచిపోయెదవా? లేక నందులోఁబడి యనుభవింతువా' యని యడిఁగెను. ఈప్రశ్ననువిని శిష్యుఁడు, 'అంచుపైనుండి త్రాగివెళ్ళిపోవుట నాకిష్టము. అందులోఁబడి మునిఁగిచచ్చిపోవుట నాకిష్టమయినసంగతి కాద'ని ప్రత్యుత్తరమిచ్చెను. ఇది విని గురువు, 'నీవెంతపిచ్చివాఁడవు. అమృతములోఁబడినవారు చనిపోవుదురా? చనిపోరు కాని మృత్యుంజయులగుదురని' తిరిగివాక్రుచ్చెను.

(843) జీవాత్మకు భగవంతునిలో లీనమగుట సాధ్యమయినకార్యము. కాని 'ఆయనయు నేను నొక్కటియే'యని మనస్ఫూర్తిగా దలఁచవలయును. ముసలివాఁడయిన సేవకుఁడు కాలక్రమమున నింటివారితో నొకఁడుగా నెన్నుకొనఁబడును. ఆతనిపనులకు మెచ్చుకొని యధిపతి 'నాసేవకుఁడు నేను వేఱుకాద'ని తలఁచి తన గౌరవాసన మాతనికి నివ్వవచ్చును. నాసేవకుఁడు నేను నొకటియే. ఆతఁడు నాయాజ్ఞల నెట్లుచేయుచున్నాఁడో నేనునువానియాజ్ఞల నట్లుచేయువలయు'నని చెప్పుచు నధిపతియైనవాఁడు తన ముసలి సేవకుఁడు భిడియముచేఁ గొంచెము వెనుకకుఁదగ్గినను బలవంతముగనయిన నాతనినిఁ దన పీఠముపైఁ గూర్చుండఁజేయును. విశేషకాలము భగవంతునకుసేవఁజేసి యాయనలో లీనమైనవారిస్థితియు నిట్టిదియే. ఈశ్వరుఁడిట్టివారికి దన సుగుణములను గీర్తినిఁబ్రసాదించి తనసింహాసనముపైఁ గూర్చుండఁబెట్టుకొనును.

(844) నీటివడియాగదుకనుక వంతెనలోఁబ్రవేశించిననీరు తప్పక బయటికివచ్చుచుండును. ధనము గూడఁబెట్టలేనివారియొద్ద నది నిలువఁబోవుచుండును.

(345) అవతారపురుషుఁడు భగవంతుఁడు పంపినమానవదూత. ఈతఁడు గొప్పరాజుయొక్క రాజప్రతినిధివంటివాఁడు. పరగణాలలోఁగలహమేదయినఁ జరిగినదానిని విచారించుటకు రాజాజ్ఞవలన రాజప్రతినిధి పోవునట్లు లోకములో మతములు భ్రష్టగుచున్న సమయమున వానిని నిల్పి రక్షించుటకు భగవంతుఁడవతారపురుషులఁ బంపుచుండును.

(346) అవతారపురుషుఁ డెప్పుడొక్కఁడేయైయున్నాఁడు. జీవమను సముద్రములోనున్న భగవంతుఁడొకచోటఁ దేలి కృష్ణుఁడనుపించుకొనుచున్నాఁడు. మఱియొకచోటఁ దేలి క్రీస్తనిపించుకొనుచున్నాఁడు. ఇంకొకస్థలమందుఁ దేలి మఱియొకనామమును ధరింపుచున్నాఁడు. కనుక నవతారపురుషుఁడొక్కఁడే.

(347) 'మాయ'యే బ్రహ్మమును వెల్లడించును- 'మాయ'యొక్క సహాయము లేకఁ బరబ్రహ్మము నెవ్వరు తెలుసుకొనఁగల్గుదురు? భగవచ్ఛక్తినిఁ దెలిసికొనక భగవంతుని నెవ్వరుఁ దెలిసికొనఁజాలరు-

(348) 'హరి'యన 'మనస్సును హరించువాఁడ'ని యర్థము- 'హరిబల్' యన 'హరియే మనకుబలమ'ని యర్థము-

(349) ఓ బోధకుఁడా! నీకధికారచిహ్నముకలదా? రాజధికారమును వహించి రాజ్యమునందుఁగల కలహములనణఁచి యెట్లు ప్రజలవలన గౌరవింపఁబడునో యట్లే నీయుద్దేశము నెఱవేఱవలసియున్న నీశ్వరప్రేరేపితజ్ఞానమనఁబడు చిహ్నమును నీవు కలిగియుండవలయును. అదినీకుఁ గలుగనంతవఱకు మాటపోకడయేగాని లాభముండనేరదు-

(350) పరబ్రహ్మస్వభావ మెట్టిది? పరబ్రహ్మము నిర్గుణమయినది, నిశ్చలమైనది, యభేద్యమయినది, మేరునగసమాన దృఢత్వముఁగలది

(351) పూర్వమందున్న ఋషులు, యోగులు పూర్వకాలపురాజులుపయోగించిన నాణెములవంటివారు- ఈనాణెములెట్టి దినములలో చెల్లవో యట్లే పూర్వఋషులు యోగులు బోధించినవిషయములిప్పుడుపయోగముకావు- ఈకాలమునకు నేను భగవత్ప్రేరేపకుఁడనయి పల్కుచున్నాను. నామాటలను నమ్మువారు త్వరలో రక్షింపఁబడుటకు నర్హులగుదురు-

(352) మత్స్యభక్షకులు చేపతోకను దలను విడిచి పెట్టి మధ్యభాగమును దినగోరుదురు. అట్లే శ్రుతిస్మృతులయందలి సూత్రములు మనకిప్పుడు పనికివచ్చునట్లు చేసుకొనవలయును-

(853) ఒకానొకప్పుడు భగవాన్, "నాకుమాలలోనుండు పుష్పములతోఁ బని లేదు. ధారముమాత్రముకావలయును. ప్రపంచములోఁగల వస్తువులన్నియు నా కవసరము లేదు కాని వానినన్నిటినిఁ గల్పుచున్న "సూత్రాత్మక" నాకుఁగావలయును-" అని చెప్పియున్నాఁడు-

(854) దీపమునకుఁగాంతియిచ్చుట స్వభావము. కొందరుదానివలన నన్నము వండుకొనెదరు. కొందఱు దానిమసితో ముద్రలవేయుదురు. కొందఱు దానివెలుతురు సహాయమువల్ల దైవగ్రంథములఁ జదువుదురు. అట్లే కొందఱు భగవన్నామమును స్మరించి ముక్తినిఁబొందఁగోరుదురు. దుష్టకార్యములఁజేయుటకుఁ గొందఱు, నిట్లనేకవిధములఁ బలుయుద్దేశములతో లోకములోనుండుజనులు భగవన్నామస్మరణఁజేయుదురు. ఈశ్వరుని పవిత్రనామము పరిశుద్ధమై యెప్పుడునుండును-

(855) తోతాపురి, "ప్రతిదినమును రాగిబిందెను తోమకఁబోయినఁ దుప్పుపట్టును- అట్లే మనుజుఁడు ప్రతిదినమును భగవన్నామమును దల్పకుండిన నపరిశుద్ధుఁడగును" అని చెప్పెను. ఒకపర్యాయము శ్రీరామకృష్ణ పరమహంస, బిందెను బంగారముతోఁజేసినయెడలఁ బ్రతిదినముఁ దోమనవసరములేదు ముక్తినిఁబొందినవానికి, నీప్రార్థనలతో తపస్సులతోఁ బనిలేదు.

(856) "పండు, జెరడు, పీచు, కొబ్బరి"ఇన్నియు నొక్క కొబ్బరిచెట్టువలననే కలుగుచున్నవి- అట్లేయొక్క భగవంతునినుండియే చరాచరాత్మకమైనట్టి సమస్తసృష్టియు నేర్పడుచున్నది-

(857) సామాన్యులు మతమునుగూర్చి యెన్నియోవిషయములఁ జెప్పుదురు. కానివారిలో నొక్కవిషయమునుఁగూడ ననుభవమువలనఁ జెప్పువారులేరు. జీవితమంతయు ననుభవించుటయందుఁ గడపినవాఁడయ్యు జ్ఞాని యొక్కమాటనుగూడ మాట్లాడడు.

(858) మాయకుఁబ్రహ్మమునకుఁగల సంబంధము కదలుచున్న పామునకుఁ గదలని పామునకుఁగల సంబంధమువంటిది. పనిఁజేయుచున్న శక్తి మాయయనఁబడును. దాగియుండి పనిఁజేయనిశక్తిని బ్రహ్మమందురు.

(859) పరబ్రహ్మము నిశ్చలముగానుండు సముద్రజలమును, మాయకదలింపఁబడిన సముద్రజలమును బోలును.

(860) అగ్నికి దానియందుఁగల మంటకు నెట్టి సంబంధముకలదో యట్టిసంబంధము బ్రహ్మమునకు శక్తికిఁగలదు.

(861) దేవుఁడాకారుఁడు నిరాకారుఁడు. ఆకారానాకారములనుమించు పదార్థముగూడ భగవంతుఁడేయైయున్నాఁడు. 'సమస్తము నేనే'యని యాయనకొక్కనికి మాత్రము తెలియును.

(862) పాముకుఁ, బాముకుబుసమునకు సంబంధములేనట్లు దేహమునకు నాత్మకు సంబంధములేదు.

(863) పాదరసముఁబూసిన యద్దములో మనము ప్రతిబింబమును జూడఁగలిగినట్లు పవిత్రతయు, నాత్మశక్తియుఁగల మనస్సునందు సర్వశక్తుఁడైన యీశ్వరుని రూపము ప్రతిఫలించును.

(864) " 1 అన్నదమ్ములు పగ్గముఁదీసికొని పొలముఁబంచుకొనుచు 'నీభాగము నాద'ని పోట్లాడు సమయమునందు 2 రోగి చనిపోవుచుండునప్పుడుఁ గూడ వైద్యుఁడు 'నేనుగదా యీరోగమును గుదుర్చునది'యని చెప్పునప్పుడు." ఈ రెండుపర్యాయముల యందు భగవంతుఁడు నవ్వును.

(865) కోరలలోవిషమున్నను బామునకది విషముకానేరదు. పరులకది విషముగానుండును. అట్లే భగవంతునియందు మాయకలదుగాని దానిలో నీశ్వరుఁడు చిక్కుపడఁడు జగత్తుఁ చిక్కుపడును.

(866) పిల్లితనపిల్లలను బండ్లతోఁబట్టుకొనును. కానియెలుకలనట్లే పట్టుకొని నవుదవిచచ్చును. అట్లేమాయ యితరులను నశింపఁజేసినను భక్తులకు హానిఁజేయఁదు.

(867) త్రాడుకాలిపోయి పూర్వాకారముఁ గల్గియున్నను బంధించుటకుపయోగపడనివిధమున బంధవిముక్తుఁడైన మానవుఁడు తనయహంభావత్వముఁ గుచ్ఛితముఁ బోఁగొట్టుకొనియుండును.

(869) గిన్నెక్రింద మంటయున్నంతవఱకుఁ దానిలోనున్నపాలుంకాగును. మంటనుదీసినపుడు తిరిగి యెప్పటివలెనుండును. అట్లే యోగాభ్యాసముఁ జేసినంతవఱకే ప్రారంభకునికి నుత్సాహముండును. కానిదానినినాపివేసినతరువాత నా యుత్సాహ మంతయు నణగిపోవును.

(870) భాగ్యవంతుఁడొకఁడు కార్యదర్శి నేర్పఱచుకొని తనయింటి వ్యవహార మునంతయు నాయనకు నొప్పగించెను. ఈకార్యదర్శి, "ఇదియంతయు నాయాస్తి, యి దినాయిల్లు, తోటలన్నియు నావి" యని తలఁచుచు గర్వముఁగల్గి నడచుచుండువాఁడు. ఈతని యధికారికి నొకతోటలో నొకగుంటకలదు. 'దీనిలోఁ జేపలబట్టవద్ద'ని యధికారి కార్యదర్శితో ననేకపర్యాయములు చెప్పెను. కాని యీమాటల సరకుసేయక నొకదిన మునఁ గార్యదర్శి యొకచేపనుబట్టుకొనెను- ఇంతలో నధికారివచ్చి తన కార్యదర్శికూడ ని కార్యమును జేయుచుండుటఁజూచెను- అంతట నా యధికారి 'ఈతఁడు నమ్మఁదగి నవాఁడు కాఁ'డనితలఁచి యగౌరవించి దాచుకొనిన ధనమంతయు లాఁగుకొని పాతరసా మగ్రిఁ దీసికొని కార్యదర్శినిఁ బంపివేసెను.

(871) కొన్నిచేపల కొక్కవరుస యెముకలుండును. కొన్నిటికి ననేకవరుసల యెముకలుండును. ఎన్నియున్నను వానిఁదినువారు వానిలోనుండు యెముకలనన్నిఁటినిదీ సివేయుదురు. అట్లే యెక్కువపాపముఁగలవారు కొందఱు తక్కువ పాపముఁ గలవారు కొందఱునైయున్నారు. ఈశ్వరానుగ్రహ మందఱిని సమముగా యుక్తకాలములందుఁ బరిశుద్ధులఁ జేయుచుండును.

(872, భక్తిమార్గమునఁ గొంతవఱకుఁబోయిన తరువాత భక్తుఁడు భగవంతుఁడా కారుఁడని తెలుసుకొనును. మఱికొంతదూరముఁబోయిన తరువాత నిరాకారుఁడని యె ఱుంగును.

(873) తెల్లగుడ్డమీద నొకచిన్ననల్లని మచ్చయున్నను స్పష్టముగ నగుపడును. అట్లే పరిశుద్ధుఁడైనవాని ప్రవర్తనయందొక్క చిన్నతప్పగుపడినను నది విస్పష్టముగ నగు పడుచుండును.

(884) అకారుఁడయిన యీశ్వరుఁడు మననేత్రములకు నగుపడును. మనమాయి నతో మనమిత్రునితోవలె మాట్లాడవచ్చును. ఆయనను దాకవచ్చును.

(875) కఠినపుమంచైనను దేహములో మిళితమగురీతి నీవుభగవంతునిలోఁ గలపి పొమ్ము.

(876) ఒకపెద్దరాజును జూడవలయుననిన నాయన వాకిలివాండ్లతో నాయన యొద్దనుండువారితో స్నేహముఁజేసి వారిదయ సంపాదించుకొనవలయును. అట్లే భగవ త్సన్నిధానమునకుఁబోవఁగోరువాఁడు విశేషభక్తిఁగల్గి యుండవలయును. అనేకమందిభ క్తులను సేవింపవలయును- సజ్జనసాంగత్య మగత్యముగాఁజేయవలయును-

(377) "హేలాకాచ"ను దినుట తోటకూరదినుటవంటిదికాదు. చెఱకుగడ ముక్కనుదినుట మిఠాయిదినుట కాదు. ఏలయనిననవి యారోగ్యమునకు హానికరమైనవికావు. జబ్బుగానుండినవారుఁగూడ వానినుపయోగింతురు. అట్లే 'ప్రణవము' దేవుని స్వరమును దెలుపునదికాని వట్టిమాటకాదు. ఆవిధముననే పవిత్రముగానుండుటకుఁ బ్రేమఁగల్గియుండుటకుఁగోరుట సామాన్య కామములవంటిదికాదు.

(378) లకుముకిపిట్ట నీటిలోమునిఁగినను దానికి నీరంటుకొనదు. అక్కరణి మహాఋషిలోకములోనుండినను లోకమాయకు నంటుకొనడు.

(379) మనోనిశ్చలతను భంగపఱచునోపు యాహారమును భక్షింపఁదినఁగూడదు.

(380) "పంచదార, ఇసుక" ఈరెంటినిఁగల్పినను జీమ యిసుకను ద్రోసివేసి పంచదారను గ్రహించును. అట్లే పరిశుద్ధులయిన పరమహంసలుఁగూడఁ జెడుగునుండి మంచిని గ్రహింతురు.

(381) చిన్న చిన్న గింజలను ద్రోసివేసి పెద్దగింజలఁబట్టుకొనుట జల్లెడస్వభావము. అట్లే మంచినివిడిచి చెడుగునవలంబించుట దుష్టుల స్వభావము.

(382) తేలికగనుండి నిరుపయోగములయిన పదార్థములఁద్రోసివేసి బరువుగానుండి యుపయోగముగానుండు పదార్థములఁగలిగియుండుటచేత (Winnowing basket) యొక్క స్వభావము. పవిత్రహృదయములన్నియు నిట్టివియే.

మేఘచ్ఛిన్నము గాక నిర్మలముగనుండు యాకాశమునందకస్మాత్తుగ నొకమేఘముగపడి సూక్ష్మమగుచీకటిఁ గ్రమ్మఁజేసి తరువాత వాయువువలనఁగొట్టుకొనిపోవును. మాయగూడ నిట్టిదియే. అంతలో మనోవిజ్ఞానమునుగప్పి సమస్త దృశ్యప్రపంచమును గల్పనఁజేసి యీశ్వరుని యుచ్ఛ్వాసబలమువలనఁ జెల్లాచెదరై పోవును.

(384) ఒకఁడొక సాధువుయొద్దకు వెళ్ళి, 'నా కుమారునకుఁ జబ్బుగా నున్నది. మందివ్వవలసినద'ని యడిఁగెను. సాధువీతనిని మఱుసటిదినమున రమ్మనియెను. మఱునాఁడీతఁడు వెళ్ళి యడుగఁగా సాధువు, "పిల్లకు మిఠాయిఁబెట్టవద్దు. జబ్బప్పుడు త్వరలోఁబోవును." అని చెప్పెను. అంతటఁబిల్లతండ్రి, "అయ్యా! ఇదిమీరునాకు నిన్ననే చెప్పవచ్చునుగదా'యనిన సాధువు, "నిజమే, నిన్ననే చెప్పవచ్చును. కాని నిన్న నాయొద్దఁ జాలపంచదారకలదు. అదినీపిల్లచూచి, 'యీతఁడుపరులను మిఠాయిఁదినవద్దని చె

ప్రీతానుదానిని బాగుగఁదినుʼనను కొనును. అందువల్ల నేనునిన్నుఁ జెప్పలేదʼʼని బదులు చెప్పెను-

(885) రాజును బ్రియునిగాఁగల్గిన స్త్రీలలామము ముష్టియెత్తువాఁడిచ్చు కట్నమును గ్రహింపదు- అట్లే భగవంతునిఁజూడఁగల్గిన మనస్సు ప్రపంచమందలి వస్తువులను జూడఁగోరదు.

(886) పటికబెల్లమును దినువాఁకి బెల్లముఁదినుట్లకు నిష్టముండదు. దివ్యమందిరములలోఁ బండుకొనువారు మురికిగనుండు గుడిసెలలోఁ బండుకొన నిచ్ఛయింపరు- ఆ విధముననే శాశ్వతమైన సచ్చిదానందము ననుభవింపనేర్చినవారికి నీప్రపంచమందున్న సామాన్యసుఖములు రుచింపవు

(887) పాపము పాదరసమువంటిది. కనుకదానిని దాచిపెట్టుటకష్టము.

(888) ఉల్లిపాయలను దినిన నుల్లిపాయలవాసనకొట్టును- దోసకాయలఁదినినదోసకాయలవాసనకొట్టును- అట్లే మనస్సునం దేమియున్నది మాటలవలనఁ గనుఁగొనవచ్చును-

(889) 'సమాధియం దున్నప్పుడు మీకుప్రపంచ విషయములు జ్ఞాపకముండునా' యని యడుఁగఁబడి భగవాన్, ''సముద్రములోఁ బర్వతములు గుట్టలు, గుహాలులోయలు జలములోఁగలవు. కానిపైనుండి చూచువారికి నివియన్నియు నగుపడవు- తద్విధమున సమాధియం దున్నపుడు 'సచ్చిదానందా'ఖ్య సముద్రము కనఁబడును- కాని యీతని విజ్ఞానమంతయు నాయనలో దాగియుండును-

(890) న్యాయవాదినిఁ జూడగా నేమనకు స్వాభావికముగ నేరములు వ్యాజ్యములు జ్ఞాపకమువచ్చునట్లు పరమభక్తునిఁజూచినపుడు మానవునకు దేవునిఁగూర్చి స్వర్గమునుఁగూర్చి కొన్నివిషయములు జ్ఞప్తికివచ్చును-

(891) వేదములను బురాణములను జదువవలయును వినవలయును- కాని చదివి విని యాతంత్రములప్రకారము నడచుకొనుట ప్రధానము- అట్లే హరినామమును నోటితో నుచ్చరింపవలయును- చెవులతో వినవలయును- నిజముగాఁగొన్ని జబ్బులకు మందునులో పలికిఁ బుచ్చుకొనవలయును- ఇంతేగాక పైకిఁగూడఁ గొన్నిమందుల నుపయోగింప వలయును,

(892) ప్రతిమనుజుఁడును భూతదయ విషయములోఁ గ్రైస్తవునిగను బహిర్వ్యవహారములఁ జక్కఁగనుంచుకొనుటయందు మహమ్మదీయునిఁగను, సమస్తభూతములకు ధర్మముఁ జేయుటయందు హిందువునిగ నుండవలయును.

(893) నీటిపైనుండు మురికిని మస్తును గొంచె మొకప్రక్కకు నదిమినఁదిరిగి పైకి వచ్చుచుండును. వెదురుగడలతోఁ జక్కఁగా నదిమినయెడల దిరిగి రానేరదు. అట్లే మాయ నొకవిధముగ నణచివేసినఁ దిరిగివచ్చి మనలను బాధించుచుండును. కాని మనస్సునందు భక్తిజ్ఞానములు పూర్తిగ నుంచిడిన మాయ తిరిగిరానేరదు. నిజముగ మానవులకు భగవంతుఁడు దర్శనమిచ్చుటకు నిదియే విధము.

(894) సంతతము హరికీర్తనఁ జేయుచుండుయింటికి దయ్యమువచ్చి బాధింపదు.

(895) ఒకకప్పయొక భావిలోఁగలదు. అదిదానిలోనే పుట్టి దానిలోనే పెరుగుచున్నది. ఒకదినమున నదివలలోఁ సముద్రములో నివసించుచున్న కప్పయొకటివచ్చియా భావిలోఁబడెను. అప్పుడు భావికప్ప, 'నీవెక్కడనుండి వచ్చినా'వని క్రొత్తకప్ప నడిఁగెను. ఇది సముద్రమునుండివచ్చితినని చెప్ప బావికప్ప 'సముద్రము! అదియెంతపెద్దదిగా నుండును?' అని యడిగెను. చాలా పెద్దదియని ప్రత్యుత్తరమువిని బావికప్ప కాళ్ళుబాఁరజాచుకొని, 'ఇంతపెద్దదిగానుండునా'యనెను. రెండవకప్ప యింకఁజాలఁ బెద్దదిగా నుండునని చెప్పగాఁదిరిగి భావికప్ప 'మాబావిలో నొకప్రక్కనుండి మఱియొకప్రక్కకు దుమికి, 'ఈ నాభావియంత పెద్దదిగానుండునా'యని ప్రశ్నించెను. అప్పుడు క్రొత్తకప్ప, 'స్నేహితుఁడా! అంతపెద్దసాగరమును నీచిన్నభావితో నేలబోల్చెదవు?' యని యుత్తరమిచ్చెను. తుదకు భావికప్ప, ''నాభావికంటె లోకములోఁ బెద్దదేదియులేదు. ఇదియబద్ధమాడుచున్నది. కనుకదీనిని వెళ్ళఁగొట్టవలయు'నని యనుకొనెను. చక్కగా వికసించని మనస్సుఁగలవానిస్థితి యొకచిన్నభావిలోఁ గూర్చొని ప్రపంచము భావికంటెఁ బెద్దదికాదని తలఁచు కప్పస్థితివంటిది.

(896) 'భక్తి, నమ్మిక' ఇవికలవానికి నన్నియుఁగలవు. ఇవిలేనివానికి సమస్తముఁగావలయును.

(897) భరక్తి జబ్బులగుదుర్చును. భక్తివలన జబ్బులగుదుర్చువారు రోగులచేత 'నాకు జబ్బులేద'ని మనస్పూర్తిగా చూఁడుపర్యాయము లనిపించెదరు. రోగి యిట్లు మనస్పూర్తిగ జబ్బులేదని చెప్పినతరువాత నిజముగా జబ్బుండనేరదు. అట్లే భగవంతుఁడులేఁడని యెప్పుడుఁదలఁచి చెప్పువానికి యథార్థముగా భగవంతుఁడుండఁడు.

(398) ఒకమనుజుఁడు మైదానములోనిల్చి చిన్నదిగనుండుగరికను పెద్దదిగనుండు వటవృక్షమునుఁజూచి 'ఈ వటవృక్ష మింత పెద్దదిగ నున్నదియేమి? గరిక యింత చిన్నదిగా నున్న దే?'మని తలఁచెను- కాని పర్వతము నెక్కిచూచినపుడు చెట్టుయు గరికయుఁ గలిసిపోయి రెండునుఁ బచ్చనిమైదానమువలెఁ గనఁబడెను- అట్లే విషయాసక్తుల యభిప్రాయములో స్థానాధికారభేదములుండును- ఒకఁడు రాజును, నొకఁడు చెప్పులఁ గుట్టువాఁడునై యున్నాఁడు కాని భగవత్సాక్షాత్కారమయినప్పుడు సమస్తజనులు సమానులే- సజ్జనులని, దుష్టులని, యగ్రజాతియని, హీనజాతియని యేమియునుండదు-

(399) అహంభావత్వముండుట చాలాయపాయకరము- దానిని రూపుమాపువఱకు ముక్తికలుగదు- అప్పుడుపుట్టినదూడనుజూడుము- అది 'హమ్హా' యని యఱచును ఈశబ్దమునకు 'నేనున్నా'ననియర్థము- ఇది పెరిగి పెద్దదయినతరువాత బండ్లులాఁగి పొలములుదున్నుచుండును- ఆవులు చంపఁబడి తినఁబడుచున్నవి- చంపఁబడినను వాని యహంభావత్వముపోలేదు- వానిచర్మములతోఁజేయఁబడు డోళ్లుఁగూడ, 'నేనున్నాన'ని యర్థమువచ్చుశబ్దముఁజేయుచుండును- తుదకువానిప్రేగులను దూదేకులవాఁడు తన దూదేకుల్యాకుఁ గట్టునప్పటికి వాని (యావులయెద్దుల) యహంభావత్వముపోవును- అప్పుడాప్రేగు 'ఘూహే' (నీవుయున్నావు) యని యనును- అహంభావత్వము పోవలయును- 'నీవ'నుమాట రావలయును- మనుజునకు ననుభవము విశేషముండువఱకు నహంభావత్వము నశింపదు-

(400) భగవంతుని మొట్టమొదటఁజేరుము- తరువాతధనముసంపాదింపవచ్చును- కాని ధనమునుసంపాదించి భగవంతునిఁగనుఁగొనుటకుఁ దర్వాతఁబ్రయత్నముఁజేయవచ్చునని యెప్పుడు తలఁచకుము ఒక్కపర్యాయము భగవంతునిఁజూచుటవల్ల శాంతికలిగినపుడు తరువాతఁ బ్రపంచములోనున్నను నీ మనోశాంతి చెడనేరదు.

(401) భగవంతుఁడు సూదిరంధ్రములోఁగుండ నేనుగనుబోవునట్లు చేయఁగలఁడు- ఆయన యిష్టమున్నయెడల నేమయినఁజేయఁగలుగును.

(402) అతివినయముగా నొకఁడొకసాధువుయొద్దకుఁజనుదెంచి 'ఓమహాత్ముఁడా నేనతిదీనుఁడను- నేనురక్షింపఁబడుటకు విధమెద్ది?'యని యడిఁగెను, అప్పుడు సాధువు 'మంచిది అట్లే చెప్పెదను- నీకంటె నీచమయినపదార్థమునుఁ గొనిర'మ్మని చెప్పఁగా శిష్యుఁడువెళ్ళి తిరిగితిరిగి యెక్కడఁ దనకంటె నీచమయినపదార్థమును గనుఁగొననేరకఁ దుదకుఁ దనమలమునుఁజూచి 'ఇది నాకంటె నీచమయినదిగదా- కనుక దీనినిఁ దీసికొనివెళ్ళెద'నని యనుకొని దానిమీఁదికిఁ దనహస్తములఁబోనిచ్చెను- ఇంతలో 'ఓపాపీ!

నన్నంటుకొనకుము. మొదట నేను భగవంతునికి నర్పణఁజేయఁబడు గారెలును బూరెలును నయియున్నాను- నాదురదృష్టమువల్ల నీయొద్దకువచ్చి యింతస్థితికివచ్చితిని- ఇప్పుడు నన్నుఁజూచినవారు పెడమొగములఁబెట్టి ముక్కుపైఁ గుడ్డలఁబెట్టుకొని పోవుచుందురు- ఒక్కపర్యాయము నీయొద్దకువచ్చినంతమాత్రముననే నాకింతదశపట్టినది- ఇప్పుడు తిరిగి నన్నుముట్టుకొనిన నింక నెట్టిదీనస్థితికి వచ్చెదనోగదా యని యొక శబ్దమువినఁబడెను- ఈ సమయమునం దానూతనశిష్యునకు నిజమయినసాధుత్వము ప్రాప్తించినది అందువలనఁ దరువాత ముక్తిఁబొందినవాఁడాయెను.

(403) నాకీజన్మమందుననే భగవంతుఁడగుపడవలయును- జన్మగూడఁగాదు మూఁడుదినములలోనే దర్శనమియ్యవలెను- అట్లుగూడఁగాదు- ఒక్కపర్యాయమాయన నామమును స్మరించి నావంకకుఁద్రిప్పకొనెదను- ఇటువంటిప్రేమ భక్తియుండిన నీశ్వరుఁడు త్వరలోఁ దర్శనమిచ్చును- సోమరులయినవారికి నెప్పుడయిన దైవదర్శనము కలిగినను నది యనేకకాలముల కృషియొక్కఫలమగును-

(404) నీటిలోమునిఁగిపోవుచున్నవాఁ డెట్లు శ్వాసనిశ్వాసములఁ బెద్దగావిడుచునో యట్లే భగవద్దర్శనార్థి యత్యాసక్తితోఁ బనిఁజేయవలయును-

(405) ఒక్కపుష్కరముకాలము వర్షము కురియకఁబోయినను వ్యవసాయమును వృత్తిగాఁగల కాపు వర్షించినపుడు వ్యవసాయముఁజేయకమానఁడు- క్రొత్తగా వ్యవసాయమును మొదలుపెట్టిన కోమటి యొక్కసంవత్సర మెండిపోయిననే నిరుత్సాహుఁడగును- అట్లే నిజమయినభక్తుఁడు తన జన్మమంతలో నీశ్వరుఁ డగుపడకఁబోయినను నిరుత్సాహుఁడుకాఁడు-

(406) యోగులకు ఋషులకు నేమయినను దినుమని పెట్టకుము- ఏలయనిన నది వారిమనోశాంతిని భంగపఱచును-

(407) అద్వైతజ్ఞానముఁగలిగియున్నవాఁ డిష్టమువచ్చినట్లు తిరిగినను నేవిధమైన చెరుపుకలుగనేరదు-

(408) పగటివేళఁదృప్తియగునట్లు భుజంపుముకాని రాత్రివేళఁ గొంచెము తేలికగానుండునట్లు భోజనముఁజేయుము-

(409) విషయాసక్తులకు నిర్వాణసుఖముకంటెఁ బ్రపంచసుఖ మెక్కువరుచిం

చును. విషయపరాయణుఁడయిన శిష్యుఁడొకఁడు గురువయిన శ్రీ రామకృష్ణునిఁ దనకు మూర్ఛకలుగునట్లు చేయుమనియడిగెను. ఈయన యట్లుచేసెను. వైద్యులువచ్చియుపయోగముండకఁబోయెను. పదియేనుదినములవఱకు శిష్యుఁడట్లే యొడలుఁదెలియకఁ బడియుండెను. భగవాన్ తాకినంతమాత్రమునఁ దిరిగిలేచి శిష్యుఁడు 'నాకు కొడుకులుఁకలరు. ఆస్తికలదు. వానినిగూర్చి నేను శ్రద్ధఁదీసికొనవలయును. నాకిప్పుడీ సమాధితోఁ బనియేమి?' యనిపలికెను.

(410) ప్రపంచమంతయుఁ బరబ్రహ్మమని గురువుచెప్పఁగావిని యొకరాజుచాలా సంతోషపడి లోపలికిఁబోయి భార్యతోఁ 'రాణికిని, రాణిదానికిని భేదములేదు. కనుక నీదాసీది నాకు రాణిగానుండున'టంచనెను. రాణికిప్పుడు గుండెలలో రాయిపడినట్లున్నది. అంతట నామె తనభర్త గురువునుబిలిపించి దీనస్వరముతో 'అయ్యా! మీ బోధవలన నెంతపనిజరిగినదియో వింటిరా?' యని జరిగినవృత్తాంతమంతయు నుడివెను. గురువప్పుడామె కోపమును దుఃఖమునుఁ జల్లార్చి, 'నీవీదినమున రాజుకు భోజనముఁబెట్టునపుడొకగిన్నె యన్నమును నొకగిన్నె పేడయుఁ బెట్టుము' యని సలహాచెప్పెను. ఆహారము వేళవచ్చినపుడు రాజు, రాజగురువు యిద్దఱు భోజనమునకువెళ్ళిరి. భార్య గోమయముఁగలిగిన గిన్నెనుదెచ్చిపెట్టగా రాజుకువచ్చిన యాగ్రహ మింతయని యెవ్వరుచెప్పగలరు? గురువంతట రాజునుఁజూచి, 'అయ్యా! నీవద్వైతజ్ఞానివి. గోమయమునకు నన్నమునకు భేదముగనిపెట్టుచున్నావ'ని పలుకగా రాజు కోపముఖుఁడై 'అద్వైతజ్ఞానివైన నీవీ గోమయముఁ దినఁగలిగినఁదినుమ'ని వచించెను. అప్పుడు గురు వొక చిన్న జంతువుగామారి గోమయమునుభక్షించి తిరిగి మనుజుఁడాయెను. ఇంతటితో భూపతికిఁ జాలా సిగ్గువచ్చి తిరిగి తనరాణితో నెప్పుడు నట్లుమాట్లాడలేదు.

(411) లంకకు వెళ్లుటకు రాముఁడు సముద్రమునకు వంతెనఁ గట్టవలసివచ్చెను. రామభక్తాగ్రేసరుండయిన హనుమంతుండు సముద్రము నొక్కదుముకుతోదాటెను.

(412) గోక్షీరములు గోవుదేహమంతటఁ బ్రవహించును. అంతమాత్రముననే దాని చెవులనుబట్టి లాఁగినఁ బాలురా నేరవు. స్తనములఁబిండవలయును, అట్లే భగవంతుఁడు లోకమంతటనుండును. కాని నీవాయనను జూడలేవు. పూర్వకాలమందు మహాపురుషులు తపస్సుచేసుకొనుటవలనఁ బరిశుద్ధముకాబడినదేవాలయములలో భగవంతుఁడు త్వరగా దర్శనమిచ్చును.

(413) నదినిదాటుటకొక మనుజునకొక మహాత్ముఁడొకరక్షనిచ్చిపంపెను. దా

నిసహాయమువలన నీతఁడు (రక్షఁగైకొనినవాఁడు) జలముపైఁగూడనడువఁజొచ్చెను. నది సగముదాటిపోయినతరువాతఁ జిత్రముతోఁచి యారక్షనుదెఱచిచూడ నందొక చిన్నకాగితముమీద భగవన్నామము వ్రాయఁబడియున్నది. దీనిరహస్యమిదియేనాయని పరిహసించెను. తక్షణము నదిలోమునిఁగిపోయెను. భగవన్నామముచేయఁగలచిత్రము లనేకములు. నమ్మక ప్రాణమిచ్చును. సందేహము మరణమునుఁదెచ్చును.

(414) ఒకరాజొకవిప్రునకు మరణశిక్షవిధించి యేపనిఁజేసిన నీపాప పరిహారమౌనని యడుగుటకు నొకమహాపురుషుయాశ్రమమునకు వెళ్ళెను. ఆయన యాశ్రమమందు లేఁడు. కుమారుఁడుమాత్రముండెను ఈకుమారుఁడు సంగతియంతయువిని 'భగవన్నామమును మూఁడుపర్యాయములుతలఁచుకొనుము. నీపాపము పరిహారమైపోవు'నని చెప్పెను. ఇంతలో మహాపురుషుఁడువచ్చి కుమారుఁడుచెప్పినదివిని 'ఈశ్వరనామము నొక్కతూరి తలఁచిననే కోట్లజన్మములనుండిచేసిన పాపములునశించిపోవును. ఓమూర్ఖా! నీభక్తి యెంతహీనమయినది. మూఁడుమార్లుస్మరించమనిచెప్ప నేల? ఇంతభక్తిహీనుఁడవయిన నీవు వెళ్ళి ఛండాలుఁడవగుము'ని పలికెను- తండ్రియాజ్ఞ శిరసావహించి కుమారుఁడు తరువాత, రామాయణములోఁజెప్పఁబడిన గుహుఁడాయెను'

(415) 'ఆశ, అభిమానము, భయము' వీనినిగలవారికెన్నఁడు నీశ్వరుఁడుకనఁబడఁడు.

(416) బంధింపఁబడినయాత్మఁగలవాఁడు మానవుఁడు- స్వేచ్ఛామానసముగలవాఁడు భగవంతుఁడు.

(417) పృథివ్యాపస్తేజో వాయురాకాశములసంబంధముఁగలిగి పరబ్రహ్మముదుఃఖము ననుభవించును.

(418) దేనితోఁగప్పఁబడని వట్టియద్దముపై గుర్తుపడనేరదు- కాని ద్రవాదులఁబూసినపుడు దర్పణముపై గుర్తులుపడును- బొమ్మలగుపడును- మానవహృదయముఁగూడనిట్టిదియే- ఇది భక్తియనుదానితోఁగప్పఁబడినఁగాని దానిలో భగవద్రూపములు కనఁబడనేరవు.

(419) సామాన్యముగా బావులలో నీరులోతుగానుండి తోడుకొనుటకుఁ గష్టముగానుండును- కాని వర్షాకాలములో ననాయాసముగా నెక్కుడయిన నీరుదొరకును- అట్లే సామాన్యముగా విశేషముతపస్సుఁజేసిన నీశ్వరుఁడుకనఁబడును- కాని యవతారపు

రుషుఁడు పుట్టినపుడు సకలప్రదేశములందు ననాయాసముగా భగవంతుఁడు దర్శన మిచ్చును.

(420) భగవంతునకు మానవునకుఁగలసంబంధము సూదంటురాయికి నినుమునకుఁ గలసంబంధమువంటిది. కాని యాయినుమువలన మానవునిహృదయమేల నాకర్షింపఁబడదు? పూర్తిగా మట్టిలోఁగూరుకొనిపోయినయినుమును సూదంటురాయి యాకర్షింపలేదు. అట్లే మాయలోఁజిక్కినమనస్సు దేవునివలన నాకర్షింపఁబడదు. చుట్టునున్న మంటిని నీటితోఁగడిగివేసిన సూదంటురాయి యినుమును నాకర్షించును. అట్లే మనస్సునుఁజుట్టుకొనియున్న జిజ్ఞాసను మాయనుఁ బ్రార్థనలనఁబడు కన్నీటిచేతఁ గడిగివేయుము. అప్పుడు తత్క్షణము భగవంతునిచే నాకర్షింపఁబడును.

(421) భూమిఁద్రవ్వి పాటుపడి పూడిపోయినభావినిఁగనుఁగొనిన పురాతనవాస్తుశాస్త్రవేత్తవంటివాఁడు సిద్ధపురుషుఁడు. నీరుపడనిస్థలమునందుఁగూడ భావిఁద్రవ్వించు నింజనీరువంటివాఁ డవతారపురుషుఁడు. ముక్తిబొందుటకుఁ జేరువనున్న వారికి సిద్ధపురుషులు ముక్తినిప్పింతురు. ప్రేమయనుమాటలేక ఎడారివలె ఎండియున్న హృదయముఁగలవారిని నవతారపురుషులు రక్షింపుదురు.

(422) గురువు మధ్యవర్తివంటివాఁడు. వివాహముఁజేయువాఁడు ప్రియునిఁ బ్రియురాలినిఁ గలుపురీతి గురువైనవాఁడు మానవుని భగవంతునిఁ గలుపును.

(423) నూనె కాగితముపై వ్రాయుటకువీలుగాదు. అట్లే 'విశేషభోగము, దుర్గుణము' వీనిఁగలమనస్సు దైవభక్తికిఁదగదు. నూనెకాగితమును సీమసున్నముతో రుద్దిన వ్రాయుటకు వీలగునట్లే పైఁజెప్పఁబడినట్టి హృదయమును 'వైరాగ్య'మను సీమసున్నముతో రుద్దిన నాత్మైకవృద్ధికలుఁగును.

(424) ఒకవిధమయినపురుగుకలదు. దానికి పులికోచయను పేరు. ఇదికుట్టిన మందులేదు. కాని కుట్టగానే పసుపుచెట్టువేళ్ళతో సేవించిన నాపుండుకుదురును. కొంచమాలస్యమయిన నేమందువలనను బ్రయోజనముండదు. అట్లే నరుఁడు 'ధనము, కోరిక' యనఁబడు పురుగుచేతఁ గుట్టఁబడిన తక్షణము వైరాగ్యమనువేరుచేత సేవింపవలయును. లేనియెడల నాతనికి నాత్మజ్ఞానాభివృద్ధికలిగి బాగుపడఁడు.

(425) పిల్లలమనస్సు రంగువేయఁబడని తెల్లగుడ్డవంటిది. ఇఁక పెద్దవారిమనసు రంగువేయఁబడియుండి మఱియొరంగునువేయుటకు వీలుపడని గుడ్డవంటిది.

(425) భాగ్యవంతుఁడయిన యొకమార్వారి భగవానునిఁజూచి 'అయ్యా! నేను సమస్తమునువిడిచినాను. ఇక నాకెందువలన భగవంతుఁ డగుపడ'డని యడిఁగెను. అప్పుడు భగవాన్ 'నీమనస్సు నూనెఁబోసుకొను తోలుసంచివంటిది. నూనెనంతయు వంచివేసినను నింక నాసంచి వాసనఁగొట్టుచుండును. అట్లే నీవు సమస్తమును విడిచినను నింక బూర్ణముగ విషయములందుఁ గోరికయణఁగలేద'ని బదులుచెప్పెను.

(426) కలకత్తాకువెళ్లుబాట లనేకములుగలవు. సందేహంగారు (Mr. Doubtful) కలకత్తాకుఁ జాలదూరమునమన్న యొకగ్రామమునుండి బయలుదేరి మార్గములోఁ గలకత్తాకుబోవు దగ్గరమార్గమేదని యొకమనుజునినడిఁగెను. 'ఈదారినే పోవలసిన' దని యాతఁడుచెప్పగాఁ గొంతదూరముపోయి 'యిదియేనా కలకత్తాకు దగ్గిరమార్గము'ని యింకొకరినడిఁగెను. ఈప్రశ్నవిని యాతఁడు, 'కాదు. ఇదికాదు. వెనుకకుఁబోయి యెడమ ప్రక్కగానున్న మార్గమున వెళ్ళవలయున'ని ప్రత్యుత్తరమివ్వగా సందేహముగా రట్లు చేసిరి. ఇప్పు డింకొకమనుజుఁ డింకొకత్రోవనుజూపెను. ఈవిధమున నడకసాగక నొక బాటనుండి మఱియొకబాటకు వెళ్లుటయందే యాదినమంతయుఁ గడుపఁబడెను. మొదటఁజెప్పఁబడిన మార్గముననే యీసందేహముగారు కలకత్తాకుఁబోవలసినది. అట్లే భగవంతునిఁ జేరఁగోరువాఁ డొక్కమార్గదర్శినిమాత్రమే కోరవలయును.

(428) ఇతరదేశభాషను బూర్తిగాఁ జదువనివాఁడు మాట్లాడునప్పు డాభాషాపదము లుపయోగింపఁజూచును. కాని పూర్తిగఁజదువుకొనినవాఁడు తన స్వంతభాష మాట్లాడుచుఁ బరభాషాపదముల వాఁడనేవాఁడఁడు. మతమునందు వృద్ధిఁగాంచినవారి స్థితియు నిట్టిదియే.

(429) వట్టిచెంబులో నీరుఁబోయునపుడు శబ్దము కలుగును. కాని నిండుచెంబులోఁబోసినపుడే శబ్దముకలుగును. ఆవిధముననే భగవంతునిఁజూడనివాఁ డాయనగుణములఁగూర్చి మహిమలఁగూర్చి యూరకబడాయిఁ గొట్టుచుండును. కాని భగవంతునిఁగనుఁగొనినవాఁడు శాంతిఁగల్గి మాట్లాడకనుండును.

(430) కల్లుఁద్రాగినవాఁడొకప్పుడు తనచొక్కాయిని టోపిగాను నింకొకసమయమునందు కాలికిమేజోళ్ళగా నుపయోగించును. అట్లే భగవత్జ్ఞానమువలనఁ బిచ్చిపట్టినవానికి బహిర్ప్రపంచజ్ఞానముండదు.

(431) 'కోరిక, ధనాశ' ఇవి యున్నంతవఱకు మానవునకు భగవంతుఁ డగుపడఁడు.

(432) నరుఁడు పుట్టినపుడు విద్యావిద్యల రెంటిని గలిగియుండును. జన్మమెత్తినపుడీరెండు సమముగానుండును. ఈరెండు త్రాసుపళ్ళెములవంటివి. జన్మమెత్తిన తత్క్షణము ప్రపంచమొకదానిలోఁ బ్రపంచసుఖములనుంచును. భ్రమఁబుట్టించని విషయముల రెండవపళ్ళెమునందుఁ బెట్టును. మనము ప్రపంచసుఖములున్న పళ్ళెమునుఁగోరిన మనము క్రిందికిఁగ్రుంగిపోవుదుము. రెండపళ్ళెముఁగోరిన భగవంతునివైపునకుఁ దేలిపోవుదుము- అందువలన బాగుపడుదుము-

(432) సత్యమును మాట్లాడువారు మాత్రమే యీశ్వరునిఁజూడఁ గలుగుదురు.

(433) ముళ్ళున్న యడవిలో వట్టికాళ్ళతో నడచుట కడుదుర్లభము కాళ్ళకుఁ బాదరక్షలఁదొడుగుకొనిగాని లేక నడవియంతయుఁ జర్మముతోఁ గప్పించిగాని వెళ్ళవచ్చును- ఈ చివర యుపాయముఁజేయుట కష్టముకనుకఁ జెప్పులఁదొడుగుకొని నడుచుటయే తేలిక- తద్విధముననే లోకములో మనుష్యులు కామక్రోధాదులచేత నడ్డగింపఁ బడుచున్నారు- అన్నికోరికలఁ దీర్చుకొనుటవలనఁగాని లేకఁగోరికల నణచి వేయుటవలఁగాని సౌఖ్యముకలుగవచ్చును. కోరికలఁ దీర్చుకొనినకొలఁది క్రొత్తవిపుట్టుచుండును. కనుక నీ యుపాయము మనకుపయోగపడదు- ఇందుమూలముగ రెండవదానినే యవలంబింపవలయును. కోరికలనణఁచి విజ్ఞానముఁగల్గియుండుట చాలామంచిపని.

(434) "1 ఫలమునుండి కారణమునకుఁబోవుట 2 కారణమునుండి ఫలమునకు వచ్చుట" అనియుక్తి రెండువిధములు, మొదటితరగతియుక్తి నవలంబించి సృష్టినాలోచించుకొనిపోయిన భగవంతునియొద్దకుఁ బోవుదుము- భగవంతునిఁజేరి రెండవ తరగతియుక్తి నవలంబించిచూచిన సృష్టికంతకు నాయనయే కారణమనియుఁ బ్రతివిషయము, పదార్థమునందు నాయనకలఁడనియుఁ దెలియవచ్చును- అరటిచెట్టు మట్టలనొకటి తరువాతనొకటిఁదీసివేయుటవంటిది మొదటిపద్ధతి. తిరిగియొకమట్టపై నొకటిపెట్టుటవంటిది రెండవపద్ధతి-

(435) "పిచ్చివాండ్రు, త్రాగుబోతులు, పిల్లలు" వీరు స్వర్గమునుఁగూర్చి పలుమారు ముచ్చటించుచుందురు-

(436) "కామక్రోధాదులు మానవుని నెప్పుడు వదలును?" అని యడుగఁబడి భగవాన్, "ఈకామక్రోధాదులన్నియు నెంతవఱకు విషయాసక్తి మనకుఁగల్పించునో యవి యంతవఱకు మనశ్శత్రువులు- విషయాసక్తినిఁబోగొట్టి యప్పుడవి మనహృదయముల భ

గవంతుని వైపునకు ద్రిప్పినో యప్పుడు మనముఖ్యమిత్రములగును. విషయములయందుఁ గల కోరికను దేవునిఁజూచుటయందుఁగల కోరికగాను, దమసోదరులందు పడు కోపము భగవంతుఁడిఁకను దర్శనమివ్వనందులకు వచ్చిన కోపముగానుమార్పవలయును. ఇట్లుమార్పవచ్చునుగాని నిర్మూలముఁజేయలేము.

(437) శ్రాద్ధకర్మకుఁజేయఁబడిన పాకమును భుజింపకుము. ఏలయనిన నది దైవభక్తినిప్రేమను నశింపఁజేయును. ఇతరులకొఱకు బలులనిచ్చి బ్రతుకుపురోహితుని యింటిలోఁగూడ భోజనముఁజేయకుము.

(438) తెలిసియైనఁ దెలియకనయిన నమృతత్వమనఁబడు సరస్సులో మునుఁగువారమర్త్యులగుదురు. అట్లే తెలిసియో తెలియకనో భగవన్నామముఁ దలఁచువారు తక్షణమమర్త్యత్వమునుఁ బొందుదురు.

(439) గర్వపడుట యతిపాపము. కాకి 'నేనెంత తెలివిఁగలదాన'నని తలఁచును. అదియెప్పుడు వలలోఁబడదు. ఆపత్తురానున్న సమయమునఁ దెలిసుకొని తక్షణమెగిరిపోవును. అన్నమునుఁ జమత్కారముగా నపహరించును. కాని మలిన పదార్థములఁ గూడఁదినును. కనుక నెక్కువ తెలివిఁగల్గి యుండుటవలనఁగాని, చిన్న వ్యాజ్యములఁ బట్టెడువకీలు తెలివియుండుటవలనఁగాని వచ్చుఫలితమిట్టిది.

(440) జలములో నొకగిన్నెనుంచిన దానిలోపల, దానిపైన, దానిచుట్టు నీరుండును గదా. అట్లేభగవంతునిలో మునిఁగిపోయినవాఁడు తనచుట్టు సర్వస్థలములయందు భగవంతుఁడే యున్నాఁడని తెలుసుకొనును.

(441) బ్రతికియుండి చనిపోయినవాఁడు నిజమైనమానవుఁడు. అనగాఁ జచ్చిపోయినవానివలెఁ గామము, కోరిక మొదలగునవిలేకుండ నుండువాఁడు మానవుఁడని పిలువఁబడుట కర్హుఁడు. నీనికి నేమాత్రము కామచిహ్న మగుపడినను భగవద్దర్శనము కలుగనేరదు. కనుక నీకుఁగల కొద్దికోరికల నన్నిటినిఁదీర్చుకొని తృప్తిపడి పెద్దకోరికలను విజ్ఞానమువలనను యుక్తివలనఁ జంపివేయుము.

(442) 'శివ (జ్ఞానము), శక్తి' ఈరెండును సృష్టికినవసరము. నీటిసహాయములేకఁ గుమ్మరివాఁడు వట్టిమట్టితోఁ గుండలఁజేయలేఁడు. నీరుతప్పకఁగావలయును. అట్లే సృష్టిఁజేయుటకుఁ గేవలము జ్ఞానముండినఁజాలదు. శక్తిగూడ నుండవలయును.

(443) ఋషియొద్దకుఁగాని దేవాలయమునకుఁగాని రిక్తహస్తములతోఁ బోవకుము. అచ్చట నర్పణఁజేయుటకు నేదో యొక వస్తువును (స్వల్పఖరీదుఁగలదయినను) దీసికొనిపొమ్ము.

(444) భగవంతునిఁజూచుటయెట్లు? దేహమును, మనస్సును, ధనమును వ్యయపఱచి యాసక్తిఁగల్గి కష్టించిన నీశ్వరుఁడు కనఁబడును.

(445) దైవత్వమువచ్చుటకుఁ బూర్వమునరునకు మానుషత్వము చచ్చిపోవలయును. ఈదైవత్వమును జగన్మాత యగుపడుటకుఁబూర్వము నశించవలయును. దైవత్వము నశించినవానియందుండి జగన్మాత శృంగారముగ నృత్యముఁజేయును.

(446) నీగురువునుఁ బరులునిందించుచున్నపుడు నీవు నెమ్మదిగా నూరకుందువు. ఆయన నీ తలిదండ్రులకంటె గొప్పవాఁడు. నీ యెదుట నీతలిదండ్రుల నిందించిన నూరకుందువా? తుదకుఁ బోట్లాడియైన నీవునీగురువుమర్యాద నిల్పుము.

(447) "మనోనిశ్చలత, ఆసక్తి" ఇవియెక్కువగానున్నచోట భగవంతుఁడుత్వర లోనగుపడును.

(448) ప్రపంచమెటువంటిది? అమ్రఫలమువంటిది ప్రపంచము. ఈ ఫలమునకుఁ దోలు, టెంక నధికముగానుండి పిప్పితక్కువగనుండును. దీనినిఁదిన్నయడల శూలనొప్పి వచ్చును.

(449) గురువనిశిష్యుఁడని లేకున్నస్థలమెంతచిత్రముగా నుండును! బ్రహ్మజ్ఞానముఁగూడ నటువంటిదియే. ఒకపర్యాయము దానిఁబొందఁగల్గినవానికి గురుశిష్యభేదము లుండవు.

(450) కుమ్మరియొద్ద కుండలు, జట్లు, మూకుళ్లు, బిడతలుండును. అవియన్నియు మంటితోఁజేయబడినవియేగదా. అట్లే దేవుఁడు వివిధనామములతో వివిధరూపములుగా వివిధకాలములందుఁ బూజింపఁబడును.

(451) అద్వైతజ్ఞానము చాలనున్నతమయినది. అయినను మొదటమనము సేవకులవలె మనయధికారియైన భగవంతునకుఁ బూజసల్పవలయును. ఇదియే సులభమార్గము. దీనివలన భగవత్సన్నిధానమునకు శీఘ్రముగాఁ బోవుదుము.

(452) పూర్ణభక్తి ప్రేమలఁగల్గి సర్వమును దేవునకు విడుచువాఁడు త్వరలో భగవన్మందిరమునకుఁ జేరును.

(453) నక్కకూతలన్నియు నొక్కటేయైనట్లుజ్ఞానులమాటలన్నియునొక్కటే.

(454) వడ్లకొట్టుముందు మూషకములఁబట్టుటకు బోనులు పెట్టఁబడును. వీనిలో నేమిగో కలదనివచ్చి యెలుకలువీనిలోఁ బడిపోవుచుండును. తప్పించుకొనిరాలేకఁ దుదకు మృతినొందుచున్నవి. ఆత్మగూడనట్టిదియే. ఇది సచ్చిదానందముయొక్క గడప పైనిలిచియుండును. తన్నిత్యసుఖము ననుభవింపలేక నిమిషమాత్రములయిన యీ భూలోకసుఖములవలన నాకర్షింపఁబడి మాయయనఁబడు బోనులోఁబడి చనిపోవుచుండును.

(455) పదునాల్గు సంవత్సరములు తపస్సుఁజేసి యొకఁడు నీటిపైనడచు శక్తిని సంపాదించెను. ఇంతఘనకార్యముఁజేసితినని సంతోషపడి గురువుయొద్దకు నేగి తద్వృత్తాంతముఁ జెప్పఁగావిని గురువువిసుకుఁదోచ, "ఛీ, పదునాల్గు సంవత్సరములు తపస్సుఫలమిదియేనా? నీవిప్పుడు సంపాదించినది యొక్కపైస యనుమాట. ఏలయనిన సామాన్యలోకపైసయిచ్చి కాలువను బోటుమీద దాటరేరా? నీవుచేసినకార్య మిదియేగదా" యని బదులు పలికెను.

(456) భగవాన్‌యొక్క శిష్యుఁడొకఁడు తలఁపులఁజదువుశక్తి (Thought-reading)ని సంపాదించెను. మహానందముతో దీని గురువుకుఁజెప్పనీయక కోపముతో, "నీకు సిగ్గులేదా? ఇట్టిస్వల్పవిషయములయందేల నీబలమునువ్యయపఱచుకొనెదవు?" అనివచించెను.

(457) కండ్లకుఁగంతలఁగట్టినఁగాని బెదురుగుఱ్ఱము తిన్నగా నడువనేరదు. అట్లే విషయాసక్తుఁడయినవానికి వివేకవైరాగ్యములను కంటిమూఁతలు(Eye-flaps) గట్టినఁగాని సన్మార్గముననే నడువఁజాలఁడు.

(458) మూలికల నౌషధముల నిచ్చుచు సాధుననిచెప్పువాఁడు నిజమయిన సాధువుకాఁడు. అటువంటివాని సాంగత్యముఁజేయకుము.

(459) దుర్లభమయిన మానవజన్మఁబొంది భగవంతునిఁ గనుఁగొనఁ బ్రయత్నించనివాని జన్మవృథాయగును.

(460) అనేకమందిచేత గౌరవింపఁబడి ప్రఖ్యాతఁజూపబడువానికిఁగల భగవద్భక్తి కంటె నట్టిగౌరవములేనివానిభక్తి తక్కువ.

(461) నారదునకొకతూరి నాయంతవారలేరని గర్వముపుట్టినదని భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు తెలుసుకొని, "నారదా! నేను చెప్పుచున్న స్థలమునకు వెళ్ళుము. అచ్చట నాభక్తుఁడొకఁడు కలఁడు. కనుక నాయనసాంగత్యముఁ జేయుము." అని చెప్పెను. నారదుఁడక్కడికిఁజని యొకవ్యవసాయకునిఁ గాంచెను. ఆతఁడు నిద్రలేవగానే 'హరీ' యని యనుకొని తరువాత బగలంతయుఁ గృషిఁజేసి తిరిగి పండుకొనువేళ 'హరీ' యని యొక్కతడవననుకొని పరుండువాఁడు. అప్పుడు నారదుఁడు "వీఁడెక్కడిదైవభక్తుఁడు! ఆతనియొద్ద భక్తిచిహ్నములేవే"వని తలఁచి కృష్ణునియొద్దకువెళ్ళి యీసంగతినంతయుఁ జెప్పెను. అంతట శ్రీకృష్ణుఁడు, నారదా! ఇదిగో యీగిన్నెలోఁ బూర్తిగా నీరుకలదు. ఒక్కబొట్టుఁగూడఁ గ్రిందఁబడకుండ దీనిఁబట్టుకొని యూరంతయు దిరిగిరావలసినదని చెప్పెను. నారదుఁడట్లు తిరిగిరాగాఁ గృష్ణుఁడు, "నీవు దారిలో నన్నెన్నితడవలు తలఁచుకొంటివ"ని ప్రశ్నించెను. ఈప్రశ్నకు నారదుఁడు, "ఒక్కతూరిగూడఁ దలఁపలేదు. నాదృష్టియంతయు నీగిన్నెమీదనేయున్నద"ని ప్రత్యుత్తరమివ్వనప్పుడు శ్రీకృష్ణుఁడు, "ఆకాపంత పెద్దసంసారము నీదుకొనుచు నన్ను దినమునకు రెండుపర్యాయములు తలఁచుచుండును. ఇఁకనీవీ చిన్నగిన్నెనుఁ బట్టుకొనివచ్చునపుడు నన్నుఁ దలఁచుకొనక నేపోతివి"అని వాక్రుచ్చెను.

(462) కలవానియింటినిఁగూర్చి భాగ్యమునుఁగూర్చి విచారించువారనేకులుందురు. కాని యాయనను స్వంతముగా వెళ్ళిచూచువారు కొద్దిమందియుందురు. అట్లే శ్రుతి స్మృతులనుఁగూర్చి చదివి మహోపన్యాసములిచ్చువారనేకులుందురుగాని కష్టించి భగవంతునిఁ జూడవలయు ననుకొనువారరుదు.

(463) ఒకఁడు, "నేను పదునాలుగు సంవత్సరములనుండి యీశ్వరునిఁగనుఁగొనుటకుఁ బ్రయత్నించుచున్నాను. ప్రతివారు చెప్పినవిధమున నడుచుకొంటిని. యాత్రస్థలములకన్నింటికి వెళ్ళి చూచివచ్చినాను. అనేకమందిసాధులను మహాత్ములనుఁజూచినాను. ఇప్పటికి నాకేబదియైదుసంవత్సరములుకలవు. ఇంతవఱకు నాకేమాత్రము లాభమగుపడలేద"ని భగవానునితో నొకపర్యాయము చెప్పెను. ఈయన 'ఆసక్తి, భక్తిఁగలిగి కొలిచినవారికి నీశ్వరుఁడు తప్పకవగుపడును. ఈసంగతినే తిరిగితిరిగి చెప్పుచున్నాను. నన్నుఁజూచి యుత్సాహముఁబొందుము. నిరుత్సాహుఁడవు కాఁబోకుము'ని ప్రత్యుత్తరమిచ్చెను.

(464) కొందఱుపుత్రులుకలుగలేదని మఱికొందఱు భాగ్యముకలుగలేదని చింతిల్లుదురు. కాని భగవంతుఁ డగుపడలేదని చింతించువా రొక్కరులేరు. ప్రయత్నము జేసినవానికి నాయన తప్పక దర్శనమిచ్చును ఆయనకనఁబడలేదని యేడ్చినఫలముకలదు.

(465) గంగానదిలో సమస్తమయిన చెడుపదార్థములుఁద్రోయఁబడినను దాని పవిత్రత తగ్గలేదుగదా. అట్లే గురువునకుఁ గొద్దిలోపములు, దప్పులు, నిందలు నున్నను నాయన పవిత్రత తగ్గదు.

(466) భగవంతుఁడు కావలయునని కోరువారికి దర్శనమిచ్చును. ఈ వాక్యము యొక్క నిజమును నీ వీజన్మములోనేకనుఁగొనవచ్చును. మూఁడుదినములు నిజమయినయాసక్తిఁగలిగి పనిఁజేయుము. నీవు జయముకలుగుననుమాట నిశ్చయము.

(467) ఈ కలికాలములో భగవదనుగ్రహమును సంపాదించుకొనుటకు మూఁడు దివసము లాసక్తితోఁ జేయఁబడిన ప్రార్థనచాలును.

(468) ఒకపర్యాయ మొకస్థలమున నేను విత్తులుతీయఁబడిన యెద్దుల రెంటిం జూచితిని. ఆవొకటి యాదారినిఁబోవుచున్నది. ఒకయెద్దు కామముఁగలిగి యాయావుపై నెక్కుటకుఁ బరుగెత్తెను. రెండవది యూరకనుండెను. ఇట్లు జరుగుట నాకాశ్చర్యముగ నుండి విచారింపఁగా నీ రెండవయెద్దు పెద్దదయినతరువాత విత్తులుతీయఁబడి యావులపైఁ బంపఁబడినదనియు మొదటియెద్దు చిన్నప్పుడే విత్తులుతీయఁబడినదనియుఁ దెలిసినది. అలవాటుయొక్క మహిమయిటువంటిది. పసితనమునందు సన్యాసులగువారు స్త్రీలఁజూచినను గామపీడితులుకారు. ప్రపంచసుఖములననుభవించి వృద్ధాప్యమున సన్యాసులగువారు మనస్సునిల్పుకొను శక్తిలేక గామసుఖమునే కోరుచుందురు.

(469) తలకాయ కొట్టివేయఁబడినను గొఱ్ఱెమొండెము కొంచెముకాలము కొట్టుకొనుచుండును. అహంకారమిట్టిదియే. స్వేచ్ఛాత్మఁగలవారికి నహంకారముండదు. జీవయాత్రఁగడపుటకుమాత్రము కొద్దిగా మిగిలియుండును. తిరిగి వ్యవహారములచేత బంధింపఁబడుటకు నీయహంకారముచాలదు.

(470) 'నేను జీవుఁడన'ని యనుకొనువాఁడు నిజముగా జీవుఁడేయగును. 'నేను భగవంతుఁడన'ని యనుకొనువాఁడు భగవంతుఁడేయగును. తలఁపులనుబట్టియే మనుజుఁడుండును.

(471) అనేకమంది యతిదీనముగా 'మేము మట్టిలోనుండు పురుగులవంటివార' మని తలంచుచుందురు. కాలక్రమమున వారు నిజముగాఁ బురుగులవలె దుర్బలులై పోవుదురు. నీవెప్పుడును దీనముగానుండకుము. నిరుత్సాహుఁడవుకాకుము. 'నిరుత్సాహము, నిరాశ' ఇవి యభివృద్ధిమార్గమున కడ్డమువచ్చు పరమశత్రువులు. మనుజుఁ డెట్లుతలంచుకొనునో యట్లుండును.

(472) ఈలోకములో సుఖమునిచ్చు ప్రతివస్తువును నిత్యసుఖమునుఁ గొంత యిచ్చుచుండును. ఈ రెండువిధములయిన సుఖములకునుగలభేదము మంచి పంచదారకును బూతిగాఁ దయారుకాఁబడని పంచదారకునుఁ గల భేదమువంటిది.

(473) సూర్యుఁడు సమస్తప్రపంచమునకు వెలుతురును వేడిమిని నిచ్చుచున్నాఁడు. మేఘములు తనకడ్డమువచ్చి తనకిరణములను భూమికిఁబోకుండఁజేసిన నేమియుఁ జేయఁజాలఁడు. అట్లే యహంభావత్వ మాత్మనుఁ గప్పియుండునంతవఱకు భగవంతుఁ డేమియుఁ జేయఁజాలఁడు.

(474) "(1) సత్పదార్థమునుగనుఁగొని శాంతివహించి యితరులసంగతి దలఁచక దమకుఁదామే నిత్యానందము ననుభవించువారు. (2) వీరివలె నానందమునుఁబడసి దాని ననుభవించుటకు నితరులనుఁ గూడ రమ్మనిబిల్చువారని పూర్ణజ్ఞానులలో రెండుతరగతులవారు కలరు.

(475) సత్యము నొక్కమాటలోఁ గనుఁగొనఁదలఁచిన నాయొద్దకురమ్ము. అనేకమాటలలోఁ గనుఁగొనవలయుననిన నుపన్యాసకులయొద్దకు వెళ్లుము. 'సత్యమును నా కొక్కమాటలో జెప్పుమ'ని యడుగఁబడి భగవాన్ 'ప్రపంచముసత్పదార్థము. బ్రహ్మము సత్యపదార్థము. ఇదియే సత్యము'ని బదులుచెప్పెను.

(476) నేనుచేసినత్యాగమును, నేనీశరీరమునుధరించుటకుఁ బూనినబరువును నెవ్వరు తెలుసుకొనఁగలరు? భగవంతుఁ డవతారమెత్తినపుడాయన యెంత త్యాగముఁ జేయునో యెవ్వరికిఁ దెలియదు.

(477) వజ్రడంగియొక్క పట్టెడనుఁజూడుము. దానినిఁజాలఁ గఠినముగాఁ గొట్టుదురు. అయినను నది తనస్థానమునుమార్చదు. మానవులుదానిఁజూచి యోర్పును సహిష్ణుత నేర్చుకొనవచ్చును.

(478) అప్పులలోఁ దల మునిఁగినవాఁ డొకప్పుఁ డప్పుల నెగవేయఁదలఁచి పిచ్చివానివలె నటించెను. మందులు మాకులు నేమియుఁ బ్రయోజనమగుపఱచకపోయె

ను. ఆతనికి మందులనిచ్చినకొలఁది యాయనపిచ్చి యెక్కుడాయెను. నిజముఁగనుఁగొని యొక వైద్యుఁ డీపిచ్చివానిఁ జాటునకుఁగొనిపోయి 'నీవేమిచేయుచున్నావు. పిచ్చివాఁడవుగా నటించిన నిజముగాఁ బిచ్చివాఁడవగుదువు. ఇదివఱలోనే కొన్ని పిచ్చిచిహ్నములు కనఁబడుచున్నవ'ని చీవాట్లుపెట్టెను- ఈమాటలు కొంతఫలమునిచ్చినవి- అప్పులోమునిఁగియుండువాఁడు పిచ్చివానిగానటించుట మానెను- మన మెట్లునటింతుమో యట్లు కొన్ని దినములకగుదుము. కాలక్రమమున నటనయే నిజమగును.

(479) భగవంతుఁడందఱిలోఁగలఁడు- కాని యందఱు భగవంతునిలో లేరు- అందువలననే వీరు కష్టములననుభవించుచుందురు-

(480) ఎంతవఱకు పిల్లవానివలె జ్ఞానముఁగలిగి సాధారణత్వముఁబూనడో యంతవఱకు భగవత్సాక్షాత్కారముఁ గాంచనేరఁడు- నీకుఁదెలిసినప్రపంచవిషయమంతయు మఱచిపొమ్ము- పసిపిల్లవానివలె లోకమునెఱుంగకుము- అప్పుడు నీకు సత్పదార్థజ్ఞానము కలుఁగును-

(481) నెమ్మదిఁగలిగి సిగ్గుతోఁగూడినవారై పతివ్రతలుగా నుండువారినిఁజూచినపుడు పవిత్రస్త్రీవేషముగలిగియున్న జగన్మాతయని తలఁచెదను. సిగ్గులేక నిష్టమువచ్చినట్లు తిరుఁగు దుష్టచేడియలఁజూచినపుడు మఱియొకరూపముననాడుచున్న జగన్మాతయని యనుకొందును

(482) 'ఒకటి'ను సంఖ్యతరువాత సున్నలఁజేర్చి యెంతసంఖ్యనయినఁ జేయవచ్చును- కాని యాయొకటినిఁదీసివేసిన మిగులుసున్నలకు విలువయుండదుగదా! ఒక్కఁడయినభగవంతునకు జీవుఁడు కలిసియున్నంతవఱకు ఫలముండును- కాని కలసియుండనపుడు ఫలమేమాత్రముండనేరదు-

(488) అట్లే భగవంతునితో జీవుఁడు కలసియుండి యాయనకొఱకు సమస్తము జేయుచుండిన నంతకంతకు లాభమెక్కుడగుచుండును- ఇట్లుగాక దేవునిఁదలఁచుకొనక సమస్తముఁ దన గొప్పతనమునకే చేయుచుండిన లాభమనుమాటయుండదు-

(484) నేనెట్లు వస్త్రముల నొకప్పుడుధరించి మఱియొకసమయమున విడచివేసి దిగంబరినై యుండునో యట్లే యీశ్వరునకు గుణము లొకప్పుడుకలవు- మఱియొకవేళ నుండవు- శక్తితోఁగూడుకొనిన బ్రహ్మము సగుణబ్రహ్మము- అప్పుడాయనకునీశ్వరుఁడని పేరు-

(485) స్వేచ్ఛాత్మను మాయకప్పుకొనియుండునా? ఆభరణములు కేవలము బంగారముతోఁ జేయఁబడక నేదోయొకటి కొంతకలసినబంగారముతోఁ జేయఁబడును- మానవుఁడు దేహధారియై యుండునంతవఱకుఁ గొద్దిగానయిన మాయనుగలిగి యుండవలయును- ఇదిలేనియెడల లోకవ్యవహారమేమియుఁ జేయఁజాలఁడు- మాయనుండి పూర్తిగా విడుదలయగువాఁ డిరువదియొక్కదినములకంటె నెక్కువకాలము బ్రతుకఁజాలఁడు-

(486) విషయాసక్తుఁడయినవాఁడు జ్ఞానికిఁగల యంతిజ్ఞానమును బుద్ధినిఁ గలిగి యుండవచ్చును- యోగిచేయునంతకష్టముఁ జేయవచ్చును- సన్యాసిచేయు త్యాగమునుఁ జేయవచ్చును- కాని యాయనకష్టమంతయు నిష్ఫలమగును- ఈయన వీనిఁజేయు పద్ధతి మంచిదిగాదు- ప్రపంచముకొఱకై చేయుచున్నాఁడు- గౌరవమును, కీర్తిని, భాగ్యమును సంపాదింపఁదలఁచినాఁడు- కాని భగవంతునిఁదలఁచుట వీలులేదు-

(487) పరులుప్రార్థించుచోట నీవుఁగూడ బ్రార్థింపుము- పూజలవల్ల ఫలములేకపోలేదు-

(488) చాకలివాఁడు మురికిగుడ్డలఁదెచ్చి యింటినిండవేయును- ఇవి వానిస్వంతముకావు- ఉతికి బాగుఁజేసి పరులకిచ్చివేయుగాఁ దిరిగివానియిల్లు విడుదలయగును- స్వంతముగా నాలోచింపలేనివారు చాకలివానివంటివారు- ఎప్పుడు నీవటువంటివాఁడవు కాఁబోకుము-

(489) 'పప్పు, పులుసు, పచ్చడి' ఇన్నియు నొక్క పప్పుతోఁ దయారుచేయుదురు- వీనిలో దేనినిఁగోరువారు దానినిఁగోరి భక్షింపవచ్చును- అట్లే భగవంతుఁ డనేకరూపముల ననేకనామములం గలిగియున్నాఁడు- కనుక నెవ్వరి కిష్టమయినరూపమును వారు దానినే పూజింపవచ్చును- భగవంతుఁడు కొందఱికిఁ దండ్రియుఁ గొందఱికిఁ దల్లియుఁ గొందఱికి భర్తయు నైయున్నాఁడు.

(490) ఒకఁ డొకక్రొత్తయూరికిఁబోయిన నక్కడ రాత్రిపూటనుండి పరుండుటకు స్థలముఁగుదుర్చుకొని యాతఁడక్కడనుండి యిష్టమువచ్చినట్లు పట్టణమందుఁదిరుగవచ్చును- స్థలమునుఁ గుదుర్చుకొననియెడల రాత్రి చీకటిలోఁ బాధపడును- అట్లే మానవుఁడు శాశ్వతముగానుండు స్థానమునుఁగుదుర్చుకొని యక్కడినుండి తన యెప్పటిపనిని జేసుకొనుచుండవచ్చును- అట్లుగాక మరణనికిపైగొనునపుడు చాలాబాధలు కలుగును-

(491) మాయనుఁజూచుటకిచ్ఛయించి నేను స్వప్నమునందొకనాఁడు, 'ఒక చిన్న బిందువు క్రమక్రమముగాఁ బెరిగి యొకపిల్లయైనది- ఈపిల్ల పెద్దదయి యొకబిడ్డను గనినది- ఈబిడ్డపుట్టినతక్షణము మ్రింగినది- 'ఈతీరున నామె కనేకమందిపుట్టిరి- ఆమెవలననే గిట్టిరి- నేనప్పుడామెను మాయయనుకొంటిని'- ఇట్లుతలఁచితిని-

(492) బ్రహ్మమనగా నేమి? ఎవ్వరును దీనిని మాటలవలనఁ జెప్పలేరు- ఎన్నడును సముద్రమునుఁజూడనివానికి దానినిఁగూర్చి కొద్దిగాదెలుపవలసియుండిన మనము 'సముద్రము పెద్దనీటిమడుగు- నీటితోఁగూడుకొనిన యొకవిశాలప్రదేశము'ని మాత్రము చెప్పుదుము-

(493) నీతలఁపులను నీవు ద్రోహింపకాకుండుము- చెప్పినట్లుగా నడచుకొనుము- ఇట్లుచేసిన నీకు నిశ్చయముగా జయముకలుఁగును- అమాయకత్వమును సాధారణత్వమునుఁ గూర్చి ప్రార్థనసల్పుము- అటువంటిప్రార్థన ఫలమునిచ్చును-

(494) జబ్బుగానున్న పిల్లలను బెంచుతల్లి యొకరికిఁ బెరుగన్నమును, నొకరికిరొట్టెబాలు, మఱియొకరికి నింకొకవిధముగ నాహారమునిచ్చుచుండును- అట్లే భగవంతుఁ డేవరితత్త్వములకుఁ దగునట్లు వారికిఁ బ్రత్యేకమగు మార్గమును సృష్టించియున్నాఁడు-

(495) మనుజులు మెచ్చుకొనుటకు నిందించుటకు నీరెండుపనులకుఁ ద్వారపడుదురు కనుకఁ బరులమాటలకు లక్ష్యపెట్టకుము-

(496) స్వపక్షమునందలి దురభిమానముఁగలిగి 'ఘంటకర్ణు'నివలె నుండకుము- ఒకభక్తుఁడు శివునిమాత్రముపూజించి యితరదేవతల నసహ్యపడుచుండెడివాఁడు. ఒక దినమున నతనికి శివుఁడగుపడి, "నీకుద్వేషముండునంతవఱకు నేను నీపూజతో సంతోషింపన" నిచెప్పెను. భక్తుఁడేమియుఁజెప్పక నూరకుండెను. తిరిగి కొన్ని దినములయిన తరువాత శివుఁడాతనికి హరిహరరూపమున దర్శనమిచ్చెను. ఇప్పుడు భక్తునకు సగముసంతోషము సగము దుఃఖముఁ గల్గినది తనమ్రొక్కుబళ్ళను శివుఁడున్నప్రక్కకుఁ జెల్లించెను- అప్పుడు శివుఁడు, "ఈదురభిమానము జయింపనేరనిది. నేనీరెండురూపముల ధరించి యందఱుదేవతలొక్కటేయనియు, నందఱు భగవద్రూపములేయని తెలిపినను నీవు తెలుసుకొనవైతివి. కనుక నీదురభిమానమునకు నీవు ఫలితము ననుభవింపవలసియున్నద"ని చెప్పి యదృశ్యుఁడయ్యెను- భక్తుఁడు వెళ్ళిపోయి యొకగ్రామములోనుండెను. క్రమక్రమముగా విష్ణువైరియయ్యెను. పిల్లలందఱువచ్చి 'విష్ణు'యనిపలికి విసికించుచుండిరి. ఈభక్తుఁడు తుదకుఁ దనరెండుచెవులకు రెండుఘంటలఁ గట్టుకొనెను. ఇప్పుడు 'విష్ణు'యని వినఁబడగానే యాగంటల వాయించుచుండును- అప్పటినుండియు నాయనను 'ఘంటాకర్ణుఁ'డని పిల్చుచుండిరి.

(497) అజ్ఞానులయిన లోకులు పరిహాసముఁజేయుదురని యనుకొనిపోవుదురని తలఁచి మతమునభ్యాసముఁ జేయకుండకుము. చూడఁదగనిపురుగులుగా నందఱిఁజూడుము.

(498) ఒకదంపతిబృందము లోకమునువిడిచి తీర్థయాత్రలఁ జేయుచుండెను. ఒకదినమునవారు నడచుచుండగా ముందరనడచుచున్న భర్తకొక వజ్రపుతునుక యగుపడెను. తత్క్షణమాతఁడు కొంతమంటినిద్రవ్వి వజ్రమునుఁ బూడ్చిపెట్టఁబోవుచుండెను. ఇట్లుచేయుటయందు, భార్యదానిఁజూచి యాశపడితీసుకొని వైరాగ్యమునకు భంగముఁగలుగఁజేయునేమోయని యాయన యభిప్రాయము. దీనినంతయుగ్రహించి భార్య 'అది యేమి?' యని యడుగ నాతఁడేదో జవాబును మెల్లగా నిచ్చెను. అప్పుడామె, "లోకమునువిడిచి యింకను వజ్రమునకు మట్టికి మీకు భేదముఁ గనిపెట్టుచున్నా'రని బదులు చెప్పెను.

(499) బర్ద్వాన్ మహారాజాగారి సంస్థానములో నొకపర్యాయము 'శివుఁడు విష్ణువు' వీరిద్దఱిలో నెవ్వఁడధిదైవమని పోట్లాటవచ్చెను. కొంతమంది శివుఁడని కొందఱు విష్ణువనిచెప్పిరి. ఈపోట్లాట తీక్ష్ణమైనపుడు తెలివిగల పండితుఁడొకఁడులేచి, "నేను శివునిఁజూడలేదు విష్ణువునుఁజూడలేదు' ఎవ్వరుగొప్పవారయినది యెట్లుచెప్పగలను?" అని చెప్పెను. అట్లేయొకదైవమును మఱియొకదైవమునకుఁ బోల్చకుము. వారిద్దఱిలో నొకరినిఁజూచినపుడిద్దఱును భగవద్రూపములేయని తెలుసుకొనెదవు.

(500) భగవంతునినామము బుద్ధి (చిన్మయుఁడు). ఆయన నివాసస్థానము బుద్ధి. ఆయనసమస్తబుద్ధికిఁ బ్రభువు.

(501) దాహమగుచున్నవాఁడు నద్యోదకము నిర్మలముగా నుండకపోయినను ద్రాగును అప్పుడదిత్రాగక నిర్మలోదకముకొఱకు క్రొత్తగాభావిఁ ద్రవ్వఁడు. అట్లే భగవంతునిఁగోరువాఁడు చేరువనున్నమతమును గ్రహింపక క్రొత్తమతమును సృష్టింపఁ దలఁచడు. నిజముగా నీశ్వరునిఁజూచుట కాసక్తియున్నవానికిట్టి యాలోచనలన్నియుఁ జేయుట కవకాశము లేదు.

(502) కొన్నిసంవత్సరములక్రిందట హిందువులు బ్రహ్మసమాజమతస్థులు వారివారి మతముల నమితాసక్తితో బోధించుచున్నపుడు, "ఈయుభయపక్షములఁ గూర్చి మీయభిప్రాయమేమి?" యని యడుగఁబడి శ్రీరామకృష్ణుఁడు, "నాతల్లియైన జగన్మాతయీ యుభయపక్షములవారిచేతఁ బనిచేయించుకొనుచున్నదని నాయభిప్రాయము"ని ప్రత్యుత్తర మిచ్చెను.

(503) ఆలోచింపక దానమును జేయకుము. ఏలయనిన నొకొ్కక్కప్పుడు పుణ్యముకాక పాపము వచ్చును. అడిగిన బాటసారులకెల్ల నన్నము బెట్టుటకు నొకరొకసత్రము ను వేయించిరి. కటికవాఁడొకయావునుఁ జంపుస్థలమునకుఁ గొనిపోవుచు నలసినవాఁడై యాసత్రమునకువచ్చి భోజనముఁజేసుకొని వెళ్ళి యావునుఁ జంపివేసెను. ఇందువలన వచ్చినపాపము కటికవానికి ఒకవంతు ధర్మశాలాధికారికి మూఁడువంతులు వచ్చెను.

(504) అశాశ్వతమైన పదార్థమునుండి శాశ్వత పదార్థమును సాధింపవలయును. అసత్పదార్థమునుండి సత్పదార్థమ్మును దెలిసుకొనవలయును.

(505) సాత్వికపదార్థములఁదినుచు భగవంతునిఁ జూడఁగోరని వాఁడట్టిపదార్థములఁదినినను మాంసముఁదినినట్లే యగును. కాని మాంసముఁదిని యీశ్వరునిఁ దలఁచువాఁడు. మాంసముఁదినినను సాత్వికపదార్థములఁదినినట్లే యగును.

(506) విషయాసక్తులయినవారేల వైరాగ్యముఁబూని భగవత్సాన్నిధ్యమునకుఁ బోవఁబ్రయత్నింపరు?

ఈప్రపంచము నాటకరంగమువంటిది. దీనిపయి ననేకులనేకవేషముల ధరించి తిరుగుచుందురు. ఒకవేషము వేసుకొనిన వాఁడుకొంచెముకాల మా వేషముతో నాడినఁగాని యావలకుఁ బోవనిచ్చగింపఁడు. వానియిష్టప్రకారము వానినిగొంతకాల మాడనిచ్చినదరువాత వాఁడేపోయి యావేషమును విడిచివేయును.

(507) గంగానదియొడ్డున నివసించువారు పరిశుద్ధులు బవిత్రులు.

(508) ప్రతిపిల్లవానికిఁ జంద్రుఁడెట్లు 'మామ'యనునో యట్లే భగవంతుఁడు సమస్తమానవకోటికి నాత్మైక గురువు. (వంగదేశమందుఁ బిల్లలు చంద్రుని 'మామ' యందురు.)

(509) "ఆత్మ, దేహము" ఈరెంటిని గౌరవించుము.

(510) దీర్ఘాలోచనవలన నాలోచనవిషయముయొక్క స్వభావము తెలిసి యా యాలోచనఁజేయువాని హృదయమునందు బ్రవేశించును.

(511) భూమికంటెఁ జాలఁబెద్దవాఁడయ్యు సూర్యుఁడు విశేషదూరమునందుంటవలన నొకచిన్న పండువలె నగుపడుచున్నాఁడు. అట్లే భగవంతుఁడు గొప్పవాఁడయి

నను మనమాయనకు దూరముగానుండుటవల్ల నాయనగొప్పతనమునుఁ గనుఁగొనఁజాలము.

(512) తరంగములు సముద్రమునకెట్టివియో యవతారము లీశ్వరునకట్టివి.

(513) బ్రతికియున్నంతవఱకు భక్తిప్రేమల మహామహిమలఁ జిత్రములఁ గనుఁగొనుచుండుము. అట్లుచేయుటవలన నీకు లాభము కలుగును.

(514) అనేకవందలమంది నన్నుఁ జూచుటకు వచ్చెదరుకాని నాకు సంతోషము కలుగదు. కాని యొక్కవిరాగి నన్నుఁ జూచుటకువచ్చిన నాకు సంతోషముగనుండును.

(515) సత్యమతముఁగలవాఁడు సర్వమతములు భగవంతునకుఁ జేరు మార్గములే యని తలఁపఁగలయును. ఎప్పుడునుమనము పరమతసహిష్ణుత పరమతగౌరవముఁగల్గి యుండవలెను.

(516) 'క్షమించుట'యే సన్యాసియొక్క నిజమయిన స్వభావము.

(517) ఒకశిష్యుఁడు తనగురువునందు విశేష భక్తిశ్రద్ధలుగలవాఁడై యాయన మహామహిమఁగలవాఁడని నమ్మి యాయన నామమును స్మరించుకొనుచు నదీజలముపైన నడచిపోయెను. ఈతఁడిట్లుచేయుట గురువుచూచి, "నాపేరులో నంత మహిమకలదా? నేనిదివఱలో నీసంగతియెఱుఁగను." అని పల్కి తాఁగూడ నదిపై నడవఁ బ్రయత్నించెను. పాపమాగురువు జలముపైఁ గాలుపెట్టగానే యాతఁడుగూడ నెఱుఁగనివాఁ డగుటవల్లన నడుగునకుఁబోయెను. నమ్మిక యెట్టిచిత్రముల నయినఁ జేయఁగలదు. అహంకారము మనుజుని నశింపఁజేయును.

(518) శంకరునకు మూర్ఖుఁడయిన శిష్యుఁడొకఁడుకలఁడు. ఈయనతనగురువును బ్రతివిషయములో ననుకరించును. గురువు 'శివోహమ్మ'నియనగానే తానుఁగూడ 'శివోహమ్మ'ని యొకపర్యాయ మనెను. శిష్యునకుఁగల యీరోగ మణచవలయుననితలఁచి శంకరుఁ డాతనిని వెంటఁబెట్టుకొని వెళ్ళి యొక కాల్చిన యినుపముక్కను మ్రింగి 'నీవుఁగూడ మ్రింగవలసినది'యని శిష్యునడిగెను. ఈతఁడట్లుచేయలేక దరువాత నెప్పుడు 'శివోహ'మ్మనుట మానుకొనెను- ప్రతిమనుజునిఁ బ్రతివిషయమునందనుకరించుట కూడదుగాని గొప్పవారి చరిత్రలఁజూచి తమతప్పుల దిద్దుకొని బాగుపడుట యెప్పటికిని మంచిది.

(519) ఒకమనుజుని నాతనిభార్య యెప్పుడు పేదయిన యుద్యోగము సంపాదించుకొనుమని వేధించుచుండెను. ఆయనకుమారున కొకప్పుడు బ్రాణముమీదికివచ్చినది.

వైద్యులంలాభము లేదనిరి- అప్పుడు తండ్రి యుద్యోగమునకుఁ బ్రయత్నించుట మొదలుపెట్టెను- ఇంతలోఁబిల్లవాఁడు మృతినొందెను- తండ్రికొఱకై వెదికిరిగాని యెక్కడను గానరాఁడయ్యె- రాత్రివేళఁ జాలప్రొద్దుపోయి యాయన యింటికి వచ్చుచుండెను- “ఇంతయాపత్తుసమయములో నెక్కడికి నేగితివి, వివేకహీనుఁడా!”యని చీవాట్లఁ బెట్టనప్పుడు భర్త నవ్వుచు, “నాకేడుగురు కొడుకులు పుట్టినట్లు వారితో నాకాలమును సుఖముగా గడుపుకొనినట్లు నాకొకపర్యాయము కలవచ్చినది- నిద్రమేల్కొన్న పుడెవ్వరునులేరు- కల కల్లయాయెను- అందులకు నే నేమాత్రముఁ జింతింపలేదు- అని బదులు చెప్పెను- అట్లేయీలోకమును వట్టికలయనుకొనువాఁడు విషయబంధనముచేఁ గట్టుబడి సుఖదుఃఖముల ననుభవింపఁడు-

(520) ఒక పెద్దతటాకము చుట్టు ననేక చోట్ల స్నానములఁజేయుటకు వీలగునట్లు మెట్లనుగట్టిరి- ఏమెట్లయొద్దకు నేగిదిగినను నీటిలోపలికి వెళ్ళుదువు. కనుక ‘నా మెట్లు మంచివ’ని యెవరు బోట్లాడనవసరములేదు. సచ్చిదానందమను సరస్సున కనేక రేవులుకలవు. లోకమునందుఁగల ప్రతిమతము నొక రేవైయున్నది. ఈరేవులలో దేనినయిన నెన్నుకొని లోపలికివెళ్ళఁబ్రయత్నించిన సచ్చిదానంద రసమునుఁ బొందనేర్చెదవు. అంతియకాని నామతముమంచిదనియు, నీమతము దూష్యమైనదనియు’నెన్నఁడును బోట్లాడకుము.

(521) గంటను వాయించునప్పుడు వినఁబడుశబ్దముల కాకారమున్నట్లు మనకు స్పష్టముగఁ దెలియును- కాని వాయించుట యాపివేసినతరువాతనగు శబ్దమును జక్కఁగాఁ దెలుసుకొనలేము. ఈశబ్దము క్రమక్రమముగా నణఁగిపోవును- గంటధ్వనివలె భగవంతునకును రూపారూపములురెండును గలవు.

(522) ‘మాయ’ అనునదియుండుటవల్లనే మనకు వివేకమునుఁ బొందుటయని సచ్చిదానంద సుఖము ననుభవించుటయని కలదు- ఆమాయలేనియెడల మనమిట్టి సుఖముఁ బొందుదుమని యెవ్వరూహింపఁగలరు? మాయనుండియద్వైతమనిద్వైతమనికలుగుచున్నది. మాయకావల వైపున ననుభవించువాఁడని యనుభవింపఁబడునదియని రెండులేవు.

(523) భక్తుఁడు శాశ్వతమైనంతకాలము భగవంతునితోఁ గలసియుండునా? కలసియుండినెట్లు?

ఉ॥ వృద్ధుఁడయిన సేవకుని నీతికి, మర్యాదకు, మంచిపనులకు, నసమాన విధేయతకు మెచ్చుకొని యాతని యంగీకారములేకున్నను దనపీఠముపై నెట్లుకూర్చుండఁ బెట్టుకొ

నునో యట్లు జగన్నాథుఁడయిన దేవుఁడు తనభక్తుని పరమభక్తికిని స్వార్థత్యాగమునకు మెచ్చుకొని యాతనికి నిష్టమున్నను లేకపోయినను దనసింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టుకొని దైవత్వమొసఁగుచుండును.

(524) ఒకపర్యాయ మాకాశమునిర్మలముగానుండి యంతలో మేఘములచేఁ గప్పఁబడి తిరిగియప్పుడే నిర్మలమగుటఁజూచి పరమహంస నృత్యముఁజేయుచు సంతోషముతో, "మాయగూడ నిటువంటిదియే. ఆ మెపూర్వము లేదు. బ్రహ్మమను యాకాశమునంతలోఁగప్పి సర్వప్రపంచమునుసృష్టిఁజేసి తిరిగి బ్రహ్మముయొక్క యుచ్ఛ్వాసము వలననే మాయమైపోయినది"ని పలికెను.

(525) ఊరకఁ బిల్లలఁ బుట్టించి పెంచినంతమాత్రమున మొగతనమగుపడదు. ఏలయనినఁ గుక్కలుఁబిల్లులు బిల్లలఁగని పెంచుటలేదా? కనుకఁ దాఁజేయవలసిన విధినిఁదెలిసికొని దానిని నెఱవేర్చినప్పుడు నిజమయిన మొగతనమగుపడును. ఇట్టిమొగతనమర్జునిని యందుమాత్ర మగుపడుచున్నది.

(526) గురువు శిష్యునకు బోధఁజేయుచు 'బ్రహ్మము, మాయ'యను యీరెంటినిఁదెల్పుటకు రెండువ్రేళ్ళనుఁజూపెను. అంతటనొకవ్రేలినివాల్చి మాయయణఁగిపోవునని యుఁ బ్రపంచమంతయునశించి బ్రహ్మ మొక్కటిమాత్రము నిలుచుననియు బోధించెను.

(527) భగవంతుఁడు దర్శనమివ్వకుండునంతవఱకు, హీనలోహము చింతామణివలన బంగారముగా మారనంతవఱకుఁ 'గర్తను నేన'నియు, 'నేనుమంచిపనిఁజేసితిని. నేను దుష్టకార్యమాచరించితి'నని మానవునకుండును. ఈభేదమే ప్రపంచము కొనసాఁగుటకు నవసరమైన మాయయైయున్నది. సన్మార్గమవలంబించుటవల్లఁగల్గిన విద్యామాయ (సత్వగుణప్రధానమైన మాయ)నుఁ బొందగల్గినట్లయిన భగవంతునిఁ జేరగలర్హు. కండ్లయెదుట నీశ్వరునిఁజూడఁగల్గినవాఁడే మాయనుదరింపఁగలఁడు. ఈశ్వరుఁడే కర్తయనియు దాఁగాదనియుఁ దెలిసికొనినవాఁడు దేహధారిగానుండినను నిజమైన స్వేచ్ఛనుగలవాఁడగుచున్నాఁడు.

(528) ఎప్పుడును బంగారమును గోరు పిశాసివానివలె నీవెప్పుడు భగవంతునిఁ గోరుము.

(529) 'ఈశ్వరప్రేమ'యను రసమును బూర్తిగాఁగ్రోలిన పరమభక్తుఁడు తృప్తియగునట్లు కల్లుఁద్రాగి యుక్తతప్పెఱుంగని వానివంటివాఁడు.

(580) దొంగచీకటింటిలోఁ బ్రవేశించి ధనపుపెట్టెకొఱకు వెదుకులాడును- ఒక తడవబల్లనుదాకి యిదికాదని యావలకుఁబోయి కుర్చీని దాకును, తిరిగి యిదికాదని తలఁచుచు నీవిధమున నిల్లంతయు వెదికి తుదకు ధనపుపెట్టెనుఁ గనుఁగొనఁగల్గును- అప్పుడాతఁ డిదిరాయని యనుకొని యిఁక వెదుకులాడుట మానును- పరబ్రహ్మమునకు వెదుకులాడుటగూడ నిట్టిదియే.

(581) గడ్డి తుంగ పెరుగుచున్న నీటిగుంటలోఁ గల మత్స్యములు బయటికి నగుపడవుగదా. అట్లే భగవంతుఁ డాత్మలో నృత్యముఁజేయుచున్నను మాయచేఁగప్పఁబడి మానవుల కగపడఁడు.

(582) మానవునకు నేమాత్రము కోరికయొక్క చిహ్నములుండినను నాతఁడు స్వర్గమునకుఁ బోఁజాలఁడు. దారపుకొన సరిగాలేకఁ జిన్నచిన్నవిడిపోగులుఁగలిగి చీలియున్నయెడల సూదిరంధ్రములోనెక్కునా? ఎన్నఁడు నెక్కదుగదా.

(583) భగవంతునిఁ గనుఁగొనినవాఁడే జ్ఞాని. ఈతఁడు పిల్లవానివలె నొకవిధమైన యహంకారముఁగలిగియుండును- ఇయ్యది కుచ్చితముతోఁ గూడుకొనినది గాదు. పిల్లవానియాత్మకును బెద్దవానియాత్మకునుఁ బోలికలేదు.

(584) పిల్లవానియహము దర్పణమందుఁ బ్రతిఫలించుప్రతిబింబమువంటిది. ముఖప్రతిబింబము ముఖాకారమునే కలిగియున్నను నెవ్వరికిహానిఁజేయదు.

(585) మనస్సనఁబడుసముద్రము కామమనువాయువుచే నెంతవఱకుఁ గదలింపఁబడుచుండునో యంతవఱకు మనము దానిలోనీశ్వరునిప్రభనుఁజూడలేము. భగవంతునితోఁ గలసి శాంతిఁగలిగియున్న మనస్సునందు దివ్యప్రభగోచరమగును-

(586) భగవద్దర్శనమయినతరువాత మానవుఁడు మున్నటివలెనుండకమారిపోవును

(587) మన కాహారమిచ్చుచున్నాఁడని యీశ్వరుని దయఁగలవాఁడనుటకు వీలులేదు- పిల్లవానికిఁ దండ్రి యన్నముఁబెట్టకఁదప్పునా? ప్రపంచవిషయములందు భ్రాంతిఁగలిగి పెడమార్గమునుద్రొక్కి మనమణగిపోవుచుండ నీశ్వరుఁడప్పుడు మనలమఁగాపాడినయెడల నాయనను దయార్ద్రహృదయుఁడనవచ్చును.

(588) సమాధియొక్క యేడవమెట్టుఁజేరఁగల్గి భగవంతునిలోఁ గలసినవారు కొంతమంది యక్కడనుండి తిరిగివచ్చి మానవకోటిమంచికై పనిఁజేయుచుందురు. అట్టి

వారికి విద్యయను యహముండును. కాని యియ్యది వట్టిరూపమునకే. ఇది నీటిపైవ్రాసి న గీతవంటిది.

(539) సమాధి తుదదశనుబొందినవారు కొందరు భక్తుని యహము, సేవకుని య హముఁగలిగియుందురు, శంకరాచార్యు లితరులకు బోధఁజేయుటకు 'విద్య'యను యహ మును గలిగియుండవలయును.

(540) గురువు శిష్యులకుఁజరిగిన సంభాషణ:—

గు॥ నా కేమయిన యభిమానముకలదా?

శి॥ ఉన్నది. సూక్ష్మముగానున్నది. 1 దేహమునుధరించియుండుటకు- 2 భగవద్భ క్తి నభ్యాసముఁజేయుటకు- 3 భక్తులసాంగత్యముఁజేయుటకు- 4 నితరులకుబోధఁజేయు టకు- నీ యతిసూక్ష్మమయిన యభిమానమయిననుండును. దీనిఁ జిరకాలము తపస్సుఁజేసి నతరువాత గలిగియున్నారు. మీయాత్మ స్వాభావికస్థితినిఁదెలుపుటకు 'సమాధి' యని చెప్పినఁజాలదు. కనుక మీయభిమానము తపోఫలమనియే నేనుచెప్పుదును.

గు॥ అవునుగాని దానిఁగల్గినది నాతల్లియైన జగన్మాతకాని నేనుకాను. నాప్రార్థ న పాలించుపని యా జగన్మాతదై యున్నది.

(541) హనుమంతునకు సాకారనిరాకారములతో భగవంతుఁడ గుపడినాఁడు. అయినను నాయన (హనుమంతుఁడు) సేవకునియహముఁ గలిగియున్నాఁడు. నారద సన కసనందన సనత్కుమారులస్థితియు నిట్టిదియే.

(ఇచ్చట 'నారదాదులు భక్తులేకాని జ్ఞానులుకారా?'యని యడుగఁబడి భగవా ను 'నారదులు బ్రహ్మజ్ఞానమునుఁబొందినారు, ఇంకను వారు నదీజలమువలె నెమ్మదిగా హరికీర్తనలఁ బాడుచున్నారు. దీనివలన వీరు 'విద్య'యను యహమును గలిగియున్నట్లు గూడ మనకుఁ దెలియుచున్నది. ఈశ్వరునివదలి ప్రత్యేకముగనున్నారని యిది సూక్ష్మ ముగఁ దెలియఁజేయుచున్నది. విద్యయను యహమునుగలిగియున్నది. పరులకు వేదాంత రహస్యములఁ బోధపఱచుటకేయైయున్నది.

(542) సముద్రమడుగుభాగముననున్న ముత్యపుచిప్ప స్వాతినక్షత్రము వచ్చిన తోడనే వాననీరుఁద్రాగుటకై నీటిపైభాగమునకు వచ్చుచుండును. ఈచిప్ప దానిలో వా నబొట్టుపడుటకుఁదెఱచుకొనియుండి పడగానే క్రిందికిఁబోయి ముత్యమేర్పడువరకు స

ముద్ర మడుగుభాగముననేయుండును. అట్లే కొంద ఱాసక్తిఁగలిగిన భక్తులు సద్గురువు కొఱకు నొకస్థలమునుండి మఱియొకస్థలమునకుఁ దిరుగుచుందురు. తుదకు సద్గురువు దొరికిన నాయనయుపదేశముల శిరసావహించి లోకమునుఁబరిత్యజించి మనఃపద్మమునందుఁ దపస్సునాచరించి సచ్చిదానందబ్రహ్మమునుఁబొందుదురు.

(543) ఈకాలమువారు ప్రతివిషయముయొక్క ప్రధానాంశముఁగూర్చి జాగ్రత దీసికొనెదరు. వారు మతముఖ్యాంశముల నొప్పుకొందురు- కర్మలు మొదలయిన స్వల్పాంశంబుల కంగీకారమివ్వరు,

(544) ముత్యమునుగలిగియుండు శుక్తియే చాలా విలువఁగలిగియుండును. ఆది ముత్యము పెద్దదియగుటకు నదికావలయును. ముత్యముగలవానికి నాశుక్తితోఁబనిలేకఁబోవచ్చును- అట్లే భగవంతునిఁగనుఁగొనినవారికి గర్మలతోఁ గ్రియలతోఁబనిలేకఁబోవచ్చును.

(545) తుంగపెద్దదియై నిర్మలజలపూరితంబగు తటాకంబులోఁబెరుఁగక బురద గుంటలోఁ బెరుగుచుండును- అట్లే మతభేదములు పరిశుద్ధమయినట్టియుఁ బూజ్యమయినట్టియు నిష్కపటమునునయిన తలంపులుగలవారి హృదయములందు పుట్టవు- కాని దురభిమానముఁ గపటత్వము స్వపక్షాభిమానముఁగలవారికిఁ గలుగుచుండును-

(546) ఇతరులకునియమించుపనిని నీవేచేయుము-

(547) దుష్టునిమనస్సు కుక్కయొక్క వంకరతోకవంటిది-

(548) క్రొత్తగాఁబుట్టినదూడ యత్యుత్సాహముఁగలిగి స్వేచ్ఛగఁ బరుగిడుచుఁ దల్లియొద్దఁ బాలుద్రాగునపుడుమాత్రము నిలిచియుండును- కాని మెడకుఁద్రాడుబెట్టగానే మొదటనున్న యుత్సాహముతగ్గి దిగులుపడినమనస్సుఁగలదయి త్వరలోఁ జిక్కిపోవును- అట్లే లోకవ్యవహారములందు సంబంధముండునంతవఱకు మానవుఁ డుత్సాహముఁ గలిగియుండును- కాని వివాహబంధముచేఁగట్టఁబడి సంసారబాధలు పైఁబడినతరువాత సంనోవముడిగి 'జాగ్రత్త, జిజ్ఞాస, కోరిక' వీనినిఁగలిగియుండును- కాలమతిక్రమించినకొలఁది వృద్ధుఁడగుచుండును- గనుకఁ గ్రొత్తగావికసించినపుష్పమువలెఁ బ్రకాశమానముగను బ్రాతఃకాలవాయువువలె స్వేచ్ఛగను మంచుబిందువువలె నిర్మలముగనునుండి సర్వకాలములందుఁ బసివానివలె నుండువాఁ డెంతటిపుణ్యుఁడోగదా-

(549) ఈగ యొకసమయమునందు మనుజునిపుండుపై వ్రాలి మఱియొకసమయమునందు భగవంతున కర్పణఁజేయఁబడు పదార్థములపై వ్రాలునట్లు విషయాసక్తుడయి

సదానిమనస్సుఁగూడ నొకపర్యాయము మతవిషయముల నాలోచింపుచు నింకొకతడవ భాగ్యకామాదిజనితసుఖములఁ గోరుచుండును.

(550) అధికమయినజ్వరమువచ్చి దాహముచేఁజచ్చుచున్న మానవునియొద్దఁ జల్లని నీరు సువాసనఁగల పదార్థములనుంచిన వాఁడు వాని నపేక్షింపకుండునట్లు కోరిక యనుజ్వరముచే బాధింపఁబడుచు గామసుఖమను దప్పికఁగలిగి 'కాంత, భాగ్యము' యను యీసుగంధద్రవ్యములచే నరుఁడు తప్పక నాకర్షింపఁబడును.

(551) పెరుగుకుండలోఁ బాలునుంచ నెవరుసాహసింతురు. ఏలయనిన నీపాలు గూడ బెరుగుగామారునని భయముండును. ఇంకొకబనికి నుపయోగించిన నిప్పుమీదఁ బెట్టగానే పగిలిపోవునను భయముచేత నాకుండను మఱియేపనికిఁగూడ నుపయోగింపరు.

(552) మన స్సెట్టిస్థితినిఁబొందినపుడు విషయాలోలునకు ముక్తిగలుగును?

ఉ॥ భగవదనుగ్రహమువలన వైరాగ్యముకలిగి యందువల్లఁ గోరిక ధనాపేక్ష మొదలగునవినశించిన లోకసంబంధము తెగిపోయి స్వేచ్ఛుఁడగును.

(553) భగవంతుఁడున్నగది తాళముఁదీయునపుడు దానితాళపుచెవి చిత్రముగ వ్యతిరేకముగఁ దిరుగును. ఈశ్వరునిఁజేరుటకు ప్రపంచమును విడువవలయును.

(554) భగవానుఁడొకప్పుడొకరితో 'జీవితకాలమునంతయు లోకమందుఁగడపి యిప్పుడు భగవంతునిఁగనుఁగొనుటకు వచ్చితివి. భగవంతునిఁగనుఁగొని పిమ్మటఁ బ్రపంచములోఁబ్రవేశించిన నెంతబాగుండునది.''

(555) సంగతులఁజెప్పకొనకుము. వ్యవహారమునుఁ దలపెట్టుకొనకుము. యుక్త కాలమున నాచరింపవలసినదాని నొనరింపుము. సర్వకాలములయం దీశ్వరునిపై నీ మనస్సు నిల్పుము.

(556) తలఁచినది తలఁచినట్లుగాఁజెప్పుము. మాటలకుఁ దలఁపులకు సంబంధముం డనిమ్ము. బయటికి నీశ్వరుఁడే సర్వమనిచెప్పుచు నంతర్హృదయమున సర్వమును లోకమే యని నమ్మి పనిఁజేయకుము. అట్లుచేసిన ఫలముండనేరదు.

(557) ఒకపర్యాయము కొందఱు బ్రహ్మసమాజమతస్థులయిన బాలురు నాకుఁదాము జనకుని ననుకరించితిమని చెప్పిరి. లోకములోనివసించుచు లోకమును విడిచిపెట్టిర

ట- 'మీరట్లు చెప్పవచ్చునుగాని నిజముగా జనకునివలెనుండుట కష్టము'ని వారితోఁజెప్పి తిని- లోకస్పర్శలేక నీజగమందుండుట దుర్లభము- జనకుఁడెన్ని కష్టములఁ దుదకుఁబొందె ను? అన్ని కష్టములను మీ రనుభవించుట నాయభిప్రాయముకాదు- కాని భక్తిజ్ఞానము లు కలుగువఱకు నేకాంతముగనుండి భక్తినవలంబించి తరువాత లోకవ్యవహారములఁ జూ చుకొనుము- పాలనుఁగదల్చకనున్నప్పుడే మంచిపెరుగుఁ బొందుదుము- ఏమాత్రముఁగద ల్చినను బెరుగుపాడై పోవును- జనకుఁడు ప్రపంచమును విడిచినాడుకనుక నాయనకు 'వి దేహ'యని పేరువచ్చినది- అతఁడు జీవన్ముక్తుఁడు- భగవంతునియందు దేహమును లీన ముఁజేయుట చాలాకష్టము- నిజముగా జనకుఁడు మహాపురుషుఁడు- ఈయన యనా యాసముగ 'జ్ఞాన, కర్మ'లనఁబడు రెండుకత్తులను ధరించెను-

(558) లోకమునువిడువ నీకుఁ గోరికయున్నయెడల మొదట కొన్ని దినములు ప్రార్థనఁజేయుట నభ్యసించవలయును- ఒక్కసంవత్సరమయినను లేక నర్థసంవత్సర మయినను లేక మాస మొక్కటయినను లేకఁ గనీసము పంద్రెండుదినములయినను నే కాంతముగనుండవలెను- సంతతము భగవన్నామస్మరణఁజేయుచు నీశ్వరప్రేమను నాకుఁ గలుగఁజేయుమని కోరుము- ఈప్రపంచమందు 'నాది' యని పిలువదగిన విషయమేది యులేదని నిశ్చయించుకొనవలయును. 'నావి'యని నీవుతలఁచునవి త్వరలోనశించును- భగవంతుఁడు నిజముగా నీవాఁడు- నీకు సర్వము నాయనయే- 'సర్వశక్తుఁడయిన యీశ్వరుని యెట్లుచేరుదునా?' యని నీ కాలోచనయుండవలయును-

(559) పరులకు నీ యభిప్రాయములను నీ భక్తియుఁ దెలియపఱచకుము- నీ విష య మితరులెఱింగినఁ జాలానష్టముసంభవించును-

(560) ఏనుఁగను శుభ్రముగఁగడిగి వదలిపెట్టినఁ దిరిగి యప్పుడే దుమ్ముఁబోసుకొ నును- అట్లుగాకఁ గడిగి యొక్కచోటఁగట్టివేసిన నిర్మలముగానుండును- అట్లే సజ్జన సాంగత్యమువలన నొక్కపర్యాయము పరిశుద్ధుఁడయినవాఁడు తిరిగి ప్రపంచములో నిష్ట మువచ్చినట్లు సంచరించిన నాపవిత్రతఁగూడ నశించును- సర్వకాలములందు మనస్సు నీ శ్వరునిపై నిల్పిన నీయాత్మచెడిపోదు- ఎప్పుడు నిర్మలముగానుండును.

(561) మలినసహితమయినదర్పణము సూర్యబింబమును ప్రతిఫలింపదు- ఆవిధము న నే పరిశుద్ధమై నిర్మలముగానుండనిమనస్సు మాయకులోఁబడి భగవత్ప్రభను జూడనేర దు- నిర్మలమయినయద్దము సూర్యబింబమును ప్రతిఫలించురీతి పరిశుద్ధమనస్సుగూడ నీశ్వ రరూపమును బ్రతిఫలించును- కనుక నీవు పరిశుద్ధుఁడవుకమ్ము-

(563) 'గ్రంథ'యను పదమునకెప్పుడు 'శ్రుతి'యని యర్థముఁజెప్పుటకు వీలులేదు. 'ముడి'యనిగూడ నర్థముకలదు- గ్రంథమునుజదివిన మహాశక్తిఁగల్గి సత్పదార్థమునుఁగనుఁగొని డాంబికమును సమస్తలోకసుఖములను విడచుట నేర్చుకొనవలయును- ఈరకజదివి యావలనుంచిన విద్యాగర్వ మహంభావత్వములు జనించును- ఇవి యన్నియు ముళ్ళవంటివి-

విశేషముఁ జదువుకొననివారు మహాగర్వితు లగుదురు. 'భగవంతుఁడ'ను విషయముపై నాకు మఱియొకరికి సంభాషణజరిగినది-, అప్పుడాయన 'ఇవియన్నియు నే నెఱుఁగుదున'ని పలుకగా నేను, "డిల్లికి వెళ్ళినవాఁడు నేనచ్చటికి వెళ్ళివచ్చితినని కనఁబడినవారితోనెల్లఁ జెప్పుకొని డాంబికముఁజేయవలయునా? నేను బాబునని బాబు చెప్పుకొనునా?"యని బదులు చెప్పితిని-

(564) ఆత్మికజ్ఞానముఁబొందలేనివారిలో నీక్రిందఁజెప్పఁబడినవారుకొంతమంది:-

(1) విద్యాగర్వముఁగలవారు (2) తెలివిఁగలవారమనువారు (3) భాగ్యమున్నదియని డాబులఁజెప్పువారు- వీరితో నెవరయిన, "అక్కడ నొకసన్యాసిగలఁడు. చూచుటకు మీరుగూడవచ్చెదరా"యని యడిగిన నేవేవియో కారణములఁజెప్పి తుదకు రాలేమందురు- అప్పుడువారు మనస్సులో, "మనము విశేషముఁ దెలిసినవారము- పరులయొద్దకుఁ బోఁగూడద'ని తలఁచుచుందురు-

(565) ఈలోకములో నే సంబంధము లేకపోయినఁ గొన్నిటినిఁ గల్పించుకొని సంబంధముఁబెట్టుకొనువారు కొందఱుకలరు- స్వేచ్ఛఁగల్గియుండుటకు నిచ్చగింపరు- సంసారమని, చుట్టమనిలేనివాఁడు భూసంబంధమునుఁ గల్పించుకొనుటకు నొకపిల్లినిఁగాని కుక్కనుఁగాని పక్షినిఁగాని కోతినిఁగాని పెంచుచుండును- ఇట్లుపాలనుఁ ద్రాగఁగోరివానిఁగాఁగబెట్టగానుండు నీరునుద్రాగి దప్పికఁదీర్చుకొందురు- మానవకోటిపై మాయకుఁగల యధికారమిట్టిది-

(566) అధికమైన జ్వరమువచ్చి దప్పికచే బాధఁబడుచున్నవాఁడు సముద్రమునంతయు నొక్కతడవఁ ద్రాగివేయుదునని తలఁచును. ఆజ్వరముపోయిన తరువాత దోసెడు నీటితో దాహముఁదీర్చుకొనును- అట్లేమాయయను జ్వరముతోఁ దీసికొనుచున్నవాఁడు తనస్వల్పత్వము నూహింపఁజాలక దనహృదయమునందే భగవంతుని నుంచుకొనెదనని తలఁచును- మాయావిముక్తుఁడయినవాఁడు సచ్చిదానందమునయొక్క యొకచిన్న కిరణము వలన నిండిపోయఁబడును-

(567) భగవంతునియం దాసక్తిఁగల్గినవాని మనస్సు భోజనమును స్వల్పాంశము నుఁ దలఁచనే తలఁచదు.

(568) ధనమున్నంతమాత్రమున గర్వపడనేల? నీవు భాగ్యవంతుఁడ వనుకొనిన నీ కంటె భాగ్యవంతులుకలరు. వారితో నిన్నుఁబోల్చినట్లయిన నీవుకటికబీదవాఁడవు. రాత్రివేళ మిణుగురులు లోకమంతయు మనవల్లనే ప్రకాశించుచున్నవని తలఁచును. నక్షత్రములుగూడ నట్లే తలఁచును. కాని చంద్రుఁడు పైకెక్కి రాగానే నక్షత్రకాంతియు డిగిపోవును. కనుకనిప్పుడు చంద్రుఁడు, "ప్రపంచము నామూలముననే శృంగారముగఁ బ్రకాశించుచున్నది. సంతోషమున నోలలాడుచున్నది"యని యెంచును. ఇంకఁ గొంత కాలమునకు సూర్యుఁడు వచ్చుచున్నాఁడని తెల్పుచు నరుణోదయమగును. అయ్యో! ఇప్పుడు చంద్రుఁడెక్కడ! చంద్రకాంతియెక్కడ! భాగ్యవంతులమని తలఁచువారుస్వాభావికవిషయములఁ గొంచెము పరికించిచూచిన నెప్పుడును గర్వపడరు.

(569) ధనమును సేవకునిగాఁగల్గినవాఁడు నిజమైనమనుజుఁడు. ధనము నుప యోగించ నెఱుఁగనివారు మనుజులని పిలువఁబడుట కనర్హులు.

(570) వంగదేశభాషయొక్క వర్ణములలో 'శ,ష,స' యనుమూఁడువర్ణములు నొకటేధ్వనినిచ్చుచున్నవి. వీనికన్నిటికి నర్థము 'విడిచిపెట్టుము'అని చెప్పుదురు. మనక క్షరముల నేర్పునపుడే విడువుమని నేర్పుచున్నారు. ప్రతిమనుజునకు 'విడిచిపెట్టుట' ముఖ్యము.

(571) అహంభావత్వ ముండునంతవఱకు నాత్మైకజ్ఞానము ముక్తిలభింప నేరదు. జననమరణాదులకుఁ దుదయుండదు.

(572) గుడ్డవడ్డముఁబెట్టినట్లయిన మనమెంతదగ్గఱగానున్నను నీవున్నుఁ జూడలేవు. అన్నివస్తువులకంటె భగవంతుడునీకు దగ్గరగానున్నాఁడు. అహంభావత్వమను తెర యడ్డముండునంతవఱకు నీ వాయనను జూడలేవు.

(573) మనమేల నిట్లు బంధింపఁబడితిమి? ఏలభగవంతునిఁ గనుఁగొనలేము?

ఉ॥ జీవున కహంభావత్వమేమాయ. ఇయ్యది జ్ఞానమను వెలుతురును రానివ్వదు. అహంభావత్వముపోయిన సర్వముపోవును. 'నేను కర్తనుగా'దనుమాట దైవానుగ్రహమువల్ల మనస్సునకుఁదోచిన నీజన్మలోనే మానవుఁడు విముక్తుఁడగును. ఇకనాతనికిఁగల్గు భయములేదు.

(574) కీర్తికిఁ బాటుపడువారు నిజముగా మాయాంధకారులు. వారు "సర్వమునకు నీశ్వరుఁడే కారణమనియు, నాయనయే సమస్తమును జరుపుననియు" తలఁచరు. ప్రాజ్ఞులయినవారు, "ఓ దేవా! నీవు కర్తవు. సర్వమును నీవే" యని యందురు. మాయాంధకారులు, "సర్వము నేనే, నేనే" యని తలఁచెదరు.

(575) "నే నెఱుఁగుదును, నే నెఱుఁగుదు" నని నీవు చెప్పునంతవఱకు స్వతంత్రుఁడవని తలఁచుచుందువు. నా జగన్మాత, "నేను నీ యహమును నశింపఁజేసిన తరువాత నే నీవు సమాధియందు నా నిరాకారత్వమును జూడఁగలుగుదువ" ని చెప్పును. అంతవఱకు నాయందు నాయెదుట నహంభావత్వము కలదు.

(576) 'నేన'ను నీ యహమును నీవు పోఁగొట్టుకొనలేక పోయిన, "నేను సేవకుఁడ" ననుకొనుము. "ఈశ్వర సేవకుఁడ" నని యర్థమిచ్చు 'నేను' అనుమాటకింత భయపడవలసిన యావసరము లేదు. మిఠాయి యజీర్ణరోగమునకుఁ గారణమగును. పటికబెల్లము జబ్బుజేయదు. కనుక నిది మిఠాయిలోఁ జేరదు.

(577) 1 "నేను సేవకుఁడన" నుమాట, 2 భక్తుని మాటయగు 'నేను' 3 పిల్లవాని మాటయగు 'నేను' ఈ మూఁడు పదములు కఱ్ఱతో నీటిమీఁద వ్రాసిన గీతవంటివి. అవి చిరకాలముండునవి కావు.

(578) 'నేను' అనుమాట నాలోచించిన నది యహంభావత్వసూచకమని మనకుఁ దెలియును. దీనిఁ బోఁగొట్టుకొనుట కసుదుర్లభము. 'నేను' అను నామనస్సా! నీ కహంభావత్వము నశింపకుండిన భగవంతుని సేవకుఁడవు కమ్ము. అప్పుడీ 'నేను' పరిపక్వమయిన యహమనిపించుకొనును.

(579) నీవు గర్వపడు నెడల భగవంతుని సేవకుఁడనని భగవంతుని పుత్రుఁడనని గర్వపడుము. గొప్పమహాత్ములకుఁ బసిపిల్లల స్వభావముండును. అహంభావత్వము లేదు గనుక వారు దేవునిముందర బిల్లలవంటివారు. వారిబలము సర్వస్వము భగవంతునిదై యున్నది. వారిస్వంతమైనది యేదియు లేదు.

(580) సర్వము నీశ్వరుని యిష్టముండుటవల్లనే జరుగుచున్నదనియు నాయన చేతిలోఁ బ్రతిమనుజుఁడు నొకచిన్న పని ముట్టనియుఁ దెలిసికొనినట్టి మనుజుఁడీజన్మలోనే స్వేచ్ఛుఁడగును. "ఓ దేవా! నీవు నీపనినిఁ జేయుదువు. 'మేము చేసితిమ'ని విషయాసక్తులు వచింతురు."

(581) అహంభావత్వము మాయమైపోయిన స్వేచ్ఛకలుగును. అప్పుడు నీయాత్మ పరమాత్మలో లీనమగును-

(582) జీవునినిజస్వభావము శాశ్వత సచ్చిదానందమయియున్నది. తననిజస్వభావము మరచిపోవుటట్టిన్ని యుపాధులను గల్పించుకొనునది యహంభావత్వము.

(583) విద్యాహమని సేవకాహమని పక్వమైన యహము రెండువిధములు-

(584) 'దుష్టమైనయహ'మని దేనికి పేరు? ఉ॥ 'వారు నన్నెరుగరా? నా కింత భాగ్యమున్నది. నాకున్నంతభాగ్య మెవ్వరికిఁగలదు? ప్రపంచములో నాకంటె నధికులైనవారు లేర'ని తలఁచుయహము దుష్టమయినయహమనఁబడును.

(585) అజ్ఞానమువలన వృద్ధిఁజెందిన యహంభావత్వము తమస్సుస్వభావమైయున్నది.

(586) నే నెప్పుడు స్వేచ్ఛఁజెందగుదును? 'అహం' నశించినపిమ్మట నాకు స్వేచ్ఛకలుగును- 'నేను, నాది' యనితలఁచుట యజ్ఞానము. 'నీవు, నీది'యని యనుకొనుట పరమజ్ఞానము. నిజమయిన భక్తుఁ డెప్పుడు 'ఓదేవా! నీవుకర్తవు. సర్వమును నీవు చేయుదువు- నేను కేవలము నొకసాధనమునై యున్నాను- నీవుచేయుమనినదానిఁ జేయుదును. ఇదియంతయు నీప్రభ, నీకీర్తి, ఈయిల్లు నీసంసారము నీవికాని నావికావు. నేను నీ వాజ్ఞాపించినదిమాత్రముఁ జేయఁగలవాఁడన'ని తలఁచును.

(587) ఒకపర్యాయ మొకవిద్యార్థి 'ప్రతిమనుజునియందు హరి యున్నాఁడు కనుక నెవరునెట్టినయన్నమునయినను దినగూడదా?'యని పరమహంసనడుగ నీయన 'నీవు బ్రాహ్మణుఁడవా?'యని యడిగెను. 'ఔన'ని విద్యార్థి బదులుచెప్పినమీదట భగవాన్ 'అందువల్లనే యిట్లడిగితివి. నీవు నిప్పుపుడకనుముట్టించి దానిపై నొకకొయ్యను వేయఁగా నది యేమగున'ని తిరిగిప్రశ్నించెను. 'ఆరిపోవున'ని ప్రత్యుత్తరమివ్వఁబడి తిరిగి భగవాన్ 'కారుచిచ్చు మండుచున్నది. అందులోఁ బచ్చనిమఱ్ఱిచెట్టును వేయుదువు- ఇప్పుడేమియగున'ని ప్రశ్నించ విద్యార్థి 'అదియంతయుఁ గాలి బూడిదయగున'ని జవాబుచెప్పెను. అప్పుడు భగవాన్ 'అట్లే నీజ్ఞానము తక్కువయైనదియైనఁ బ్రతి మనుజుని చేతియన్నముఁదినిన జ్ఞానమునశించునని భయపడుదువు. అది విశేషమయినది యైనయెడల నెక్కడ భుజించుటకు నీకుభయముండదు.

(588) విజ్ఞానముఁగలవారే మతమునకుసంబంధించని యొకమతములోఁజేరినవారు-

(589) నేనుబ్రతికినకొలఁది భక్తిప్రేమల చిత్రము లనేకములు చూచుచున్నాను

(590) భక్తితోఁజేసిన సంభాషణనంతయు నొరులకుఁజెప్పుట స్త్రీలకు సిగ్గుగా నుండును- కనుక నెవ్వరితో జెప్పరు- ఏవిధముగానయిన నది పరులకుఁదెలిసిన విసుకు కొందురు- ఇట్లయినను తమప్రియురాండ్రతోఁ జెప్పుచునేయుందురు- వీరితోఁజెప్పువర కును వారికి నేమియుఁ దోచదు- సమాధియందు దాననుభవించుయానందమును భక్తుఁ డు మఱియెవ్వరికిఁ జెప్పనిచ్ఛగింపఁడు గాని తనవంటిభక్తులకుమాత్రము తెలుపును. ఇట్లు చెప్పనంతవఱకు నోర్పుండదు. చెప్పుటవలన సంతోషముకలుగును.

(591) పంచదారలో నీరుబోసి నిప్పుమీదఁగాచిన దానిలో నపరిశుద్ధపదార్థ ముండునంతవఱకు బాగయు నొకవిధమయినశబ్దమునువచ్చును. ఈ పదార్థమంతయుఁ బోయినతర్వాత నాపాగయు శబ్దమునణఁగిపోవును. తుదకుఁ బరిశుద్ధపదార్థమంతయు నొకచోటఁజేరియుండును. భక్తిఁగలవానిస్వభావముఁగూడ నటువంటిదియే.

(592) వాననీరెప్పుడు మెరకభూములనుండి పల్లపుభూములకుఁ బ్రవహించుచుం డును- అట్లే భగవంతుని దయారసముఁగూడ దీనులైన ప్రాణులహృదయమునందుఁ బ్ర వహించునుగాని డాంబికము గర్వముగలవారి మనస్సునందుఁ బ్రవహింపదు.

పెద్దగాలికిఁగొట్టుకొనిపోవు యెండాకువలె నీవు గర్వమును విడిచి యుం డుము-

(594) ఒకమహాత్ముఁడు జపమాలఁద్రిప్పుచు భగవన్నామముఁజేయుచుండెడివాఁ డు- ఈయనతో భగవాన్ 'ఎప్పుడు నొక్కస్థలమునందే యుండుదువేమి? ముందుకు వె ళ్లుము'ని చెప్పగా నాయన భగవదనుగ్రహములేనిది యట్లుచేయుటకష్టమని బదులుచెప్పె ను- తిరిగి భగవాన్ 'భగవదనుగ్రహమను వాయువు రాత్రింబగళ్లు వీచుచున్నది- జీవ సముద్రమునందు ద్వరత్వరగాఁబోవలయుననినీ 'మనస్స'ను పడవయొక్క తెరచాపనెత్తు మ'ని సలహానిచ్చెను-

(595) ఈశ్వరానుగ్రహమనుగాలి సతతమువీచుచున్నది- జీవసముద్రముపైఁ ది రుగు సోమరినావికులు దానినుపయోగింపరు- తెలిసినవారెప్పుడు వారిమనస్సులను తెర చాపల నెత్తియుంచెదురు- ఈకారణమువలననే భగవదనుగ్రహవాయు సహాయమువలన త్వరగాఁ దమగమ్యస్థానమునుఁ జేరుదురు-

(596) గాలిలేనంతవఱకు విసరుకొందుము- తరువాత నట్లుచేయుట మానుకొందుము- ఇతరులసహాయములేనంతవఱకు మనము విశేషము కష్టపడవలయును- అట్టి సహాయమేమయిన నుండినయెడల మన మంత పాటుపడనవసరములేదు-

(597) గాలివీచుచుండిన విసనకఱ్ఱలతోఁ బనిలేదు- అట్లే భగవదనుగ్రహముండినఁ బ్రార్థనలతోఁ దపస్సుతోఁ బనిలేదు-

(598) చుంబకీయసూది (Magnetic needle) యుత్తరదిశను జూచుచున్నంతవఱకు, ఓడవలోనుండువారికిఁ గలుగు భయమేమియులేదు- అట్లే జీవనావయొక్క చుంబకీయసూదియైన మనస్సు పరబ్రహ్మమువంకకుఁ దిరిగియున్నంతవఱకు నే భయములేక హాయిగానుండును-

(599) ఈలోకములోనుంచఁబడిన నీవేమిచేయుదువు?

సర్వమును భగవంతునకు విడిచిపెట్టుము- అప్పుడు నీ కేకష్టమునుండదు- ఆయనయిష్టమువలననే సర్వముఁ జేయుచున్నానని తెలుసుకొనెదవు-

(600) ప్రపంచమునువిడిచిపెట్టుట విడిచిపెట్టకనుండుట భగవంతుని యిష్టముపై నున్నది- కనుక సమస్తమును నాయనకేవిడిచి యాయననుమాత్రమేయాసించుకొని పనిఁ జేయుము- నీ వంతకంటె నేమిచేయఁగల్గుదువు?

(601) 'కాంత, భాగ్యము' ఈరెండు లోకమంతఁ బాపములోముంచినవి- నీవు కాంతను నీజగన్మాతరూపముగాఁ జూచుకొనినట్లయిన నామె నీ కేయపాయముఁ జేయఁదలఁచదు-

(602) భక్తునిబలమేది? భక్తుఁడు భగవంతునిపిల్లవాఁడు- ఈయనయేడ్పు లే యాయనకుబలము- యేడ్చుచున్నపిల్లవానికోరికె నెట్లు తల్లితీర్చునో యట్లు దేవుఁడు భక్తుఁడు కోరినదంతయునిచ్చును-

(603) కొన్నివేళల మనస్సునకు శాంతియుండును- ఇయ్యది చిరకాలముండకఁ బోవుటకుఁ గారణమేమి? వెదురుపుడకలతోఁ జేయఁబడినయగ్ని నూదకపోయిన ద్వరలో నారిపోవును- అట్లే యాత్మజ్ఞానమును నిప్పు చల్లారిపోకుండఁ జేయుటకు సంతతశక్తి యవసరము-

(604) నేనుబ్రతికియున్నంతవఱకు నేర్చుకొనెదను-

(605) మొదట మానవుఁడు మనస్సునిల్పుట నేకాంత స్థలమున నభ్యసించవలయును- లేనియెడల ననేకవిషయములు చిత్తచలనముఁ గల్పించును- పాలును నీరును గలిపిన నవి యేకమగుటనిశ్చయము- పాలనుండి వెన్ననుదీసిన నది నీటిలోఁగలియదు- పైనదేలును- సంతతాభ్యాసమువలన మానవుఁడు మనోనిశ్చలతఁగలిగిన నది వానిఁ జుట్టునున్న వారికంటె బాగుపఱచి భగవంతునియందు నిలుపును-

(606) ఆరంభకుఁడు యోగమునభ్యసించుచుండ యొకవిధమయిననిద్రను బొందును- దీనిని యోగనిద్రయందురు- అప్పుడు కొన్ని దైవసంబంధమయిన కలలు వానికి వచ్చును-

(607) యోగములోఁ బరిపూర్ణుఁడయినవానికి ముక్తి చేరువలోనున్నదని యొక సామితకలదు- నరుఁ డెప్పుడు యోగమునందు పూర్ణుఁడగునో నీవుఁదెలియుదువా? యోగాభ్యాసమునకుఁ గూర్చుండినపుడంతయులో భగవంతునిచేఁ జుట్టఁబడి యాతని యాత్మ యీశ్వరునియందు లీనమగునపుడు నరుఁడు యోగమునందు బరిపూర్ణుఁడగును-

(608) సమాధిఁబొందిన నహామును నశింపఁజేయఁజాలుదువు. కాని సామాన్యముగా నహాము నశింపదు. తిన్నగాయుక్తిచేత నాలోచించి చూడుము- తరిమివేసినను నహాము తిరిగితిరిగి నీయొద్దకు వచ్చుచుండును- నేఁడు మనముఁ జెట్టుకొమ్మ పుచ్చట్టును నఱికివేసిన నదిమఱునాఁడు చిగుర్చుచుండును-

(609) దుర్గుణములన్నియుఁబోఁగొట్టుకొని యెంతోకష్టించి విజ్ఞానమునుబొంది సమాధిని సాధింపఁగల్గినపుడు నరున కహంభావత్వము మాయమైపోవును. కాని సమాధిని సాధించుట కడుదుర్లభము. 'అహం' పట్టువదలఁగలది. ఈకారణమువల్లనే లోకములోఁదిరిగి తిరిగి పుట్టుచుండుట తటస్థించుచున్నది-

(610) నీవుముందర భగవంతునిఁజేరి యాయనలోఁ గలిసిపోయుదువు- ఈస్థితినే సమాధియందురు- తిరిగి యక్కడనుండి బయలుదేరి నీయహంభావత్వమును మఱల బొందుదువు. ఇందువలన నహముఁగూడ భగవంతునివల్లనే సృష్టింపఁబడినదని తెలియుచున్నది. 'భగవంతుఁడు, నరుఁడు, ప్రకృతి' ఇవియన్నియు బరమాత్మరూపములే కనుక వీనిలో నొకదాని ననుభవించి నిజముఁ గనుఁగొనిన నన్నింటసత్యమునుఁ గనుఁగొనినట్లే యగును-

(611) సాత్వికస్వభావముఁ గల్గినవాఁడట్లు ధ్యానించునో యెఱుఁగుదువా?

పక్కనే కూర్చుండి యర్ధరాత్రి వేళ యీశ్వరుఁడనను జూడకుండఁ దెరవేసుకొని ప్రార్థించును.

(612) మకరందమును గ్రోలుటకు దుమ్మెద తానంతటనదియే పుష్పమునొద్దకు వచ్చును. ఈవిధముననే చీమలుగూడ మిఠాయియున్న స్థలమునకువచ్చును. ఎవ్వరును వీనినిఁ బిలువనక్కఱలేదు. అట్లే పరిశుద్ధుఁడును బరిపూర్ణుఁడునయిన మానవుని సుప్రవర్తన యొక్క ఫలము నలుదిశలకుఁదనియే వ్యాపించును. ఆయనతనయొద్దకు రావలసినదని పరులఁ బిలువనవసరము లేదు. వారంతటవారే వచ్చుచుందురు.

(613) శ్రీరామచంద్రుఁడు గురువుమాటవిని లోకమునుఁ బరిత్యజించుటకు నిశ్చయించుకొనెను. ఆయన తండ్రియగు దశరథుఁడు వసిష్ఠునిఁబిలిపించి యీసంగతినంతయుఁజెప్పెను. అప్పుడాయన వసిష్ఠుఁడు రామునిఁజూచి, "శ్రీరామా! నీవులోకమును త్యజించుటకుఁబూనితివేని నాకొక్క సంగతిఁ జెప్పుము 'భగవంతుఁడు, ప్రపంచము' ఈ రెండును వేఱువేఱుపదార్థములా? లేక నొకటియేనా? రెండని తలఁచినట్లయిన లోకమును విడువుము" అని పలుకును. అంతట నాలోచనఁజేసి దశరథసుతుఁడును జీవుఁడు ప్రపంచము భగవద్రూపములేయని కనుఁగొనెను. భగవంతునిలో సమస్తముకలవు. కనుక రాముఁడు తిరిగి మాటలాడక యూరకుండెను.

(614) తనయజమానురాలియింటి బిడ్డను జూచి యిది నాయిల్లని దాసీది చెప్పును. ఇట్లు చెప్పినప్పటికీ యామె యది తనయిల్లుకాదనియు, తనస్వగృహమింకొకచోట గలదనియుఁ దెలియును. తానెత్తుకొనిన యజమానురాలి పిల్లవానిఁజూచి, "నాహరి యెప్పుడును అల్లరిఁ జేయుచున్నాఁడు లేక నెప్పుడు నేదయినఁ దినగోరును" అనిపలుకును. ఇప్పుడామెకు 'హరి' తనబిడ్డకాదని తెలియును. నాదగ్గఱకుఁ బ్రపంచమునుఁ బరిత్యజించెదమని వచ్చువారందఱికి నీదాసీదానివలెఁ జెప్పుదును. లోకములోనుండి లోకవ్యవహారములో మునిఁగియుండవలెనని చెప్పుదును. ఎప్పుడును నీశ్వరునిపై మనస్సును నిల్పుమనిగూడఁ జెప్పుదును. భక్తిసంపాదించుకొనుడ"నెదను.

(615) చదువుకొనిన బ్రాహ్మణుఁడొకఁడు రాజుయొద్దకువెళ్ళి, "ఓరాజా! నేను శ్రుతులలోఁ గట్టివాఁడను. మీకుభగవద్గీతను బోధించవలయునని నాకోరిక"ని మనవిఁజేసుకొనెను. ఈ విప్రునికంటెఁ దెలివిఁగలవాఁడగుటవలన రాజు 'భగవద్గీతలఁ జదివిన వాఁడు రాజసంస్థానమునకువచ్చి కీర్తిమర్యాదల సంపాదించఁదలఁచకఁ దనయాత్మనుఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నించున'ని తెలుసుకొని బహిరంగముగా "తమరికే యీ పుస్తక

ము బాగుగారాదని నా యభిప్రాయము. మిమ్ము నాగురువుగాఁ జేసుకొనెదను. కాని మీరిప్పుడు వెళ్ళి యాపుస్తకమును దిరిగి చదువవలసినద''ని చెప్పెను. బ్రాహ్మణుఁ డీ మాటలప్రకారము తిరిగి వెళ్ళుచు 'నేనిన్ని సంవత్సరములనుండి భగవద్గీతఁ జదువుచుంటిని. నేను చదువలేదనుటకు రాజెంత మూర్ఖుఁడోగదా' యనితలఁచుచు నింటికిఁజేరి యింకొక పర్యాయము తద్గ్రంథముఁజదివి రాజుయొద్దకు వెళ్ళెను. ఈయన మొదటజెప్పినట్లే తిరిగి చెప్పిబంపెను. ఈతడవ బ్రాహ్మణునకు విశేషము విసుకుతోచెను. 'రాజిట్లు పలుకుట కు నేదో కారణముండియుండున'ని తలఁచి భగవద్గీత నింకా బాగుగఁ జదువుచుండెను. చదివినకొలఁది గూఢార్థములుతోచుచుండెను. క్రమక్రమముగా నీయనకు 'ధనము, కీర్తి' వీనియందు భ్రమతప్పుచుండెను. అప్పటినుండి సర్వపరిత్యాగముఁజేసి రాజుయొద్దకు వెళ్ళకఁ దనకాలమునంతయుఁ దపస్సుఁజేయుటయందుఁగడపుచుండె. కొన్ని సంవత్సరములయినతరువాత నీ బ్రాహ్మణుఁ డేమిచేయుచున్నాఁడోకనుఁగొనెదమని రా జీయన యింటికిరాగా నీయన (విప్రుఁడు) యమితభక్తిఁగలిగి ప్రేమతో భగవంతునిఁ బూజింపుచుండెను. ఇదిచూచి రా జీయన కాళ్ళమీదఁబడి 'శ్రుత్యర్థ మిప్పుడు మీకు తెలిసినట్లు నాకుఁదోచుచున్నది. ఇప్పుడు మీరనుగ్రహించిన నేను మీ శిష్యుఁడనగుదున'ని వచించెను.

(616) జూలై నెలలో నొక చిన్న మేకపిల్ల తనతల్లిఁజూచి 'నాకు రోజ్ పుష్పములఁ (ఇవి నవంబరు నెలలోనుండును) దినవలయునని కోరికగలద'ని చెప్పెను. అప్పుడుతల్లి మేక 'అవితినుట నీవనుకొనునంత దేలికపనికాదు. వానికొఱకిప్పుడు చాలాకష్టముల ననుభవింపవలయును. రాబోవు సెప్టెంబరక్టోబరు నెలలకు నడుమకాల మంతమంచిదికాదు. ఏలయనిన నీవు తిరుగునపుడెవ్వరో యొకరు నిన్ను కాళికిబలినిచ్చుటకుఁ గొనిపోవుదురు. దీనిఁ దప్పించుకొనినవెంటనే 'జగద్ధాత్రి' పూజాదినములువచ్చును. అప్పుడు మన మంగళమంతయు మృతిఁజెందును. నీవీగండము లన్నిఁటినిఁ దప్పించుకొనినయెడల నవంబరులో రోజ్ పుష్పములఁ దినవచ్చున'ని బదులుపల్కెను. ఈతల్లి మేకనుజూచి మనము మనకోరికలన్నిఁటిని నెఱవేర్చుకొనుటకుఁ దలఁచఁగూడదు. మనజీవితములలో మనమనుభవించవలసియున్న పలుకష్టముల జ్ఞప్తికిఁదెచ్చుకొని మనలేతమనస్సు (అజ్ఞానమునందున్న మనస్సు) కోరునదంతయు నెఱవేర్చుటకు మనముతలఁచఁగూడదు.

(617) లోకములో నందతిగర్వములు క్రమక్రమముగా నశింపవచ్చునుగాని తన ఋషిత్వమునుఁగూర్చి ఋషికిఁగలగర్వము నశించుట కడుదుర్లభము.

(618) నేను నీకుఁజెప్పినదంతయు నీవుచేయఁగలవా?

ఉ॥ నేను చెప్పుదానిలో బదునాలవవంతుఁ జేసిన నీవు నీ గమ్యస్థానమును జేరుదువు. ముక్తిని బొందుదువు. ఇది నిస్సంశయము-

(619) "ఓ జగన్మాతా, 'నే నధికుఁడననియు బ్రాహ్మణుఁడ ననియు, వారు మాలలనియు' దలఁచు నాబుద్ధిని నశింపఁజేయుము. ఏలయనిన సర్వజనులు నీరూపములే కాని పరులుకారు".

"ఓజగన్మాతా! నాకుఁబ్రజలు మర్యాదఁ జేయునవసరములేదు- నాకు శరీరసుఖమువద్దు- గంగానదిలో యమున కలియునట్లు నాయాత్మనుఁ బరమాత్మలోఁ గలుపుము- నాకుభక్తిలేదు. యోగమెఱుఁగను- దీనుడను, మిత్రహీనుఁడను, పరులమెప్పుతో నాఁకు బనిలేదు. మీపాదపద్మములపై సతతము నామనమునుంచుటయే నాకోరిక."

(621) "ఓజగన్మాతా! నేను యంత్రమును, నీవు యంత్రివి- (యంత్రమును బనిజేయించువాఁడు). నేను స్థలమును, నీవందుండువాఁడవు- నేను పాదిని, నీవుకర్త్రివి. నేను రథమును, నీవు సారధివి- నీవేమిచేయుమనిన నేనుదానిఁ జేయుదును. నీవు నన్ను మాట్లాడుమనుదానిని మాట్లాడుదును. నీవెట్లుప్రవర్తించిన నేనట్లు ప్రవర్తింతును. నేను కాదు. నేనుకాదు. నీవే, సర్వమును నీవేయైయున్నావు.

మహాపురుషుఁడయిన శ్రీరామకృష్ణ పరమహంస జీవితము నాయనబోధించిన యుపదేశ వాక్యములను వ్రాయుట యిప్పుడు ముగిసినది. అనాదికాలము నుండియు ననుపమానమయిన చారిత్రఁగల్గిన మనదేశమునకుఁ బరబ్రహ్మజ్ఞాన విషయమున మరణావస్థ సంభవించనున్నపుడు తిరిగి యీకథానాయకుఁడు జీవరసమునుబోసి బ్రతికించినాఁడు. ఇమ్మహామహుని వాక్యముల కనుకూలముగా లోకమంతయుఁ ద్వరలో నడచుకొనును గాక! మనదేశమునకు నిజమయినకీర్తిని సంపాదించిన ఋషులలో నీయన చివరవాఁడు. పూర్వము విశేషమయిన యాత్మికజ్ఞానముఁగల్గి దిగంతములవఱకు వ్యాపించిన ప్రఖ్యాతిఁ గాంచి యిప్పుడొకయించుక తగ్గియున్న హిందూదేశమునదిరిగి యగ్రస్థానమునందు నిలిపిన జగదేకపూజ్యుఁడీ శ్రీరామకృష్ణ పరమహంస.

సమాప్తము.



